నిత్యజీవితములో

# సాలగ్రామములు

గ్రంథకర్త, సంపాదకులు :

నవగ్రహారాధన, నిత్య జీవితంలో రుద్రాక్షలు-నవరత్నాల గ్రంథకర్త :


**డా॥ ఆదిపూడి వెంకట శివసాయిరామ్**

గుంటూరు





ప్రకాశకులు : ☎ 246 2565

**మోహన్ పబ్లికేషన్స్**

అజంతా హోటల్ ఎదురుగా,

కోటగుమ్మం, రాజమండ్రి -1.

కాపీరైట్ 2012 వెల : 90-00


నిత్యజీవితములో సాలగ్రామములు


**డా॥ ఆదిపూడి వేంకట-శివసాయిరామ్**

డోర్.నెం. 4-7-84, కొరిటెపాడు,

గాంధీబొమ్మ బజారు, గుంటూరు-7.

ఫోన్ : (0863) 2353321, సెల్ : 94402 62421



© సర్వహక్కులు ప్రకాశకులవి :



ముద్రణ :

**కోలా ఆఫ్‌సెట్**

కుమ్మరశెట్టివారి వీధి, రాజమండ్రి.

ప్రకాశకులు :

**మోహన్ పబ్లికేషన్స్**

కోటగుమ్మం, రాజమండ్రి - 533 101.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....



## ముందుమాట

శ్రీ ఆదిపూడి వారు నాకు సుపరిచితులు. వారిచే రచింపబడిన గ్రంథములు అన్నియు చదివినాను. ఒక మారు వారు సాలగ్రామములు గురించి ఒక పుస్తకము రచన చేస్తున్నాను అని చెప్పగానే నేను ఎంతో సంతోషముతో నా వద్ద ఉన్న సాలగ్రామముల సమాచారము అందజేసితిని. కొంత కాలము తరువాత వారు నా వద్దకు వచ్చి మీరు అందచేసిన సమాచారముతో తక్కువ పేజీలు మాత్రమే వచ్చినది అని భావన వ్యక్తము చేయగానే నావద్ద ఉన్న సాలగ్రామ గ్రంథములు. మరియు నేను సేకరించిన సాలగ్రామములకు ఫోటోలు తీయించి వారికి అందచేసి నాను. ఇంతవరకు సాలగ్రామములపై పెద్ద గ్రంథము తెలుగులో వెలువడలేదు. కేవలము పెద్ద గ్రంథములు సాలగ్రామములుపై ఇంగ్లీషుకే పరిమితమైనవి. కావున తెలుగు పాఠకులకు ఈ గ్రంథము ఒక మణిపూస వంటిదిగా భావిస్తున్నాను. సాలగ్రామములపై గ్రంథము వెలవరించిన శ్రీ ఆదిపూడి వారు ధన్యజీవులు. పాఠకులు ఈ గ్రంథమును ఆదరించి, తప్పక విజయము చేకూరుస్తారని ఆశిస్తూ....

**శ్రీ చేగుకామేశ్వరరావు**
గుంటూరు



## ఈ గ్రంథమునకు సహకరించిన గ్రంథములు

1. అనేక, పురాణములు, శాస్త్ర గ్రంథములు,
2. సంస్కృత గ్రంథములు
3. "Salagrama- Kosha" volume one, Two,written by S.k.Ramachandra Rao Published by cheif Editor Daivajna K.N. Somayaji (Kalpateru Research Acdemy. Banglore.)
4. తెలుగులో అనేక గ్రంథములు
5. "నిత్యాహ్నిక దీపిక" అనుగ్రంథము

**Our Sincere thanks**
**ధన్యవాదములతో**
**వీరందరికి పేరు పేరునా కృతజ్ఞతలు తెలియజేయుచున్నాము.**

భవదీయుడు
ఆదిపూడి వెంకట శివసాయిరాం
గుంటూరు

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





## ఒక మనవి

నిత్యజీవితములో రుద్రాక్షలు, నవరత్నములు,నవగ్రహాలు, వృక్షదేవతలు, పండుగలు, పర్వదినాల గురించి వ్రాస్తున్నప్పుడు సాలగ్రామములు గురించి వ్రాయాలని సంకల్పము కలిగినది. కాని సాలగ్రామములు గురించి వ్రాయటము కష్టతరమైన పని అని వ్రాయడం ప్రారంభించి తరువాత అర్థమైనది. ఎక్కడ చూసిన చాలా తక్కువ సమాచారము తప్ప కనపడలేదు. నాకు సమాచారము అందచేసిన శ్రీ చేగు కామేశ్వరరావు గారు ధన్యజీవులు. Salagrama kosha written by.S.K. Ramachadra Rao గారి ఒక అద్భుత గ్రంథము. చిన్నతనము నుండి దైవపూజలో సాలగ్రామ అభిషేకం చేయడం, నైవేద్యం సమర్పించటంవల్ల నాకు సాలగ్రామములపై గ్రంథము వ్రాసే భాగ్యము కలిగినది. మా నాన్నగారు శ్రీ గురుదేవుల ఆదిపూడి మోహనరావుగారి వద్ద నుండి వంశపారం పర్యముగా సాలగ్రామములుగా పూజ మందిరములో ఉన్నవి. కృష్ణనదీ పుష్కరములలో, శ్రీ కూర్మ క్షేత్రములో సాలగ్రామ దానం చేసిన తరువాత నేను రచన ప్రారంభించినాను. సాలగ్రామములపై ఈ గ్రంథము మొట్ట మొదటి గ్రంథముగా గ్రహించగలరు.

పాఠకులు ఈ విషయము గమనించ ప్రార్థన. ఈ గ్రంథమును తప్పక ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

సదా శ్రీ సాయి సేవలో

**ఆదిపూడి వెంకట శివసాయిరాం.**

**ఈ గ్రంథముపై అభిప్రాయము కార్డు ద్వారా తెలుపగలరు.**





### మీరు సాలగ్రామ దానం చేయాలి అనుకుంటున్నారా?

1. క్రొత్తగా నిర్మించిన వైష్ణవ దేవాలయములో దానం చేయండి
2. మీ ఊరిలో ఉన్న వైష్ణవ శ్రీవేంకటేశ్వర, శ్రీరామ,శ్రీకృష్ణ, నృసింహ దేవాలయములో దానం చేయండి
3. 108 లేక 54 సాలగ్రామములు గాని వెండితో చుట్టించి ఒక మాల (శ్రీరామ, శ్రీకృష్ణ, వేంకటేశ్వర, నృసింహ) మూల విరాట్టును సమర్పిం చండి.
4. ముఖ్యంగా, వేంకటేశ్వర, నరసింహ, శ్రీరామ, శ్రీకృష్ణ, విష్ణుదేవాయములో సాలగ్రామ దానాలు చాలా శ్రేష్ఠము.
5. చిన్న సాలగ్రామములు మీ పూజ మందిరములో పూజించండి.

అయితే కావాలసినవారు ఈ క్రింది అడ్రసు సంప్రదించగలరు.

**సాయిజ్యోతిషవాణి**

4-7-84, కొరిటిపాడు,

గుంటూరు -7, ఫోన్:2353321(0863)

రిప్లైకార్డులో వెంటనే ఉత్తరము వ్రాసి తెలుసుకోనగలరు.

M .ICATIONS.COM

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....







# అంకితం




శ్రీకాకుళం జిల్లాలోని శ్రీ కూర్మంలో వెలిసియున్న శ్రీకూర్మనాథస్వామి వారికి ఈ గ్రంథమును పాదారవిందములకు శతకోటి నమస్కారములతో సమర్పిస్తున్నాను.

డా || ఆదిపూడి





## మీకు అద్భుత గ్రంథము ఒక బహుమతిగా సమర్పిస్తున్నాను

శ్రీ-----------------------------------------

గారికి సందర్భముగా-----------------------------------

-----------------------------------------------

"నిత్య జీవితములో సాలగ్రామములు"
అను గ్రంథమును బహుమతి సమర్పి స్తున్నాను.

ఎవరికి ఈ గ్రంథమును బహుమతిగా యివ్వాలి?

* మీ దగ్గరలో వైష్ణవ దేవాలయములో పూజారులకు బహుమతిగా ఇవ్వండి.
* మీ దగ్గరలో ఉన్న శ్రీరామ, శ్రీకృష్ణ, వేంకటేశ్వర, నరసింహ, దేవాలయములో ప్రధాన అర్చకులకు ఈ గ్రంథముగా సమర్పించండి.
* మీకు పరిచయము ఉన్న శ్రీ వైష్ణవులకు ఈ గ్రంథము సమర్పించండి.
* మీరు వెళ్ళిన వైష్ణవక్షేత్రములలోని ఆలయ అర్చకులకు బహుమతిగా యివ్వండి.
* విష్ణు, వేంకటేశ్వర,శ్రీరామ, శ్రీకృష్ణ, పూజచేసే వారికి మీ గుర్తుగా ఈ గ్రంథమును బహూకరించండి. వారి వారి ఆశీస్సులు మీ ఆజన్మాంతము మీపై వర్షిస్తాయి.

-డా || ఆదిపూడి

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....



## విషయసూచిక



MOHANPUBLICATIONS.COM
మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





## నిత్యజీవితములో

# సాలగ్రామములు

### 1వ అధ్యాయము

**తులసి శాపానికి సాలగ్రామ రూపం దాల్చిన శ్రీ మహా విష్ణువు :**

రుద్రాక్ష రుద్రాణి రూపమేనని, సాలగ్రామం శ్రీ మహావిష్ణువు అని నానుడిగా వింటూంటం. అసలు సాలగ్రామాన్ని శ్రీ మహావిష్ణువుగా ఎందు కంటారో తెలుసు కోవాలని ఎక్కువ ఆసక్తి చూపించం. అసలు ఈ రహస్యం వింటే చాలా ఆశ్చర్య మేస్తుంది.

రాతిని చెక్కి, దేవుడి శిలగా మలచి, విగ్రహంగా తయారుచేసి, ప్రతిష్ఠ చేయబడి పూజలందుకుంటాడు ఆ పరమాత్మ. అంటే ఆ విగ్రహం రూపు దాల్చడానికి ముందు పనికిరాని బండరాయో, కొండరాయో. అంటే, రాతిలో దేవుడున్నాడు. అందుకేనేమో సాలగ్రామంగా పిలువబడే రాతినే శ్రీ మహావిష్ణువు అంటారు. ఇది కొంత తర్కంగా నిజమేమోకానీ, సంపూర్ణ సమ్మతంకాదు. ఏరాయికీలేని సాలగ్రామంపేరు ప్రత్యేకమైన రాళ్ళకే ఎందుకు పెట్టారు? పాలరాయి, ఇటుకరాయి, నల్లరాయి, గుండ్రాయిలాగా ఇదొక రాయి రకమా? కానేకాదు, రాతిలో రకంకాదు, ఇది శాపానికిగురై రాయిగా మారిన మహావిష్ణువు.

**విరజ అనే గోపిక తిరుమల శ్రీనివాసుని పాదాల చెంత పారే విరజా నదిగా ఎలా మారింది ?**

గోలోక పుణ్యస్త్రీ అయిన రాధాదేవి, విరజ అనే గోపికతో అల్లరి కృష్ణుడు, రాసక్రీడ జరుపుతుండగా చూచి, విరజను చంచలమైనదిగా మారిపొమ్మని శపిస్తుంది. అదే నేటి తిరుమల శ్రీనివాసుని పాదాల చెంత పారే విరజానది. అందుకే ఆనదికి అంతటి పవిత్రత. విరజను చూచిందే కానీ, రాధమ్మకు శ్రీకృష్ణుడు కనబడలేదు. సర్వవ్యాపి, లీలావినోదికదా.. అందుకే రాధకనులు తనను గాచేలోపుగా తన ఆప్తమిత్రుడైన సుధాముడిని చేరుకొన్నాడు.



**రాధ శపించిన సుధాముడు :**

ఆదిశక్తి అంశఅయిన రాధ సుధాముని కడకేగి వాకబుచేసింది. అబద్ధమాడబోయాడు శ్రీకృష్ణుని పరమభక్తుడైన సుధాముడు. ఆగ్రహించిన రాధ సుధాముడిని రాక్షసుడు కమ్మని శపించినది. సుధాముడి కన్నీటికి కరిగిన గోపికానాధుడు, రాబోయే జన్మలో సుధాముడు పరమ పావనమైన శంఖచూడుడుగా రాక్షసకులమందు జన్మించి శ్రీమహాలక్ష్మి అంశ అయిన తులసిని అర్ధాంగిగాపొంది, దేవతలచే అంతమొంది, తన ఆది అవతారమైన విరాట్స్వరూపంలో చేరగలడని, శంఖచూడుడుగా తన అంశ ఛాయలను పొందగలడని వరమొసగి, భవిష్యత్తు వివరించాడు. అలా శాపగ్రస్తుడై శంఖచూడుడయ్యాడు పుణ్యచరితుడైన సుధాముడు.

**రాధ శాపం ఎందుకంత శక్తివంతం ?**

ప్రేమ పిపాసిగా కీర్తింపబడే ప్రణయమూర్తి శాపానికి అంత శక్తి వుండట మేమిటి? అసలు కృష్ణపరమాత్మ రాధకు జంకడమేమిటి? అవును...మరి రాధ శక్తి స్వరూపిణి మాత్రమేకాదు. ఈ అనంత సృష్టికి ముందుగల శూన్యంలో విరాట్స్వరూపం మాత్రమే వుండే తొలిదశలో, ప్రకృతి నుండి ఐదుశక్తులు ఉద్భవించాయి. ఆ ఐదు శక్తులే 1. దుర్గ 2. రాధ 3. లక్ష్మి 4.సరస్వతి 5. గాయత్రి. ఈ ఐదు శక్తులలో పంచశక్తి అయిన రాధ మూలప్రకృతి కుడిభాగం నుండి తొలిశక్తిగా ఉద్భవించింది. అందుకే రాధాదేవి అంటారు. గోలోక నిర్మాణం ఈమె ద్వారా జరగడమే కాక, విశ్వంలో స్త్రీత్వం ఈమె అంశమే. అయితే యుగధర్మాల రీతిగా లీలావినోది, మాయాపురుషుడైన శ్రీమహావిష్ణువు శ్రీకృష్ణుడుగా అవతరించి, రాధకు ఆరాధకుడై రాధామాధవుడై, రాధను ప్రణయమూర్తిగా లోకాన నిలిపాడు. అయితే సదా శ్రీ కృష్ణపరమాత్మ తన అంతర్మథనంలో యోగ పురుషుడు రాధాదేవిని ధ్యానించి, పూజిస్తూనే వుంటాడన్నది ఖచ్చితమైనది. అందుకే రాధాదేవి శాపం అంటే గోలోకం గడగడలాడుతుంది. గంగశాపంతో లక్ష్మీదేవి పద్మనదిగానూ, ధర్వధ్వజుడు, మాధవిలకు తులసి గానూ జన్మించింది. శుక్లపక్ష చంద్రునివలె ఎదుగుతూ, తనలో జ్ఞానం, సంస్కారం, నీతి, పాతివ్రత్యం హంగులు పెంచుకుంటోంది తులసి. సంపూర్ణ వివాహ యోగ్య రాలైన తులసికి ఒకనాడు ఉద్యానవనంలో శంఖ చూడుడు అయిన సుధాముడు ఎదురయ్యాడు. మనసులు కలిశాయి. ముహూర్తాలు కుదిరాయి. శాస్త్రోక్తంగా వివాహం జరిగింది.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





పుణ్యవతి, శీలవతి, పతివ్రత అయిన తులసి రాక్షస కులాగ్రేసరునితో బ్రహ్మవరప్రసాద ఫలితంగా స్వేచ్ఛాపూరిత అనంత అద్భుత శృంగార వినోదాలతో విహరింపసాగింది. ఈ వివరాలు తెలుసుకునే వాత్స్యా యనుడు శృంగార సూత్రాలు లోకానికి అందజేశాడేమో! ఇక్కడ దేవదేవుల స్వరూపాలకు శృంగారమేమిటా అని నిమ్నంగా తలంపరాదు. సృష్టికి మూలం శృంగారం. దంపతుల సంబంధం మరింతగా దృఢపరిచి, వారిని అన్యోన్యానురాగాలు మూర్తీభవించిన ఏకస్వరూపంగా చేసేది శృంగారమే.

వివాహానంతరం దంపతుల పరిపూర్ణ ప్రేమను వ్యక్తపరచే అనురాగ సారధి శృంగారం. అదొకయోగం. అదొక యజ్ఞం. అదొక తపస్సు, సృష్టిని బ్రహ్మ నియంత్రిస్తే, బ్రహ్మదేవుని ఆదేశం మేరకు సృష్టిచేయడానికి ఉపయోగపడే సృష్టికార్యం అయిన శృంగారం దంపతులను పుణ్యవంతు లను చేసే సంపూర్ణత్వం. ఈలోతైన నిండు నిజం తెలిసిన దేవదేవులు శృంగార పవిత్ర కార్యాన్ని ఏకొదవలేకుండా సాగించి, రతీమన్మధులను తృప్తి పరచుతారు. శంఖచూడుడు శాపప్రభావంగా అసురకులంలో పుట్టాడేకానీ, అనేకానేక శుభకార్యాలూ పుణ్యకార్యాలూ చేస్తూ సత్ప్రవర్తన కలిగినవాడు. సకల శుభసద్గుణ సౌందర్య శోభితుడు కనుకనే, లక్ష్మీరూపి తులసికి తగిన వరుడయ్యాడు. తులసీ సాంగత్యంలో మరింత సంపూర్ణుడయ్యాడు. వరాలు ఎంతగా ప్రభావం చూపుతాయో, శాపాలు కూడా అంతే! ఆ కారణంగానే మానవకులంలో జన్మించిన సాక్షాత్తు శ్రీమహావిష్ణువు మానవులు పొందే అన్ని కష్టసుఖాలు పొందాడు. కలియుగంలో మానవుడై అప్పుచేసి, వడ్డీలకు వడ్డీలు కడుతున్నాడు శ్రీనివాసుడు. ఆత్మలింగాన్ని చేజిక్కించుకున్న అమోఘతపశ్శాలి, ధీరుడు, పుణ్యవంతుడు అయిన రావణబ్రహ్మ అసురకులంలో పుట్టాడు గనుకనే ఆదిస్త్రీమూర్తి, తొలిపతివ్రత, పుణ్యస్వరూపి, జగన్మాత అయిన సీతాదేవిని చేపట్ట ప్రయత్నించాడు. అలాగే శంఖచూడుడు కూడ ఎన్నో విశేషగుణాలు కలిగి, తన తపఃపూజ లతో బ్రహ్మాది దేవతలను మెప్పించి, అనేకానేక వరాలను పొందిన అసురకుల నందనుడు. ఒకవైపు తులసితో సంపూర్ణ దాంపత్యంచేస్తూనే, మరోవైపు రాక్షసమాయో, దైవ మాయో తెలీక దేవాది దేవతలపై దండెత్తి, ఇంద్రాది దైవపదవులను సొంతం చేసుకున్నాడు. లోకపాలకులే నిస్సహాయ స్థితికిరాగానే, శంఖ చూడునిలో గర్వం, అహం తొంగిచూసాయి. దుష్కృత్యాలు ప్రారంభించాడు. అంటే



అతని పుణ్యఫలం అయిపోయి పాపం ప్రారంభమయి అతని అంతం జరగబోతోందన్నమాట. దిక్కుతోచక అం దరూ బయలుదేరి వైకుంఠానికి చేరుకుని, మాయా లీలావినోది, చిద్విలాసి అయిన శ్రీమన్నారాయణుడికి తమబాధలు విన్నవించుకున్నారు. రెప్ప పాటులో సర్వం గ్రహించిన భగవానుడు, తులసి సృష్ట్యాదిలో తన ప్రియసఖి అని, శాపప్రభావంతో భూలోకంలో స్త్రీగాజన్మించిందని, శంఖచూడుడు తనఅంశమే అని, ఇక శంఖ చూడుడు తనలో లీనమవాల్సిన సమయం ఆసన్నమయిందని, తులసి రూపంనుంచి లోకాన పూజింపబడే మొక్కగా రూపాంతరమొంది యుగ యుగాలలో పూజలు బడసి, సంపూర్ణ ప్రళయాంతంలో తను విరాట్స్వరూప అవతారమెత్తాక, తనలో చేరాలని, ఇదంతా జరగాలంటే ముందు శంఖచూడుడు మృత్యువాతపడి ఆ జీవుని రూపంవదలి చిదాత్మకావాలని, అలా శంఖచూడుని జీవాత్మ వేరు కావాలంటే తులసి పాతివ్రత్య భంగం కలగాలని, అది తానే చేస్తానని సవిస్తరంగా పలికి వారిని శాంతింపజేసి పంపించాడు.

MOHANPUBLICATIONS.COM

**తులసీ పాతివ్రత్య భంగం :**

శంఖచూడుడే సర్వంగా మనోవాక్కాయ కర్మలద్వారా పవిత్రంగా పతిసేవలో,పతి రతీసేవలో నియమంగా అంకితమైపోయివుంది తులసి. ఒకశుభముహూర్తపు వేళలో శంఖచూడుడు ఇంటలేని సమయంలో శ్రీమహావిష్ణువు శంఖచూడుని రూపందాల్చి, తులసితో సంగమించాడు కారణజన్ముడు. కలిమాయో, దైవలీలో నిర్ణయించలేంకానీ, సంగమం సంపూర్ణమయ్యేదాకా కనుగొనలేకపోయింది తులసి జరగాల్సిన భంగం జరిగాక, నిజమెరిగి "ఓరీ! నీవెంత దైవమైనా, సాధ్వీశిరోమణుల శక్తిముందు పనికిరాని బేలవే. నేను మనసావాచా శంఖచూడుని భార్యగానే జననయానం చేసినదాననే అయితే, ఒక పతివ్రతా స్త్రీని మోహావేశంతో కామించి, భర్తరూపంలో సంగమించే టంత శిలాగుణం కలిగిననీవు యుగాలందు పాషాణమై పోవుగాక" అని శపించింది.

కంగారుపడలేదు భవిష్యదర్శి. తొణకని చిద్విలాసంతో నిదానంగా వివరించాడు. "తులసీ! సృష్ట్యాదిలోని నా అనంత రూపంలో నీవు నాసతి శ్రీమహాలక్ష్మివి. సవతి శాపప్రభావంగా ఒకచోట నదిగానూ, మరొకచోట ఇలా తులసిగానూ జన్మించావు. ఆ నా విరాట్స్వరూపంలో సకల సంపూర్ణ

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





సద్గుణశాలివై, సదాచారివై, నన్నే త్రికాలము లలో, మనోవాక్కాయ కర్మము లలో ప్రేమించి సేవించి పూజించి నన్నుతప్ప ఎవర్నీ నీదరికి చేర్చనివ్వ లేనని, నన్ను వీడలేనని మొరపెట్టుకొన్నావు. ఆదిశక్తుల శాపం ఉపసంహ రించలేని నేను నీమొరను మరొక రకంగా తీర్చాను. శ్రీమహాలక్ష్మి అంశగా నీవు జన్మించినట్లే, నా అంశగా, ప్రకృతిలోని పూర్ణాంశమైన రాధాదేవి శాపప్రభావంగా రాక్షసకులంలో శంఖచూడుడు పుట్టాడు. అంశలుగా జన్మించిన మనమిరువురమే దంపతులమైనాము. ఇక నీ స్త్రీరూపుపోయి మొక్కగా మారాల్సిన సమయం ఆసన్న మయ్యింది. నీవు మొక్కగా మారి పోతే, నిన్ను వీడలేని నేను, నా అంశ అయిన శంఖచూడుడు పరమాత్మలో లీనమవ్వాలి. ఇలా నీవు మొక్కవవ్వాలంటే, అసలు రహస్యం నీకెరుకఅయి, నన్నే సదా ప్రేమించిన నీ అసలు రూపానికి స్వంతమైన నేనే నిన్నుతాకి, నీ తులసీ జన్మకు పరిపూర్ణతనిచ్చి,నిన్ను మొక్కను చేయాలి. అంశవే అయినా నాప్రియసఖివిగనుక, నా సంగమమే నీ పాతివ్రత్యానికి సంపూర్ణత. ఇది నీ పాతివ్రత్యభంగంకాదు. అట్లే స్త్రీ సహజతొందరపాటుతో నీవిచ్చిన శాపం లోకవాసులకు ఉపయోగకరము, పూజ్యనీయము. నీ శాపంలో భూలోకాన మరొక ప్రాణిసృష్టి జరుగనున్నది. అంతేకాదు, ఏరూపంలోనూ, జన్మలోనూ, అవతారంలోనూ నిన్నువీడబోను, అలా నేను వుండలేను. అందుకే నీ శాపప్రభావన నేను 'సాలగ్రామం' అనే పేరిట రాయినవుతాను. నీవు నన్ను దాచుకునే 'గండకీ' నదివికాగలవు. గండకీనదియందు మాత్రమే నేనుండ గలను.నా రూపాంతరమైన సాలగ్రామం నా అవతారాలను సూచించే గుణాలతో, రూపాంతరం చెంది ఒక్కొక్క సాలగ్రామం ఒక్కొక్క దేవతా రూపంగా భక్తులచే ఆరాధింపబడుతుంది. ఏరూపంలేని నాకు నిర్వి కార రూపమైన సాలగ్రామ ఆరాధన ప్రీతికరం. ఆపూజాఫలం వలన లోకులు సకల శుభాలను పొందగలరు. నా స్వరూపమైన సాలగ్రామం అగ్నితో సమానమైన స్వర్గమును పొంది పవిత్రంగా వుండగలదు. ఇక, శంఖచూడుడు జన్మచాలింపగలడు. నీవు మొక్క కాగలవు. తుది ప్రళ యాంతమున ఈ రూపాలు, అవతారాలు, శాపాలు శూన్యమై నేను చిదా త్మగా విరాట్స్వ రూపమైనపుడు నీవు ఈ మొక్క రూపం వదిలి నన్నే చేరుకుం టావు. నదీనదాలు, సాగరాలు అన్నీ నాలో ఐక్యమొందగలవు- అని వివరించాడు. శాంతిపడిన తులసి, అత్యంత భక్తిగా శ్రద్ధగా సాగనంపింది శ్రీమన్నా రాయణుడిని. దేవతలు బలం పుంజుకున్నారు. దేవదానవుల యుద్ధంలో



శంఖ చూడుడు పరమాత్మలో చేరాడు. మాయవల్ల మరల తులసి సర్వంమరచి విలపింపసాగింది. బ్రహ్మదేవుడు మరల తులసికి ఆమె జన్మ వృత్తాంతాలు వివరించాడు. నిజమెరిగిన తులసి అగ్నికి సమర్పణమయి, ఆత్మమరల లోకోత్తర పూజ్యనీయమైన తులసి మొక్కగా జన్మమెత్తింది.

**గండకీ నది :**

పుణ్యభారతదేశాన సుగంధపుష్ప ఫలశోభితమై సాధుసజ్జనుల పాద ధూళీ విరాజితమై వీరోచిత ధర్మపాలనా క్షత్రియులగడ్డయై పంచాగ్నుల ప్రభావంతో దేదీప్య మానంగా బ్రాహ్మణ తేజస్సును పొంది నిత్యప్రకాశమై, సకల లలిత కళాకౌశలమై, నిర్మలమై, సదాచారమై, అహోరాత్రాలు నిస్వార్థ సేవాపూరిత శ్రమైక జీవనాన్ని గడిపే కృషీవలుల నిజాయితీ సరిహద్దుయై వర్తక వాణిజ్య సద్ధర్మబుద్ధి బలంతో అలరారుతున్న హిమవత్పర్వత, ప్రాంత భూమి అయిన (నేటి నేపాల్ భూభాగం) నైమిశారణ్య ప్రాంతంలో తులసి ఆత్మార్పణానంతరం మరొక అంశతో పుణ్యగండకీ నదిగా నిర్మలంగా ప్రవహింపసాగింది. ఆనది నేటి నేపాల్‌లో పుట్టి హిందూదేశంలో చేరింది. హిందూదేశ ఒడ్డున మాత్రమే విష్ణుమూర్తి స్వరూపమైన సాలగ్రామాలు లభ్యమవుతాయి.

**సాలగ్రామ వివరణ :**

సాక్షాత్తు శ్రీలక్ష్మి సర్వాంతర్యామినే శపించింది. ఆ పాషాణమే సాలగ్రామం. అందుకే సాలగ్రామం శ్రీమహావిష్ణువే అంటారు. పరమాత్మ ఆశయం మేరకు, సాలగ్రామ పాషాణంలో ఒక పురుగువంటిది వుంటుంది. అది సదా బంగారం విసర్జిస్తూ వుంటుంది. తదితర ప్రాణులలాగానే అది కూడా ఎదుగుతూ ఉంటుంది. అది ఎంతగా ఎదిగితే, ఈ సాలగ్రామం కూడా అంతగా పెద్దదవుతుంది. అందులో బంగారం శాతం కూడా పెరుగు తుంది. ఆ పురుగు తన స్వాభావిక గుణంతో ఆ సాలగ్రామాన్ని ఎప్పుడూ తొలుస్తూ రంధ్రాలు చేస్తూంటుంది. ఆ రంధ్రాలే ఆ సాలగ్రామం విష్ణుమూర్తి ఏ అవతారమో నిర్ణయించడానికి సూచన.

12 రంధ్రాలుగల సాలగ్రామం అనంతపద్మనాభస్వామిగానూ, మూడు రంధ్రాలు గలదైతే సీతారామ లక్ష్మణులుగానూ, నాలుగు గుండ్రటి రంధ్రాలు, ఒక పొడవాటి రంధ్రంవుంటే లక్ష్మీనారాయణులుగానూ, నాలుగు పొడవాటి రంధ్రాలు, రెండు పొడవాటి రంధ్రాలు, రెండు గుండ్రటి

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





రంధ్రాలు వుంటే చతుర్ముఖుడుగాను, రెండు పెద్ద గుండ్రటి రంధ్రాలు నరసింహస్వామిగాను, రెండు రంధ్రాలతోపాటు వరమాలతో నల్లరంగులో అతిపెద్దదిగా వుంటే గోపాలకృష్ణుడుగానూ గుర్తించాలి. మన ప్రభుత్వం ఈ సాలగ్రామాలను తీసి, ఒక కెమికల్ కలిపిన వేన్నీళ్ళలో వేస్తారు. ఆ పురుగు మృతినొంది, వెలువడి, బంగారం వేరు పడుతుంది. బంగారం, పురుగు వేరుపడిన సాలగ్రామాన్ని భక్తులకు ఆల యాలకు, ఆధ్యాత్మిక కేంద్రాలకుఇస్తారు. భగవంతుడి సృష్టి అయిన పురుగును చంపడమేమిటని పించవచ్చు. కానీ ఇది జరగాల్సిన ప్రక్రియ. పురుగుతోవున్న సాలగ్రామం ఇళ్ళల్లో వుంచితే, ఆ సాలగ్రామం పురుగుతోబాటు పెరుగుతూనే వుంటుంది.

కొంతకాలానికి అందులోనే మృతిచెందుతుంది. జీవికి మరణం అనివార్యంకదా! ఆ సంగతి గ్రహింపవీలుకాదు. భక్తులు పూజాదికాలు చేస్తూనే వుంటారు. అప్పుడు ఆ పూజ మృతజీవి పూజ అవుతుందేకానీ, దేవుని పూజకాదు. అందుకే, పురుగును చంపడం పాపం కాదు. అలానే, బంగారం కలిగిన సాలగ్రామం వుంటే, కలియు గంలో దానిని పగులకొట్టి బంగారం తీసుకోవడానికి ప్రయత్నాలు జరుగుతాయి. అందుకే, బంగారం వేరుపడాలి. ఏదిఏమైనా సాలగ్రామం సాక్షాత్తు శ్రీమన్నారాయ ణుడి రూపమే! సాలగ్రామం కొనాలంటే కొనలేం. పరంధాముడు ఎవరివద్దకు వెళ్ళి చేరాలనుకుంటాడో వారు మాత్రమే పొందగలరు. సాలగ్రామం ఇంట్లోవుంటే పురాణాలలో చెప్పే మడి, నిష్ఠలు వుండాలి. నిత్యపూజ, నిత్యదేవతార్చన చేయాలి. ఆ మడి, నిష్ఠలో తేడా వచ్చిందంటే విపరీత పరిణామాలు తథ్యం. దేవుని విగ్రహం మనుషులు మలిచేది.కానీ, సాలగ్రామం దేవుని అవతారం. అంటే సాక్షాత్తు దేవుడే అని అర్థం. ఇంట్లో దేవుని భరించగలిగే నియమం, శక్తి అందరికీ సాధ్యపడుతుందా? అందుకే ఈ కష్టం కలిగించదుస్వామి. సాధ్యపడే ఇంటికే వెళతాడు. ఈ సాలగ్రామం వున్న ఇల్లు సందర్శించి, నమస్కరించినా, ఈ సాలగ్రామం ఎక్కడైనా చూచి నమస్కరిం చినా, సాలగ్రామం వుంచుకుని పూజించిన వారికి కలిగే సత్ఫలితాలన్నీ కలుగుతాయి. దేవదేవుల నిగూఢ రహస్యాలు కలిగిన ఈ సాలగ్రామ వృత్తాంతం వినినా, చదివినా సంపూర్ణ శుభఫలితాలు కలుగు తాయి. ఇది నారాయణుడు లోకానికిచ్చిన ఉచితవరం. శ్రమలేకుండా సత్ఫలితాలు పొందే వరమన్నమాట.



## సకల సిద్ధి ఫలదం

'సాలగ్రామం' అన్న సార్థకనామంతో పూజార్హమై పూజింపబడుతున్న సాలగ్రామ శిలలకు సంబంధించిన కథనం స్కందపురాణాది గ్రంథాల్లో వివరించబడింది. ఈ సాలగ్రామ మూర్తులు, నేపాల్ దేశంలో ప్రవహిస్తున్న 'గండకీ'నదిలో మాత్రమే లభ్యమవుతున్నట్లు వినికిడి. రెండు పర్వతాల మధ్యగల పల్లపు ప్రాంతాన్ని "గండక్" అంటారనీ, అక్కడే పుట్టి ప్రవహిస్తున్నందువల్ల ఆ నదికి 'గండకీ' అన్న పేరు స్థిరపడినట్లు చరిత్రకారుల భావన.

**సాలగ్రామం పుట్టు పూర్వోత్తరాలు :**

విదేహరాజ్యానికి చెందిన ప్రియంవద అనే ఓ కన్య, స్థితికారకుడైన శ్రీమహా విష్ణువు గురించి కఠోరమైన తపస్సు చేసింది. ఆమె తపోనిష్ఠకు సంతుష్టుడైన శ్రీహరి మానవమాత్రుడిగా ఆ కన్య ఎదుట ప్రత్యక్ష మయ్యా డట! ఆ సందర్భంలో సాక్షాత్తూ ఆ వైకుంఠవాసుడే తనకు తనయుడిగా జన్మించాలని వరం కోరిందట ప్రియంవద! అలా ఆమెలో మూర్తీభవించిన మాతృత్వానికి మురిసిపోయిన ముకుందుడు, ఆక్షణానే ఆమెను తల్లిగా స్వీకరించి "జననీ, ప్రియంవదా! మరుజన్మలో నువ్వు నేపాల రాజ్యంలో గండకీనదిగా అవతరిస్తావు. అపుడు నేను నీ సాగర గర్భంలో సాలగ్రామ ప్రతిమలుగా జన్మిస్తాను!" అని ఆమెకు వరసాఫల్యాన్ని నిష్క్రమించాడట ఆ భక్తవత్సలుడైన నరహరి! ఆ విధంగా భగవద్వ్యాఖ్యాను సారం, నేటికీ కూడా గండకీ నదిలో సాలగ్రామాలు ఉద్భవిస్తున్నట్లు భక్తజన విశ్వాసం.

**సాలగ్రామ పర్వత కథనం :**

రామ-రావణయుద్ధంలో రాక్షసగణం గుప్పించిన విష అస్త్రాల కారణంగా రామలక్ష్మణులతోసహా వానరగణమంతా మూర్ఛితులై పడి వున్న పుడు, హిమాలయాలకు ఆవలివైపున వున్న సంజీవనీ పర్వతాన్ని మోసుకొచ్చి అందులోని దివ్యౌషధముతో మళ్ళీ అందరినీ చైతన్యవంతుల్ని చేస్తాడు ఆంజనేయుడు. ఆ తరువాత ఆ పర్వతాన్ని యథాస్థానంలో పునః ప్రతిష్ఠచేసి తిరిగి వస్తూండగా, మార్గమధ్యంలో నేపాల్ రాజ్యంలోని గండకీ నదిలో ఒక పర్వతం వుండటం చూశాడు మారుతి. అప్పుడు తన గమన వేగాన్ని ఒకింత తగ్గించి, సూక్ష్మదృష్టితో ఆ పర్వతాన్ని ఆయన పరికించాడు.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





ఆంజనేయుని దివ్యచక్షువులకు నరసింహమూర్తి దివ్యరూపం గోచరించింది. మరుక్షణమే ఆ పర్వతాన్ని సమూలంగా పెకలించి అరచేత పెట్టుకొని ఆకాశ వీధిలో అంజనాసుతుడు తన పయనాన్ని కొనసాగించాడు.

సూర్యాస్తమయ సమయం ఆసన్నమైంది. సాయం సంధ్యాదికాలను చేయ సంకల్పించాడు హనుమంతుడు. అరచేతిలోని పర్వతాన్ని నది ఒడ్డున వుంచి, సంధ్యావందనాదులను ముగించాడు. తదనంతరం, పర్వతాన్ని చేతుల్లోకి తీసుకోవడానికి ప్రయత్నించాడు ఆ వానరధీరుడు. అయినా లాభంలేకపోయింది. పర్వతం భూమిలోనికి చొచ్చుకునిపోయివుంది. ఆంజనేయుడు అప్పుడు తన భారీకాయాన్ని పెంచి, సర్వబలాలనూ కూడగట్టుకొని విశాల బాహువులతో ఆ పర్వతాన్ని పైకెత్తబూనాడు. కానీ, ఆ పర్వతం ఇసుమంతైనా కదల్లేదు. ఆంజనేయుని ప్రయాస చివరికి ఆయా సాన్నే మిగిల్చింది.

ఆవిధంగా పర్వతోద్ధరణలో విఫలుడైన హనుమ ఇక చేసేదంటూ ఏమీలేక వినమ్రవదనంతో చేతులుపైకెత్తి ఆనరహరిని నుతించసాగాడు. ఆ వానరోత్తముని ప్రార్థనకు ప్రసన్నుడైన పరంధాముడు పర్వతాగ్రాన నారసింహమూర్తిగా ప్రత్యక్షమై "ఓ వానరాగ్రజా! ఈ ప్రదేశం నాకు అత్యంత ఆహ్లాదాన్ని కలిగిస్తోంది. అందువల్ల నేనిక్కడే వుండ సంకల్పించాను. నీవు లంకాపురికి వెళ్ళి అక్కడి రామకార్యాన్ని నిర్వహించు. శ్రీరాముని ఆశీస్సులు పొందు, పిదప ఇక్కడికేవచ్చి, నా సేవా భాగ్యాన్ని పొందగలవు" అని హనుమకు సెలవిచ్చి అంతర్థానమయ్యాడు.

అలా భగవదాజ్ఞను శిరసావహించిన ఆంజనేయుడు సాలగ్రామ పర్వతానికి ప్రదక్షిణలు చేస్తుండగా, శ్రీవారి శయనరూప దర్శనభాగ్యాన్ని కూడా పొందాడు. ఇలా వివిధ దేవతామూర్తులకు ఆవాసమైన ఆ సాలగ్రామ పర్వతరాజం అత్యంత మహిమాన్వితమైవుంది.

**సాలగ్రామాలను గుర్తించడం ఎలా?**

పూజకు తగిన సాలగ్రామ ప్రతిమలను, వాటి రూపురేఖలు వాటిపై గల గుర్తులను బట్టి నిర్ణయించడం జరుగుతుంది. సాలగ్రామంపై కనిపించే చిహ్నాల ఆధారంగా అది ఏదేవతా సాలగ్రామమో సులభంగా గుర్తించవచ్చు. ఉదాహరణకు చాప బాణగుర్తులుగల సాలగ్రామశిలను శ్రీరామచంద్ర మూర్తిగా గుర్తిస్తారు. అలాగే సాలగ్రామం వేణుగోపాల ప్రతిమ అయితే



దానిపై పిల్లనగ్రోవి ఆకారం వుండటాన్ని గమనించవచ్చు. ఈ విధంగా వివిధ దేవతామూర్తులకు సంబంధించిన సాలగ్రామా లను గుర్తించడం జరుగుతుంది.

**సాలగ్రామ పూజా ఫలములు**

1. సాలగ్రామ శిలారూపి అయిన శ్రీహరికి పూజార్చనలుచేసి ఆయనను ధ్యానించి స్తుతించినట్లయితే, సర్వపాపములనుండి విముక్తి కలుగుతుంది.
2. సాలగ్రామ శిలారూపి అయిన శ్రీహరిని అర్చించుటవలన నైమిశారణ్య, ప్రయాగ, గంగాసాగరసంగమ, కురుక్షేత్ర, యాత్రలు చేసిన దానికంటే నూరురెట్లు ఫలితము వచ్చును.
3. సాలగ్రామ అర్చన చేయడంవలన కోటి జన్మలలో చేసిన మహాపాతకములు నశిస్తాయి.
4. సాలగ్రామ శిలాత్పత్తమైన నిర్మాల్యమును శిరసావహించినవాడు సకల పాపములనుండి విముక్తుడై, అంత్యకాలమందు శ్రీహరిలో ఐక్యమవుతాడు.
5. సాలగ్రామ శిలాత్యక్తమైన చందనమునుగాని, కుంకుమనుగానీ నిత్యం ఎవరైతే శరీరమున ధరిస్తారో వారు మోక్షమునకు అర్హులు.
6. సాలగ్రామ శిలారూపి అయిన శ్రీహరికి నైవేద్యము చేసిన ప్రసాదమును భుజించువారికి కపిలగోవును దానము చేసిన పుణ్యము లభిస్తుంది.
7. సాలగ్రామమును నిత్యమూ స్పృశించిన యెడల బ్రాహ్మణులను, పితరులను, దేవతలను పూజించినట్లగును.
8. సాలగ్రామ సమీపములో భారతమునుగానీ, హరివంశమునుగానీ చదివినట్లయితే దానివలన ధనము, పుత్రులు కలగటం జరుగుతుంది.
9. సాలగ్రామ సమీపములో భాగవతము చదివినట్లయితే భుక్తి, ముక్తి కలుగుతాయి.
10. సాలగ్రామ శిల ఎవరి ఇంట్లో వుండునో ఆగృహములో సర్వదేవతలు, తీర్థములు, యజ్ఞములూ వుంటాయి. మరియూ అంత్యకాలమునందు ఎవరినోటనైనా సాలగ్రామజలముపోస్తేవాడు పరమగతిని పొందుతాడు.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





## వివిధ రకముల సాలగ్రామాలు - వాటి వలన కలుగు ప్రయోజనములు

1. వర్తులముగా, ముసలి ఆకారముగా, పొడవైన ద్వారము, బొడ్డున చక్రము, ప్రక్కభాగము తాబేలు ఆకారము స్థిర ఆకారము, స్థిర ఆసనము, నీలివర్ణము లక్షణములుగల సాలగ్రామమును కూర్మమూర్తి అందురు. దీనికి ప్రతినిత్యము, అభిషేకము, పూజ, ఆరాధన, శాస్త్రప్రకారము నిష్ఠ నియమములతో ఆరాధనచేసి, ఆ తీర్థమును ప్రతినిత్యము సేవించువారికి పుత్ర, పౌత్ర అభివృద్ధి, శత్రునాశనము, గృహములో సుఖశాంతులులభించుయేగాక, వాపీ, కూపదోషములు హరించును.

2. కంటికి ఇంపైన రూపము, ఉన్నతమైన ఆకారము ఉపరితలముపై రెండు బిందువులు, చక్రములు, దక్షిణభాగమునందు దీర్ఘమగు వక్రత లము అయిదు వలయములు, మందర పర్వతము ధరించిన సాల గ్రామమును శ్రీకూర్మమూర్తి అందురు. దీనికి అనునిత్యము అభి షేకము, పూజ చేయువారికి కోరికలు నెరవేరుట, ధన,జన ఆకర్షణలు గృహమందు సుఖశాంతులు కలుగుట, మరియు ఉత్తర దిశయందు గల వాస్తుదోషములు నివారించును. సమస్త కార్యములందు విజయ ములు పొందెదరు.

3. అండాకారము, బంగారువర్ణం, మెత్తగావుండు స్వభావము, రెండు వైపుల చక్రములుగల సాలగ్రామమును ఆదికూర్మము అని పిలుతురు. దీనికి ప్రతిరోజు అభిషేక, పూజాదులు జరిపి తులసి దళములతో ఆరాధించిన వారలకు పోటీ పరీక్షలలో విజయము, గృహములో ఈశాన్య వాయువ్య దోషములు తొలగును. వ్యాపారస్తులకు ఇది కుబేరునివంటిది.

4. నీలివర్ణము, స్థూలరూపము, స్త్రీరేఖ, దానికి దక్షిణ భాగమున చక్రము సమలగ్న ప్రదేశము, ఎదురు రొమ్ముపై వనమాల వున్నయెడల దానిని లక్ష్మీవారాహము అని అందురు. దీనికి ప్రతినిత్యము అభిషేకము, పూజలు చేసినవారు అనేక విధములైన సత్ఫలితములు పొందెదరు. జటిల సమస్యలను ఎదుర్కొనెడివారు మనోధైర్యమును పొందెదరు. దీర్ఘవ్యాధుల నుండి విముక్తి కలుగును. అష్టలక్ష్ములు వారింటియందు కొలువు వున్నారా అన్నంత ఆశ్చర్యము కలిగించును.

5. నీలి శంక, పుష్టిరంగులు కలిగి లోతు వెడల్పు అయిన ద్వారము వృష్ఠముయొక్క ఎడమ భాగమున ఒకరేఖ ముఖము, పాదములు, వాలము కలిగి చూచుటకు వరాహరూపమువలె కనిపించుచున్న సాలగ్రామమును భూవరాహ సాలగ్రామ మని అందురు. దీనికి ప్రతి నిత్యము దీక్షానియమములతో పూజ, అభిషేకములను నిర్వహించు చున్నచో అట్టివారికి రాజ్యప్రాప్తి, పదవీప్రాప్తి, వ్యవసాయ, వ్యాపారము లలో లాభములు, జలసంబంధమైన వ్యాపారులకు, మత్స్యకారులకు ఈ సాలగ్రామము కామధేనువు వంటిది.



6. పైన పేర్కొనిన (5) శుభలక్షణములతోపాటు ఇరుపార్శ్వములయందు కౌస్తుభ రేఖను కలిటగిన సాలగ్రామమును శ్రీభూవరాహ సాల గ్రామము అందురు. దీనిపూజ, ఆరాధనల వలన సమస్త విధములైన వాపీ కూపదోషములు హరిం చును. రాజ్యము, పదవి, భూమి, నౌకర్లు, వాహనములు దీని ఆరాధనము వలన చేకూరుతాయి.

7. స్ఫటికమువలె ప్రకాశిస్తూ, సన్నముగా పొడవైన ద్వారము, ద్వారము మధ్య రెండు చక్రాలు, నల్లని చుక్కగుర్తు వున్న సాలగ్రామాన్ని వరాహ మూర్తి అందురు. ఈ వరాహ సాలగ్రామమూర్తిని పూజించి అభిషే కము చేసినవారికి పుత్ర, పౌత్ర, ధనసంపదలు లభిస్తాయి.

8. కపిలవర్ణము, పెద్దదైన బిలము, లోతు వెడల్పైన దంతములు కలిగి వున్న సాలగ్రామమును నరసింహ సాలగ్రామము అందురు. సన్యా సులు నరసింహ సాలగ్రామమును పూజింతురు. బ్రహ్మచర్యమును పాటించువారు దీనిని పూజించ రాదు. అను నిత్యము బ్రహ్మచర్యదీక్షతో నియమబద్ధంగా పూజ, అభిషేకములు జరిపినవారికి; శత్రు బాధల నివారణ, కోర్టు వ్యవహారములందు విజయము, ప్రాణాపాయ స్థితుల నుండి రక్షణ కలుగును.

9. గుండ్రముగా పొడవుగా వుండి రెండు చక్రముల మధ్య ఎర్రటి మచ్చ కలిగి వున్నదానిని నరసింహ సాలగ్రామము అందురు. దీనికి నియమ నిష్ఠలతో అభిషేకము, పూజలు చేసిన వారికి మనోవాంఛలు నెర వేరును. వ్యవసాయ దారులకు ఇది 'శ్రీరామరక్ష'వంటిది. పాడి పశువుల వ్యాపారులకు దినదినాభివృద్ధి కోళ్ళ వ్యాపారులకు శుభకరము, చిన్న పిల్లలకు బాలారిష్టములనుండి రక్షణ కలిగించును. బాలారిష్టకులకు గ్రహదశచెడు ఫలితములనుండి రక్షణ, సూర్య కాంతి మణివలె పనిచేయును.

10. లేత నీలవర్ణము, నలుపువర్ణము కలిగి అనేక ముఖములు, అయిదు చక్రములు వున్న దానిని పంచముఖ నరసింహ సాలగ్రామము అందురు. నిత్యమూ పూజాభిషేకాలతో దీనిని ఆరాధించిన వారికి ప్రకృతి సిద్ధమైన అరిష్టముల నుండి రక్షణ, విషజంతువుల భయము తొలగుట, అగ్ని ప్రమాదములనుండి రక్షణ, కల్గుటయేగాక, దీనిని పూజించుచున్న వారిని సర్వదా కంటికి రెప్పవలె కాపాడును.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





11. పై (10) లక్షణములతోపాటు ఏడుచక్రాలు, అనేక ముఖాలు కలిగిన సాలగ్రామ మును సర్వతోముఖ నరసింహ సాలగ్రామము అందురు. అనునిత్యము దీనికి భక్తిశ్రద్ధలతో పూజాభిషేకములు చేయుచున్న వారికి భక్తి, ముక్తి, మోక్షములు కలుగుతాయి. సామాన్యులు సైతము భక్తితో ఆరాధించిన గొప్ప ఐశ్వర్యవంతులు కాగలరు.

12. శంఖమువలెవుండి పెద్దచక్రము అరమాల దీర్ఘరేఖలు కలిగివున్న సాలగ్రామ మును వీరలక్ష్మి నరసింహ సాలగ్రామము అందురు. ప్రతి రోజు ఏకాగ్రత నియమ నిబంధనలతో ఈ సాలగ్రామమును పూజించి, అభిషేకము జరుపుట వలన సర్వత్రా విజయము పొందెదరు. బ్రహ్మచర్యము పాటించవలెను. సోమ వారమునాడు జలముతోను, మంగళవారమునాడు గంగ సింధూరముతోను, బుధవారం చందనం, గురువారంతేనె, శుక్రవారం పంచదార, శనివారం ఆవునెయ్యి, ఆది వారం ఎర్రచందనంతోను అభిషేకించి ఈ అష్టద్రవ్యములను ఒకే పాత్రలో వుంచి ఆ పాత్రను శుభ్రమైన ప్రదేశములో వుంచినచో జయము కలిగి సర్వత్రదోషములు తొలగును.

13. గోధుమ లేక కపిలవర్ణము నాలుగు ముఖములు గర్భమునందు చాపరేఖ, రేఖపైన చక్రము, చక్రము కుడివైపున చుక్క వుండిన సాలగ్రామమును వీర నరసింహ సాలగ్రామము అందురు. ప్రతి నిత్యము దీనికి పూజాభిషేకములు జరుపుచున్నవారికి భయములు తొలగిపోవును. శత్రువులు దరికిచేరరు. ఎటువంటి కుబేరుడు అయినా ఈ భక్తుని ముందు తలవంచవలసిందే!

14. నల్లని రంగు ఒక బిందువు, చక్రము కలిగివున్న సాలగ్రామమును లక్ష్మి నరసింహము అందురు. అనునిత్యము అభిషేకము, పూజలు చేయువారికి కష్టములనుండి విముక్తి, శ్రీ సుదర్శన మహాయంత్రము కంటే గొప్పగా పని చేయును. ఋణబాధలనుండి విముక్తి, శత్రువులపై ఘనవిజయము, కోర్టు సమస్యలలో విజయం, గృహమందు ఇది అక్షయపాత్ర వంటిది.

15. బహువర్ణములతో కూడినట్టిదై వృష్టిభాగము ఎత్తుగా వుండి అనేక చక్రములు కలిగిన సాలగ్రామమును పాతాళ నరసింహ సాల గ్రామము అందురు. ప్రతిదినము నియమ, నిష్టలతో అభిషేకించి పూజించిన



వారిని సర్వదేవతలు సదా ఆశీర్వదించగలరు. సంపదలను పొంద గలరు. వాక్శుద్ధి ఏర్పడును. దేవతా ఉపాసకులకు స్థిరచిత్తము, ఏకాగ్రత, మనశ్శాంతి ఏర్పడును.

16. తెలుపు, నలుపు వర్ణముకలిగి నోరు తెరచినట్లుగా వుండి ఎడమ భాగములో చక్రము, మరియు అండాకృతివున్న సాలగ్రామమును ఉగ్రనరసింహ సాలగ్రామము అందురు. అనునిత్యము నియమ నిష్ఠ, ఏకాగ్రచిత్తముతో పూజ, అభిషేకములు సల్పుతున్న వారికి పిరికి తనము పోయి ధైర్యము కలుగును. విదేశములలో చదువుచున్న వారికి, క్రీడా పోటీలలో పాల్గొనేవారికి, లాటరీటిక్కెట్లు కొనేవారికి, గుఱ్ఱపు పందేలలో పాల్గొనేవారికి విజయము. క్రమం తప్పకుండా అభిషేకించవలెను. అభిషేక ద్రవ్యమును తీర్థముగా పుచ్చుకొని మిగిలిన దానిని గృహములో చల్లవలెను. గ్రహ, గృహబాధలనుండి విముక్తి, ప్రయోగబాధలనుండి రక్షణ కలుగును. ఈ సాలగ్రామమును పూజించుటవలన గృహము ఇంద్రభవన మువలె వర్ధిల్లును.

17. చూచుటకు ఇంపైన ఆకారము కలిగి లోపల చక్రము ఉపరితలముపై ఎత్తయిన శిఖరముగల సాలగ్రామమును జ్వాలా నారసింహ సాల గ్రామము అందురు. దీనిని అర్చించి అభిషేకములు జరుపుచున్న వారికి అన్నిబాధల నుండి ఉగ్రవాదులనుండి రక్షణ, అర్చనా కాలము నందు అష్టకుండ బ్రహ్మచర్య వ్రతం పాటించినచో స్త్రీకిగాని, పురుషునకుగాని ఎడబాటులు, కలహములు సంభ వించవు.

18. పరిమాణముతో పనిలేకుండా చక్రము, పెద్దపొట్ట ద్వారము కలిగిన సాలగ్రామ మును కుక్షి నరసింహసాలగ్రామము అందురు. ఏకాగ్రత, నియమ నిష్ఠలతో అనునిత్యము అభిషేకించి, పూజించు భక్తులకు ఉపద్రవములనుండి ఆపదల నుండి, క్రూర జంతువుల నుండి సంపూర్ణ రక్షణకలుగును. అటవీ శాఖలో పనిచేయు ఉద్యోగస్థులకు ఇది శ్రీరామరక్ష వంటిది.

19. స్వర్ణకాంతితో ప్రకాశిస్తూ రెండు చక్రాలతో అనేక రంధ్రములు కలిగిన సాలగ్రామ మును రాక్షస సాలగ్రామము అంటారు. ఈ సాలగ్రామ మును ఎట్టి పరిస్థితుల లోనూ ఇంటియందు వుంచకూడదు. పొర పాటున వుంచినచో అగ్నిప్రమాద ములు, దుండగుల వలన బాధలు, ఆయుధములవలన బాధలు, ప్రమాదములు సంభవించును.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





20. ముఖమునకు ఇరువైపులా రెండు చక్రాలున్న భాగమున ఒక చక్రము కలిగివున్న సాలగ్రామమును అధోముఖ నారసింహస్వామి సాల గ్రామము అందురు. ప్రతి నిత్యము శాస్త్రోక్తముగా పూజాభిషేకములు సల్పుతున్నవారికి ఋణబంధముల నుండి విముక్తి, వైరాగ్యములను పొందగలరు.

21. గండ్రనిముఖము, పొట్టి ఆకారముగల సాలగ్రామమును ఘనరూప సాల గ్రామము అందురు. ఇది కష్టములలో నున్నవారికి గొడుగువలె పనిచేయును. ఎచ్చట ఈ సాలగ్రామము పూజలు, అభిషేకములు పొందునో అచ్చట రాజాశ్రయములు పొందబడి, గౌరవాదులు చేకూరును.

22. నల్లనికాయకట్టి, రెండుచక్రాలు, రెండుబిందువులు, ముఖమున తెల్లని బిందువు కల్గిన సాలగ్రామమును దధి-వామనమూర్తి సాలగ్రామము అని అందురు. దీనికి అనునిత్యము పూజాభిషేకములు చేయువారికి గో,భూ,ధన,ధాన్య, సమృద్ధులు పొందగలరు. ఈ సాలగ్రామము కల్ప తరువు వంటిది.

23. అతి పొట్టి ఆకారము, మధ్యన చక్రము వంటి ఆకారము గల సాల గ్రామమును వామమూర్తి అందురు. దీనికి ప్రతి నిత్యము భక్తి శ్రద్ధలతో పూజ, అభిషేకములు సల్పువారికి సమస్త విధములైన కోర్కెలు సిద్ధించుటయేగాక తల్లిబిడ్డను కాపాడినటుల ఈ సాలగ్రామము తన ఆరాధకునికి రక్షణ కల్పించును.

24. నలుపు వర్ణము ఎత్తయిన శిఖరముగల సాలగ్రామమును పాల వామనము అందురు. దీనికి అను నిత్యము పూజాభిషేకములు జరిపినచో ఇష్టసిద్ధి, మంత్రసిద్ధి, ఆయుర్వృద్ధి కలుగును.

25. ఎరుపు, నలుపు రంగులతో పొడవైన ఆకారము, వెడల్పైన ద్వారము వుండి ఎడమవైపు చక్రము, మధ్యన బిందువుగల సాలగ్రామమును రామబాణము అందురు. పూర్వకాలమున రాజులు దీనికి నిత్య పూజాభిషేకములును జరిపి, తద్వారా రాజ్యమును, రాచరికమును పొంది యున్నారు. ఈనాడు అధికారములో వున్న మంత్రులు దీని ఆరాధన వలన విశేష ఫలితములు పొందవచ్చును.



26. ఎరుపు, పసుపు, నలుపు రంగులను కలిగి ద్వారము గృహమువలె వుండి ఎడమవైపున చక్రము, గొడ్డలి, నాగలివంటి ఆకారము కల్గిన సాలగ్రామమును పరశురామము అందురు. దీనిని పూజించినచో శత్రుభయము, యుద్ధభయము వుండదు. వ్యవసాయము వృత్తిగా కలిగిన వారికి సకాలంలో వర్షాలు కురిసి పంటలు బాగా పండును.

27. ఆకాశనీలపు రంగుకలిగి ముఖమునందు ఏకచక్రము మాత్రమే వుండిన దానిని రామబ్రహ్మ సాలగ్రామము అందురు. ఈ సాలగ్రామమును ప్రతినిత్యము దీక్షగా పూజించువారికి కవిత్వము, వాక్శుద్ధి, నటన, సంగీతము మొదలగు విద్యలలో రాణింపు, గుర్తింపు, ఉత్తమ స్థానము పొందెదరు.

28. నలుపువర్ణము కలిగి సుందరమైన చక్రము, నిలువైన నామము కలిగివున్న దానిని మదనగోపాల సాలగ్రామము అందురు. ఈ సాల గ్రామమును ప్రతిరోజు నియమబద్ధముగా ఆరాధన చేయుచున్నవారికి దేహపుష్టి, భార్యాభర్తల మధ్య పరస్పర అవగాహన, ఆకర్షణ, ప్రేమ, సర్వసుఖములు కల్గును.

29. కొద్దిపొడవుగాను, వనమాల రేఖను కలిగివుండి, కర్రవంటి కొమ్ము, వేణువు గుర్తువున్నచో దానిని గోపాలకృష్ణ సాలగ్రామము అందురు. దీని పూజాభిషేకములవలన గోవులు, పాడిపంటలు, సిరిసంపదలు, ధనాభివృద్ధి కల్గును.

30. నల్లనిరంగు, పొడవైన ఆకారము, అర్ధచంద్రాకారము కల్గిన సాలగ్రామమును సంతానగోపాల సాలగ్రామమని అందురు. దీక్ష, భక్తి శ్రద్ధలతో ప్రతినిత్యము సంతాన గోపాల సాలగ్రామమును పూజించుచున్న వారికి పుత్రసంజీవినివలె పనిచేసి సుపుత్రప్రాప్తి, సౌభాగ్యము, సిరి సంపదలు పొందగలరు. కేవలం స్త్రీలకు మాత్రమేకాక పురుషులకు కూడ కల్ప తరువు వంటిది.

31. ముక్కోణపు ఆకారము, నలుపు, తెలుపు, నీలవర్ణములలో లభించు దానిని త్రివిక్రమ సాలగ్రామము అందురు. ప్రతినిత్యమూ భక్తి శ్రద్ధలతో ఈ త్రివిక్రమ సాలగ్రామమును అర్చనచేయు వారికి మంత్ర సిద్ధి లభించును. ముఖ్యంగా శ్రీవిద్యా ఉపాసకులు, శ్రీవిద్యా దీక్షా పరులు త్రివిక్రమ సాలగ్రామ అర్చనచేయుట వలన వారికి శుభములు

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





చేకూరును. బ్రాహ్మణులు దీనిని పూజించుటవలన శుభములు పొంద గలరు. ఈ సాలగ్రామ అర్చన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను పూజించు టతో సమానమగును.

32. తెలుపువర్ణము లేక మిశ్రమ వర్ణము పై భాగమున తేజోవంతమైన ప్రకాశముగా వుండిన ఒకే ఒక చక్రంగుర్తువున్న దానిని మధుసూదన సాలగ్రామము అందురు. ఎవరైతే శ్రద్ధా భక్తులతో ఈ సాలగ్రామము నకు ప్రతినిత్యమూ అభిషేకములు జరుపుదురో వారికి మంచి శరీర ఛాయ, ముఖమునందు తేజస్సు, బహువిధము లైన సుఖములు పొంద గలరు. నేటి కాలములో కొందరు దీనిని ధరించి నియమ నిష్ఠాగరిష్ఠులై వుండుటవలన సర్వకార్యములందు జయమును పొందుచున్నారు.

33. చక్కనివర్ణము, సమానమైన పొడవుగలిగి దానిపై అర్ధచంద్రాకారపు గుర్తుగల దానిని కేశవసాలగ్రామమని అందురు. నియమబద్ధముగా దీనిని ఆరాధించినచో కోరిన కోరికలు తక్షణమే నెరవేరును.

34. చూపులకు అందముగాను, ప్రకాశవంతముగాను పై భాగమున ఒక చక్రము మరియు దిగువభాగమున మరియొక చక్రము, రెండు చక్రముల మధ్యన నామముగల సాలగ్రామమును పద్మనాభ సాలగ్రామము అందురు. దీనిని దీక్షానియమములతో ఆరాధించుచున్న వారికి ఇష్ట కామ్యార్థసిద్ధి, శయ్యా సుఖము, లోకవశము కాగలవు.

35. మనోహరమైన రూపము, ఉపరితలముపై శంఖుచక్రపు గుర్తులు, వాటి క్రింద సర్పాకృతి గుర్తుగల దానిని ఆదిశేష సాలగ్రామము అందురు. దీనికి పూజాభిషేకములు చేసినచో సంతానము లేనివారికి సంతానప్రాప్తి, ఆపదలలో చిక్కుకున్న వారిని కాపాడుట, మరణ ప్రమాదముల నుండి రక్షణ కల్గును. జాతకమునందు సర్పదోషము, కాల సర్పదోషములు ఈ సాలగ్రామ పూజలవలన నశింపగలవు.

36. పైన పేర్కొన్న (35) గుర్తులు కలిగి చక్రముమాత్రము అపసవ్యముగా వుండుట, నలుపువర్ణము కలిగి వున్నదానిని కాళింగ సాలగ్రామము అందురు. దీనిని గృహములో వుంచరాదు. తరచుగా ప్రమాదములు, సంతాన అరిష్టాలు, స్థిరాస్తులను కోల్పోవుట, ప్రయోగ బాధల వలన మరణము కలుగును.



37. తేనె వంటిరంగు, మధ్యన నల్లని చక్రం వున్నదానిని మాధవ సాల గ్రామము అందురు. ఈ సాలగ్రామమునకు ప్రతినిత్యము పూజ, అభిషేకములు చేయుచున్న వారికి భవబంధముల నుండి విముక్తి లభించుటయేగాక ముక్తి, మోక్షము లభించును.

38. నలుపు లేక పాలకెంపు వర్ణము కలిగి ఒకవైపున శంఖు మరోవైపున చక్రం గుర్తులు కలిగి రెండిటి మధ్యన నామము వుండిన దానిని అచ్యుత సాలగ్రామము అందురు. ప్రతిరోజు ఈ సాలగ్రామమునకు అర్చన చేయుటవలన కష్టములు తీరుట, జ్ఞానమును ప్రసాదించుట జరుగును. చీకటిని పారద్రోలే వెలుగువలె తనను ఆరాధించెడి వారికి రక్షణ కల్గించును.

39. పైన (38) పేర్కొన్న శుభచిహ్నములతోపాటు శంఖు చక్రములకు దిగువ భాగమున పద్మ ఆకృతి కల్గివున్న దానిని శ్రీనిలయ సాలగ్రామము అందురు. ఏ గృహమునందైతే ఈ సాలగ్రామము ప్రతి నిత్యము పూజలు, అభిషేకములు పొందుచుండునో అచ్చట మహాలక్ష్మి తాండవిం చును. ఈ సాలగ్రామము చాల అరుదుగా దొరుకును.

40. పైన (39) గుర్తులను కలిగి తెలుపు లేదా గంధపు వర్ణముతో క్రింది భాగమున కృష్ణపాదము గుర్తుగల దానిని శ్రీపాదవల్లభ సాలగ్రామము అందురు. దీనికి ప్రతినిత్యము దీక్షాపరులై భక్తిశ్రద్ధలతో పూజాభిషేక ములు చేయువారికి అణిమ, గరిమాది అష్టసిద్ధులు లభించును. భూత, భవిష్యత్ వర్తమానములు అనర్గళముగా చెప్పగలరు. ఇట్టి వారిని కలియుగబ్రహ్మ అనుటలో సందేహము లేదు.

41. స్థూలరూపము, ఛాయ ఆకుపచ్చరంగు చక్రము ద్వారము, ద్వారములో పచ్చని రేఖలు వున్నచో దానిని దామోదర సాలగ్రామము అందురు. వీటిలో కొన్ని తెలుపు, నలుపు, పూర్తి ఆకుపచ్చగా వుండును. ఈ దామోదర సాలగ్రామ మును ఆరాధించువారికి సకల ఐశ్వర్యములు లభించును. ఆయుష్షు పెరుగును.

42. పొడవైన ఆకారము గోధుమ లేక ఎరుపువర్ణము విల్లు ఎక్కుపెట్టిన బాణాకారపు ఆకృతి కల్గిన దానిని మన్మథ బాణ సాలగ్రామము అందురు. భక్తిశ్రద్ధలతో ప్రతినిత్యము మన్మథబాణ సాలగ్రామమును అర్చించిన వారికి మన్మథునివలె ప్రకాశము వెదజల్లుట, శీఘ్రముగా

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





వివాహము జరుగుట, సరస సల్లాపప్రాప్తి, స్త్రీలోకమును ఆకర్షింప జేయు ప్రకాశవంతమైన తేజస్సు పొందెదరు.

43. నీలము లేక తెలుపు వర్ణము కలిగి బాణము ఇరువైపులా చక్రము, బిందువుల వంటి గుర్తుగల దానిని రామబాణ సాలగ్రామము అందురు. ప్రతిరోజూ భక్తిశ్రద్ధ లతో ఈ సాలగ్రామమునకు పూజ, అభిషేకములు చేయువారికి సిరిసంపదలు, రాజ్యము, మహారాజ్య భోగము లభించును.

44. మేఘవర్ణము, పారదర్శకత కలిగి గర్భములో శంఖాకృతి కలిగి, చక్రము, గద ఆకారములో, మరికొన్నిటిలో చక్రమునకుబదులు పద్మ ఆకృతి కల్గినదానిని లక్ష్మీకుబేర సాలగ్రామము అందురు. దీనికి పూజ, అభిషేకములు చేయుటవలన సిరిసంపదలు, ధనధాన్యాభివృద్ధి కల్గును. నిధి, నిక్షేప సంగ్రహమునందు దీనిని ఉపయోగించెదరు. అమావాస్య, పౌర్ణమి దినములయందు దీని వర్ణము లేక రంగులలో మార్పును చూడవచ్చును.

45. రక్తమువలె ఎరుపు వర్ణము, చిన్నబాణము, స్పష్టమైన చక్రము, బలమైన అర్ధాకృతి కలిగివున్నదానిని కల్కి సాలగ్రామము అందురు. దీనికి ఆరాధనలు చేయువారికి సుఖసంతోషములు చేకూరును. లోటు అనేది వుండదు.

46. ఇరువైపులా రెండు చక్రములు రక్తము వంటి ఎరుపు రంగుగల ఈ సాలగ్రామ మును ఆరాధించువారికి సర్వకాలసర్వావస్థలయందు సుఖశాంతులను చేకూ ర్చును.

47. నల్లని వర్ణము, పై భాగమున చిన్నబిలము, పైన చిన్న చక్రము పార్శ్వము నందు పువ్వువంటి రూపముకలదానిని అనిరుద్ధ సాల గ్రామము అందురు. దీనిని నిత్యము పూజించి ఆరాధించుటవలన సర్వలోకము లలో సుఖము నొసంగునని శాస్త్రములలో తెలుపబడినది.

48. లేత పసుపు, లేత ఎరుపులలో వున్న సాలగ్రామముపైన అంకుశము, వక్త్రము, రెండుచక్రాలు, పార్శ్వములయందు కుండలరేఖలుగాని, పద్మాకృతి రేఖలు వున్నచో దానిని హయగ్రీవసాలగ్రామము అందురు. అనునిత్యము భక్తితో దీనిని పూజించినవారికి జ్ఞానము, విద్య, పాండి త్యము, శతావధానము చేయు నైపు ణ్యము, భోగములను ప్రసాదించి, చివరికి మోక్షము నిచ్చును.



49. మొసలివంటి ముఖము ప్రక్కనగాని లేక వెనుకగాని ఒకరేఖను పసుపు రంగుచక్రము,కల్గివున్న ప్రజ్వలన సాలగ్రామము అందురు. అను నిత్యము ప్రజ్వలన సాలగ్రామ పూజలను పొందు గృహమునందు సర్వ శుభకరములైన సన్మంగళ ములు చేకూరగలవు.

50. కపిలవర్ణము, గుండ్రటి రూపము, బిలము, చక్రము, రక్తవర్ణరేఖ కలిగి వున్న దానిని అధోక్షిణ సాలగ్రామము అందురు. ఈ సాలగ్రామారాధ నము వలన వ్యక్తులందరిలోనూ సమైక్యతా భావముదయించును.

51. శ్వేతవర్ణము, చిన్నద్వారము, ఒకవైపున పద్మచక్రము, మరొకవైపున పద్మాకృతి, దిగువ మధ్యభాగమున తేనెరంగు వున్నదానిని మోహినీ సాలగ్రామము అందురు.

ఈ సాలగ్రామము సర్వదేవతలచేత పూజలందుకొనును. దీనిని సంగ్రహించి పూజిస్తున్నవారు జనాకర్షణశక్తిని పొందెదరు. గుప్తవిద్యల యందు ప్రాధాన్యత చెందెదరు. ఇది నలుపు, ఎరుపు రంగులలో లభిం చును. ఈరెండింటినీ కలిపి పూజించిన అశుభములు కలుగునుగాన ఒక్కదానిని మాత్రమే స్వీకరించవలెనని తెలియవలెను.

**సాలగ్రామ పూజా విధానము :**

సాలగ్రామమును పూజించేవారు ప్రతినిత్యము స్నానము, సంధ్యా వందనము కార్యక్రమములను సూర్యోదయమునకు ముందుగా పూర్తిచేసు కోవాలి. పూర్ణోదయము, సూర్యాస్తమయకాలంలో పురుష సూక్తము, సాయం కాలము శ్రీసూక్త పారాయణ చేయవలెను. ఎట్టి పరిస్థితులలో ఈ సాలగ్రామ మునునేలపై వుంచరాదు. పూజా మందిరములో తెల్లని వస్త్రముపరచి దానిపై వుంచవలెను. బంగారము లేక వెండి లేక రాగి లేక పంచ లోహపాత్రల యందు గంగా జలము లేక శుద్ధ నదీజలమును వుంచి సాలగ్రామమును వుంచిన పాత్రలోని జలమును ఇంద్రజలము అందురు. సాధకుడు ఇంద్ర జలమును తీర్థముగా పుచ్చుకొనుట, గృహము నందంతయు జల సం ప్రోక్ష్యము చేయుట భూమిని శుద్ధిచేయుట, భూతశుద్ధి, దేహశుద్ధి, దేవతా శుద్ధి చేయవలెను. అట్లుచేసిన వారికి వాక్పటుత్వము, జ్ఞానవృద్ధి, ధనవృద్ధి, పొందగలరు. సుఖసౌఖ్యముల పొందురనుటకు సందేహములేదు. సాలగ్రామమును స్త్రీలు తాకరాదు. ప్రతినిత్యము సాలగ్రామమును గంగా జలం, ఆవుపాలు, పెరుగు, వెన్న, నెయ్యి, తేనెలతో అభిషేకము చేసిన

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





పాపబుద్ధి నశించును. మనశ్శాంతి లభించును. నిత్యము దీనిని పూజించు వారు మరణానంతరము వైకుంఠప్రాప్తి చెందెదరు.

**గృహదేవతార్చనలో సాలగ్రామం తప్పనిసరి :**

శైవ, వైష్ణవ, శాక్తేయ, గాణాపత్య, సౌరమతాల మధ్య ఆనాటికి వుండిన సంఘర్షణనూ, సాంఘిక కల్లోలాన్నీ రూపుమాపడానికి వైదిక ధర్మంలో ఇవన్నీ అంతర్భాగాలేనని వివరించడానికీ, సమన్వయం సాధించ డానికి శంకరాచార్యుల వారు భారతీయుల నిత్యపూజా విధానంలో పంచా యతన దేవతార్చన పద్ధతిని ప్రవేశపెట్టారు. ఈ పంచాయతన విధానంలో గణపతి, సాలగ్రామం (విష్ణురూపం), శివలింగం శక్తి (దేవి),సూర్యుడు వుంటారు. వైదిక ధర్మంలోని సర్వమతాలవారికీ అంగీకారమైన ఈ విధానం వేద మతంలో వున్న అనైక్యాన్ని తొలగించడానికి, ఆనాడు ప్రబలంగావున్న నాస్తిక (బౌద్ధ, జైన, చార్వాకాది) మతాల ప్రభావాన్ని తప్పించడానికి ఉపయోగించింది. క్షీణదశలోవున్న హిందూధర్మ, వైదికధర్మం శంకరాచార్యుల వారి రాకతో పునరుజ్జీవనాన్ని పొందింది. ఆసేతుహిమాచలం పర్యటించి నాస్తిక మతాలను ఖండించి, వేదధర్మానికి ప్రాణంపోసి, ఉజ్జ్వలంగా వెలిగింప జేశారు శంకరులు. ఆదిశంకరులు ఏర్పరచిన ఈ పంచాయతన విధానమే ఈనాటికీ సంప్రదా యంగా నిలిచివున్నది. అందువల్ల గృహదేవతార్చనలో సాలగ్రామం తప్పనిసరిగా వుండ వలసిందే!

**పురోహితులవద్ద సాలగ్రామం ఎందుకు ?**

విధి విహితంగా ఏదైనా దానం చేసే సమయంలో, ఆ దానంతోపాటు సాలగ్రామాన్ని కూడా దానంచేయాలని శాస్త్రవాక్య ప్రమాణం. దానంతో బాటు దక్షిణనూ, సాలగ్రామాన్ని ఈయవలసివుంది. అయితే, దానమీయ దలచిన ప్రతివారూ, అందునా ఈ ఆధునిక కాలంలో సాలగ్రామాన్ని సిద్ధంచేసుకుని వుంచుకోవడంజరగదు. కనుక, పురోహితులలో శాస్త్రం క్షుణ్ణంగా తెలిసినవారు ఆవిధంగా సాలగ్రామాన్ని దగ్గరవుంచు కుంటారు.

ఏదైనా స్వల్పదానం నుంచి కన్యాదానం వరకూ,శాస్త్రబద్ధమైన ప్రతి వైదిక కార్యక్రమానికీ, సాలగ్రామం అవసరం ఉంటుంది.

అంతేగాక, ఏవిధమైన పూజాకార్యక్రమాలు చేయించవలసి వచ్చినా పూజాపీఠంలో సాలగ్రామాన్ని వుంచవలసి వుంటుంది.



ఈ దృష్టితో పురోహితులే సాలగ్రామాన్ని ఆయాగృహస్థుల అవసరాల నిమిత్తం తామే దగ్గర వుంచుకొని వాడుతుంటారు.

## సాలగ్రామ విజ్ఞానము

**1. మత్స్యమూర్తి లక్షణము :**

పీత శ్వేత నిభోదేవః రేఖాపంచక సంయుతః
వీక్షితః శఫరాయశ్చ చక్రం దైవరు దక్షిణే
మత్స్యమూర్తి రితిఖ్యాతో భోగమోక్ష ప్రదాయకః

పసుపు తెలుపు రంగులతోగూడి చేపవలెనుండి శరీరంముపై అయిదు రేఖలు మరియు ఎడమవైపు ఒక చక్రముగల శిల మత్స్యమూర్తి అనబడును. అది భోగ మోక్షముల ప్రసాదించును.

**2. కూర్మమూర్తి లక్షణము :**

కూర్మం స్యాదున్నతం పృష్టేశ్వేతాభం గోఖురాన్వితమ్
అస్యే ద్విచక్ర సంయుక్తం దుర్లభోஉతి శుభప్రదః

కూర్మమూర్తి నాలుగు విధములుగా వుండును.

వెన్నున మూడుచుక్కలు లేదా శంఖచక్రములు, కుడి ఎడమలందు పొడవైన మోగములు, వానిలో రెండేసి చక్రములు, మూడు గుమ్మిరేకలుగల కూర్మమూర్తి మిక్కిలి దుర్లభం. అది అన్ని కోరికలను నెరవేర్చును.

**3. వరాహ లక్షణము :**

పృష్ఠోన్నతంచ దీర్ఘాస్యం వామతః చక్రమున్నతమ్
వరాహమూర్తి రిత్యుక్తం రాజ్యలక్ష్మీప్రదం నృణామ్
పుత్రపౌత్రప్రదానిత్యం భూధనః జ్ఞానవర్ధనః

ఎత్తగు వీపు పొడవైన నోరు మరియు ఎడమవైపున ఉన్నతమగు చక్రముగలది వరాహమూర్తి అనబడును. అది నరులకు రాజ్యలక్ష్మిని, పుత్రులను, పౌత్రులను కలిగించును. భూమిని, ధనమును, జ్ఞానమును వృద్ధినొందించును.

**4. లక్ష్మీనృసింహమ్ :**

వామపార్శ్వస్థితే చక్రే కృష్ణవర్ణ స్సబిందుకః
లక్ష్మీనృసింహోవిఖ్యాతః సర్వభాగ్యప్రదో నృణామ్

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





ఎడమవైపు చక్రంగలిగి నల్లనిచుక్కలతో గూడినది లక్ష్మీనృసింహమని చెప్ప బడును. అది నరులకు సమస్తమైన భాగ్యములిచ్చును.

**5. వామనమూర్తి లక్షణము :**

మధ్యచక్రమతిహ్రస్వ మతి స్నిగ్ధంచ కార్శికమ్
స్పష్టాస్యం వామనంతర్ స్యాత్ అర్చతాదిష్టసిద్ధిదమ్

మిక్కిలి పొట్టిదై నునుపై నల్లనై నడిమి చక్రము మరియు స్పష్టమైన మొగముగల వామనము పూజించువారికి కోరికలను నెరవేర్చును.

**6. పరశురామమూర్తి లక్షణము :**

జామదగ్న్యస్తు భగవాన్ ద్వివిధః పరికీర్తితాః
సితకృష్ణారుణోపేతః దీర్ఘాకారో బృహద్బిలః
భిత్తిభాగే గతేచక్రే వామేవా దక్షిణేపి వా
చక్రభాగే భవేద్బిందుః పరశ్వాకృతిరేవ చ
సృష్టేవా పార్శ్వతోవాసి రేఖాదంష్ట్రాకృతిర్భవేత్
న రామో జామదగ్న్య స్యాదర్చనీయో మహాత్మభిః

భగవంతమైన పరశురామము రెండువిధములుగా చెప్పబడినది. తెలుపు, నలుపు, ఎరుపు రంగులతోకూడి పొడవై పెద్ద రంధ్రము వుండి, కుడినిగాని, ఎడమనగాని చక్రములు వాని ప్రక్కన చుక్కలుగాని, పరశువు యొక్క ఆకారముగాని కలిగి వెన్నుకు లేదా ప్రక్కలకు కోరలవంటి రేఖలుగల మూర్తి జామదగ్న్యమని పిలువబడును. అది మహాత్ములకు పూజింపదగినది.

**7. రామమూర్తి లక్షణము :**

ద్వారద్వయే శ్చతుచక్రం గోష్పదేన విరాజితమ్
రఘునాథాభిదం జ్ఞేయం వేష్టితం వనమాలయా

రెండు ద్వారములు, నాలుగు చక్రములు కలిగి గోష్పదము మరియు వనమాలతో గూడిన మూర్తి రఘునాథమని చెప్పబడును.

**8. సంకర్షణమూర్తి లక్షణము :**

అగ్రభాగే ద్విచక్రం స్యాత్ పూర్వభాగేతు పుష్కరమ్
సంకర్షణస్య విజ్ఞేయో రక్తాభః సర్వసిద్ధిదః



ఎఱ్ఱని కాంతిగలిగి పై భాగమున రెండు చక్రములు ముందు భాగ మున పద్మరేఖలుగల మూర్తి సంకర్షణమని తెలియవలెను. అది అన్ని సిద్ధులను ప్రసాదించును.

**9. కృష్ణమూర్తి లక్షణము :**

కృష్ణమూర్తి ప్రభేదాశ్చ త్రయోదశ సమీరితాః
కృష్ణవృత్తాకృతి స్తార్క్ష్యో సర్వేషాం పాపనాశనః

నల్లనై గుండ్రమై గరుడరేఖగల కృష్ణమూర్తి ఎల్లరకూ పాపనాశన మైనది.

**10. మాధవ మూర్తి లక్షణము :**

మధువర్ణో మధ్యచక్రో స్నిగ్ధః సూక్ష్మముఖ స్తు వా
మాధవశ్చేతి విజ్ఞేయో యతీనాం మోక్షదాయకః

తేనెరంగుగలిగి నడిమి చక్రము మరియు సన్ననైన మొగముగల మూర్తి మాధవమనబడును. ఇది యతులకు మోక్షమిచ్చును.

**11. గోపాదమూర్తి లక్షణము :**

నాతిస్థూలః కృష్ణవర్ణో గోవిందః పంచవక్త్రకః
ద్విచక్రయుక్త సర్వత్ర సర్వాభీష్ట ప్రదోచ్యతః

నల్లనై మిక్కిలి లావుగాక అయిదు మోములు, రెండుచక్రములు గల మూర్తి గోవింద మనబడును. అది సర్వాభీష్టముల నిచ్చును.

**12. విష్ణుమూర్తి లక్షణము :**

వామచక్రో......ఉన్నతో నిమ్న.....
సకాపిల స్నగ్ధ విష్ణుర్ద్విషయ భోగకృత్
విష్ణుక్రాంతి విధాకాతో వనమాలా సులాంఛితః
పంచాయుధ సమాయుక్తో విష్ణుతిర్యృచ్యతే శ్చుభైః
విష్ణుస్తతో కృష్ణవర్ణః స్థూలచక్రశ్చ వర్తులః
గదాకారాతు రేఖాచ లక్ష్యతే మధ్యదేశతః
చక్రాద్వయ యుతాన్నృణాం బహుభాగ్య ప్రదోర్చతామ్

ఎడమవైపొక చక్రము మరియు పెద్దద్వారము కలిగి చిక్కని కపిల వర్ణంలో నుండి ఎగుడు దిగుడు తలగలది విష్ణుమూర్తి అనబడును. అది

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





విజయమును, సంపదను ఇచ్చును. విష్ణుకాంతి పూవన్నె కలిగి వనమాల మరియు పంచాయుధము లతో గూడిన శిలను పండితులు విష్ణుమూర్తి అందురు. నల్లనైన గుండ్రనై పెద్ద చక్రము మరియు శిలనడుమ గదాకార రేఖయు రెండు చక్రములును గలదానిని విష్ణుమూర్తి అని చెప్పుదురు. అది అర్చకులకు బహుభాగ్యముల కల్గించును.

**13. మధుసూదనమూర్తి లక్షణము :**

**మధుసూదన స్తదాదేవః ఏకచక్రో మహాద్యుతిః**
**సర్వవర్ణసమాయుక్తో మహాభాగ్యప్రదో నృణామ్**

అన్నిరంగులు కలిపి మిక్కిలి కాంతిగానుండి ఒక చక్రముగల స్ఫూర్తి మధుసూదన మనబడును. అది మానవులకు మహాభాగ్యమును కల్గించును.

**14. హృషీకేశమూర్తి లక్షణము :**

**కదంబ కుసుమాకారో రేఖాపంచక సంయుతః**
**అర్ధచంద్రాకృతిర్దేవః పంచవక్ర సమన్వితః**
**త్రిచక్రం చైకచక్రోవా హృషీకేశ ఉదీరితః**

కడిమి పూవన్నె కలిగి అర్థ చంద్రాకారమై అయిదు రేఖలు, అయిదు చక్రములతో గూడిగాని లేక ఒకటిగాని, మూడుగాని చక్రములు గలది హృషీకేశమనబడును.

**15. పద్మనాభమూర్తి లక్షణము :**

**నిష్కేసరోర్ధ్వ చక్రశ్చ అధశ్చక్రస్స కేసరః**
**పద్మనాభ ఇతిఖ్యాలో విపరీతో హలాయుధః**
**కేసరహితమైన ఊర్ధ్వ చక్రశ్చ అధశ్చక్రస్స కేసరః**
**పద్మనాభ ఇతిఖ్యాలో విపరీతో హలాయుధః**

కేసర రహితమైన ఊర్ధ్వచక్రము, కేసరసహితమైన అధోచక్రము కలిగి హల మును విపరీతముగా (తిరుగల లేక తలక్రిందుగా) ధరించిన మూర్తి పద్మనాభ మనబడును.

**16. దామోదరమూర్తి లక్షణము :**

**దామోదరస్తు విజ్ఞేయో త్రివిధా భిన్నలక్షణః**
**నాభిచక్రలసన్మూర్తి జంబూఫల సమప్రభః**



నేరేడుపండు వంటి ఆకారము మరియు నాభియందు చక్రముగల మూర్తి దామోదర మనబడును. అది భుక్తిని, ముక్తిని ప్రసాదించును.

**17. వాసుదేవమూర్తి లక్షణము :**

**జంబూఫల సమాకారం హ్రస్వంచ పరివర్తులమ్**
**ద్వారణేశే సమేచక్రే దృశ్యతో నాంతరీయతే**
**లలాటే శ్వేతరేఖా చ వాసుదేవస్య లక్షణమ్**

నేరేడుపండువలె నుండి గుండ్రమై కురుచయై ద్వారము నడుమ ఎడములేని రెండు చక్రములు మరియు నుదుట రెండు తెల్లని ముఖాలు కలిగియుండుట వాసుదేవ మూర్తియొక్క లక్షణము.

**18. ప్రద్యుమ్నమూర్తి లక్షణము :**

MOHANPUBLICATIONS.COM

**ప్రద్యుమ్నః సూక్ష్మ చక్రస్తు పీతవర్ణ స్తథైవచ**
**మకరాభం భవేద్రేఖా పార్శ్వతో పృష్ఠతోపివా**

పచ్చనై, సన్నని చక్రము గలిగి వీపునగాని ప్రక్కనగాని మొసలివంటి రేఖతో కూడిన మూర్తి ప్రద్యుమ్నమనబడును.

**19. అనిరుద్ధమూర్తి లక్షణము :**

**సూక్ష్మచక్రం భవేదూర్ధ్వం పార్శ్వేచణక పుష్పవత్**
**అనిరుద్ధ ఇతిప్రోక్త సర్వలోకైక కారణః**

అనిరుద్ధము మూడువిధములు, పైన సూక్ష్మచక్రము ప్రక్కన శనగ పూవువంటి రేఖలుగల మూర్తి అనిరుద్ధమని చెప్పబడును. అది సర్వలోకైక కారణమగును.

**20. పురుషోత్తమమూర్తి లక్షణము :**

**మధ్యచక్రః సువర్ణస్తు మస్తకే పృథుచక్రవాన్**
**పురుషోత్తమస్సుయజ్ఞేయః సర్వభాగ్యప్రదోశ్చతామ్**

మంచి వన్నెకలిగి మధ్య చక్రము మరియు తలపై పెద్ద చక్రముతో నున్నమూర్తి పురుషోత్తమమని తెలియవలెను. అది పూజించువానికి సర్వభాగ్యముల నొసగును.

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





**21. అధోక్షజమూర్తి లక్షణము :**

**అతికృష్ణో రక్తరేఖా వృత్తదేహః సుచక్రవాన్**
**కించిత్కాపిల సంయుక్తః స్థూలోవా సూక్ష్మఏవవా**
**అధోక్షజ ఇతిఖ్యాతః పూజకస్యం శుభప్రదం**

మిక్కిలి నలుపై రక్తరేఖ కలిగి గుండ్రమై ఒక చక్రము కలిగిగాని కొంచెము కపిలమై, అంతలావుగాని, సన్నముగాని మూర్తి అధోక్షజ మనబడును. అది పూజకు శుభమిచ్చును.

**22. అచ్యుతమూర్తి లక్షణము :**

**చతుర్థిః పృష్ఠచక్రైశ్చ వామదక్షిణ పార్శ్వగైః**
**అధిష్ఠితో ముఖేప్యేకం కుండలద్వయ శోభితమ్**
**శంఖచక్రగదా శార్‌ఙ్గయుతం కపిల మేవవా**

కపిలమైన వీపు ముఖమున ప్రక్కలందు మొత్తము నాలుగు చక్రములు కలిగి, కుండల ద్వయముతో శంఖుచక్రగదా శార్‌ఙ్గములతో కూడినమూర్తి అచ్యుతమన బడును. అది దుర్లభమైన భాగ్యము నొసగును.

**23. జనార్ధనమూర్తి లక్షణము :**

**పూర్వభాగైక వదనః షక్చాదేకాస్య సంయుతః**

**జనార్ధనః చతుశ్చక్రః శ్రీప్రదః శత్రునాశనః**

ముందువైపొక మొగము, వెనుక వైపొక మొగము గలిగి నాలుగు చక్రములతోగూడిన మూర్తి జనార్ధనమని చెప్పబడును. అది శ్రీప్రదము మరియు శత్రువినాశకరము.

**24. ఉపేంద్రమూర్తి లక్షణము :**

**ఉపేంద్రో మణివర్ణాశో......................**
**కోమలో వృత్తకశ్చైవ, సమపార్శ్వే ద్విచక్రయుత్**

మణివంటి వన్నెకలిగి కోమలమైన గుండ్రటి పూర్ణచంద్రునివలె ప్రకాశించబడుచూ ప్రక్కన రెండు చక్రములుగల మూర్తి ఉపేంద్రమని చెప్పబడును.

**25. హరిమూర్తి లక్షణము :**

**బహుద్వార సమాయుక్తం శ్యామవర్ణో ద్విచక్రవాన్**
**వర్తులో మృదులశ్చైవ పూజితా మిష్ట సిద్ధిదః**



**అల్పాద్వార ద్వయోపేతా హరిమూర్తి రుదాహృతా**

అనేక ద్వారములతోగూడి శ్యామలమై మృదువై గుండ్రమై రెండు చక్రములు గలది హరిమూర్తి అని చెప్పబడును.

**26. సుదర్శన మూర్తి లక్షణము :**

**ఏకచక్రశ్శిరోదేశే కృష్ణవర్ణముఖస్తథా**

**సుదర్శనస్స విజ్ఞేయః సర్వపాప ప్రణాశనః**

సుదర్శనము రెండు విధములు. నల్లని మొగము మరియు తలపై ఒక చక్రముగలది సుదర్శన మనబడును. అది సర్వపాపములను పోగొట్టును.

**27. అమృతాహరణమూర్తి లక్షణము**

**అమృతాహరణోదేవో నీలోత్పల నిభ ప్రభః**
**వర్తులో ప్రహస్వవదనో మధ్యచక్రాతి కోమలః**
**అర్చతాంచ దదాత్యేషో పుత్రపౌత్ర ధనానిచ**

నల్లకలువవంటి కాంతిని జిమ్ముచు గుండ్రమై, కోమలమై పొట్టి మొగము మరియు నడిపి చక్రము గలది అమృతాహరణమూర్తి అనబడును. అది సర్వసౌభాగ్యములను అభివృద్ధి చేయును.

**28. చక్రపాణి మూర్తి లక్షణము :**

**పూర్వభాగే త్రివదనః పశ్చాదేకేన సంయుతః**

**అష్టచక్రేణ సంయుక్తః చక్రపాణి రితీరితః**

ముందువైపు మూడు మరియు వెనుకవైపు ఒక మొగము కలిగి ఎనిమిది చక్రములతోగూడిన మూర్తి చక్రపాణి అనబడును.

**29.జగద్యోని మూర్తి లక్షణము :**

**యతిభిః సేవనీయస్స ఏకచక్ర స్సురక్తకః**

**ద్వారచక్రో రక్తవర్ణో జగజ్యోతి శ్శుభప్రదః**

ఎరుపురంగుకలిగి ఎఱ్ఱనగు చక్రము, ద్వారదేశమున మరియొక చక్రముగల మూర్తి జగద్యోని యని చెప్పబడును. ఇది యతులు పూజింప దగినది.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....



**30. అనంతమూర్తి లక్షణము :**

పంచవక్త్రం స్థూలతరం పరుషం బహుచక్రకమ్
విశ్వరూప మనంతం వా పుత్రపౌత్రాభివృద్ధిదమ్

మిక్కిలిలావై అయిదు ముఖములు మరియు అనేక చక్రములు గలది విశ్వరూపమూర్తి లేదా అనంతమూర్తి యని చెప్పబడును. అది పుత్ర పౌత్రాభివృద్ధిని కలిగించును.

**31. శేషమూర్తి లక్షణము :**

ప్రదక్షిణా వర్తయుతాః వనమాలా విభూషితాః
పృష్ఠాది మూర్ధ్ని పర్యంతం వలయాకార రేఖయా
సువర్ణ నిభయా ద్విత్రి చతుః పంచాది సంఖ్యయా

కుడికి తిరిగిన సుడితోగూడ వనమాల మరియు వెన్ను మొదలు తల వరకు గుండ్రని బంగారురేఖలు కలిగి, రెండుమూడు నాలుగు లేదా అయిదు చక్రములతో గూడిన మూర్తి.

**32. అవ్యయమూర్తి లక్షణము :**

పూజనీయః ప్రయత్నేన సిద్ధః స్నిగ్ధం సువర్తులః
బహువర్ణో ద్వారచక్రః పూజితం సుఖదో వ్యయః

నునుపై గుండ్రమై అనేక వర్ణములతోగూడి ద్వారమున చక్రములు గల శిల అవ్యయమూర్తి అనబడును. అది అవ్యయసుఖము నిచ్చును.

**33. త్రిమూర్తి లక్షణము :**

చక్రద్వయ సమేతోవా వదనేషు త్రిషుక్రమాత్
త్రిమూర్తి రితి విఖ్యాతః సర్వసంపత్ప్రదోర్చితామ్

మూడు మొగములు, ఒక్కొక్క మొగమున రెండేసి చక్రములు గల శిల త్రిమూర్తి అనబడును. అది సర్వసంపదలిచ్చును.

**34. హరిహరమూర్తి లక్షణము :**

చతుశ్చక్రో హరహరో ద్విముఖోవర్తులా కృతిః
అధశ్చోర్ధ్వం యథిభవేత్ ద్వేద్వేచక్రే సుశోభనే
యత్తద్ధరిహరం విద్యాన్నరాణాం దారిద్ర్యచః క్రమాత్



గుండ్రనై మొగమున నాలుగు చక్రములు మరియు క్రింద మీద రెండేసి చక్రములుగల శిల హరి హరమూర్తి అనబడును. అది మానవులకు క్రమముగా లేమిని కలుగజేయును.

**35. శంకర నారాయణమూర్తి లక్షణము :**

శివముఖియుతఃపార్శ్వే వామేవా దక్షిణేపివా
సతు శంకర పూర్వాభ్యో నారాయణ ఇతీరితః

కుడినిగాని ఎడమనుగాని శివాకృతియైన నాభిగల శిల శంకర నారాయణమని చెప్పబడును.

**36. స్వయంభూమూర్తి లక్షణము :**

దీర్ఘాస్యం పృథుశ్చక్రశ్చ మూర్తి వర్తుల రేఖవాన్
నీలవర్ణ సమాయుక్తో స్వయంభూః పరికీర్తితః
కేవలం మోక్షఫలదో హ్యర్చతాంచ ఫలప్రదః

నీలమై పొడవైన మొగము పెద్దచక్రం మరియు వర్తులమైన రేఖలు గల శిల స్వయంభువమని చెప్పబడును. అది కేవలము మోక్షము నొసగును.

**37. పరమేష్ఠి మూర్తి లక్షణము :**

పరమేష్ఠీతు శుక్లాభః చక్రపద్మ సమన్వితః
పరిమేష్ఠిమూర్తి తెల్లనై చక్రపద్మములతో కూడివుండును.

**38. చతుర్ముఖమూర్తి లక్షణము :**

చతుస్రోయత్ర దృశ్యంతో రేఖాః పార్శ్వ సమీపగాః
ద్విచక్రమధ్యదేశేతు సాశలాస్యా శ్చతుర్ముఖః

నాలుగుమూలలై ప్రక్కలలో రెండు రేఖలు శిలనడుమ చక్రములు గలది చతుర్భుజమూర్తి అనబడును.

**39. పితామహమూర్తి లక్షణము :**

పితామహ చతుర్వక్త్రో హ్యష్టచక్ర సమన్వితః
వర్తులః కృష్ణవర్ణశ్చ పూజతాం సర్వసిద్ధిదః

నాలుగు మోములు ఎనిమిది చక్రములు కలిగి నల్లనై గుండ్రనైనది పితామహ మనబడును. అది పూజించువారికి అన్ని సిద్ధులనొసగును.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





**40. హిరణ్యగర్భమూర్తి లక్షణము :**

**ఆముఖఃస్వర్ణబిందుశ్చ స్వర్ణగర్భ ప్రకీర్తితః**
**హిరణ్యగర్భం పరమం పవిత్రం భువి దుర్లభమ్**

మొగము మొదలు అంతటను బంగారు చుక్కలు గలది హిరణ్యగర్భ మూర్తి అని చెప్పబడును. అది పరమ పవిత్రము మరియు దుర్లభమైనది.

**41. గరుడమూర్తి లక్షణము :**

**ద్విపక్షాభ్యా ముపేతోయో గరుడో విషమోచనః**
**దుర్లభః సమచక్రస్తు కలౌ కల్మష నాశనః**

రెండు రెక్కలు మరియు సమచక్రములు గలది గరుడమూర్తి అనబడును. అది విషమోచనమును, కలికల్మష నాశమును చేయును.

**42. నరమూర్తి లక్షణము :**

**నరమూర్తిస్తు భగవా నతసీకుసుమ ప్రభః**
**ఏకనాభి సమోపేతో హ్యష్టసూత్రంతు పార్శ్వతః**

అగిసెపూవు రంగులో ప్రకాశించుచు ఒకనాభి మరియు ప్రక్కలందు ఎనిమిది సూత్రముల వంటి రేఖలు గలది నరమూర్తి అనబడును.

**43. శివనాభమూర్తి లక్షణము :**

**కూర్మాకృతి రధోభాగే, లింగభాగే ఖురాన్వితః**
**శివనాభ ఇతిఖ్యాలో భుక్తి ముక్తి ఫలప్రదః**

అడుగుభాగమున తాబేలు వలె నుండి లింగభాగమున గిట్టలతో గూడినది శివనాభ మనబడును. అది భుక్తిని, ముక్తిని ప్రసాదించును.

**44. సద్యోజాత మూర్తి లక్షణము :**

**హేమవర్ణ జటాయుక్త హేమబిందు సమన్వితా**
**మస్తకే గోఖురాభాసా చంద్రగంగా సమన్వితా**

తలపై బంగారు జడల మరియు బంగారు చుక్కలుండి నటువంటి చంద్రరేఖ మరియు గంగగలది సద్యోజాతమూర్తి అనబడును.

**45. వామదేవమూర్తి లక్షణము :**

**రంగశక్తీ రక్తవర్ణ శ్వేతచంద్ర జటాయతా**
**వామదేవభిధా శ్రేష్ఠా గృహిభిః పూజితా సదా**



నెత్తురు రంగు గలిగి లింగశక్తితో తెల్లని చంద్రుడుగల మొగముతో కూడినది వామదేవ మనబడును.

**46. అఘోరమూర్తి లక్షణము :**

**సర్వత్ర లోహితాకారా మూర్ధ్ని రక్త జటాశశీ**
**అఘోరస్సు పరిత్యాజ్యా గృహిభిః యతిపూజితా**

అంతటా ఎఱ్ఱనై తలపై కూడ ఎఱ్ఱని జడలు మరియు చంద్రుడు గలది అఘోరమూర్తి అనబడును.

**47. తత్పురుష మూర్తి లక్షణము :**

**పూర్వభాగే తటిద్భాసా ఊర్ధ్వభాగే జనాశనీ**
**తత్పురుషాభి ధానస్యాద్దుర్లభా సర్వకామదా**

ముందుభాగమున మెరుపు తీగవంటి పైభాగమున జడలు చంద్రుడు గలది తత్పురుషమూర్తి అనబడును. అది లభించుట కష్టము. సమస్త వాంఛితముల నెరవేర్చును.

MOHANPUBLICATIONS.COM

**48. ఈశానమూర్తి లక్షణము :**

**కించిత్కాపిల సంయుక్తః కృష్ణవర్ణ జటేందుకః**
**పార్శ్వేరేఖా సమాయుక్తా మూర్తిరీశాన సంజ్ఞితా**

కొంచెము కపిలవన్నె కలిగి చంద్రరేఖ, రెండు వైపులందుగీతలు కలది ఈశానమూర్తి అనబడును.

**49. సూర్యమూర్తి లక్షణము :**

**బాహ్యేవా భ్యంతరేవాపి వక్త్ర ద్వాదశ సంయుతా**
**సూర్యమూర్తిః పూజకస్య సర్వవ్యాధి వినాశనః**

లోపలగాని వెలుపలగాని పన్నెండు మొగములతో కూడినది సూర్య మూర్తి అనబడును. అది పూజించువారికి వ్యాధులన్నింటిని పోగొట్టును.

**50. హైహయమూర్తి లక్షణము :**

**గర్భాగారే చతుశ్చక్రే పద్మంచే ద్దక్షిణే బహిః**
**పద్మపత్రాకృతిర్వాపి హేమవర్ణ స్సమాకులః**
**హైహయస్తు సదాగోప్తా సర్వసిద్ధి ప్రదాయకః**

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





పద్మాపత్రాకారమై బంగారువన్నె కలిగి గర్భమున నాలుగు చక్రములు వెలుపల దక్షిణమున పద్మములుగలది హైహయమూర్తి అనబడును. అది సర్వదా రక్షణ మరియు సకల కార్యసిద్ధిని కలిగిస్తుంది.

**51. దత్తాత్రేయ మూర్తి లక్షణము :**

**పీతః సితారుణాభశ్చ హ్రస్వపృష్ఠోన్నతా భవేత్**
**అక్షమాలా కృతిర్మధ్యే దత్తాత్రేయః ప్రకీర్తితః**

పసుపు, తెలుపు మరియు ఎరుపు వన్నెలు కలిగి ఎగుడు వీపు మరియు మధ్యభాగమున అక్షమాల గుర్తులు గలది దత్తాత్రేయ మనబడును. సాలగ్రామశిలను క్షీరమునందుగాని, బియ్యమునందుగాని, ఒక రాత్రి అంతా వుంచినయెడల, మరునాటికి ఆ పాలుగానీ, ఆ బియ్యముగానీ పెరుగును (అధికమగును). ఆ పాలుగానీ, ఆ బియ్యముగానీ తగ్గిపోతే ఆ సాలగ్రామము దురదృష్టవంతమైనది. సాలగ్రామ సమీపమున మరణించినచో వైకుంఠప్రాప్తి, శ్రాద్ధకర్మ లాచరిస్తే ఆత్మకు వైకుంఠప్రాప్తి, సాలగ్రామమును వుంచిన ఉదకమును సేవించినచో పుణ్యఫలములు చేకూరును. సాలగ్రామముపై దృష్టి కేంద్రీ కరించి చూచినచో పాపములు నశించును. సాలగ్రామమును హస్తము నందు వుంచుకొని జపంచేస్తే, అధిక శీఘ్రఫలములను పొందెదరు. మృత్యుభయము తొలగును. సాలగ్రామ పూజ, అభిషేకములవలన అనేకానేక యజ్ఞములు చేసిన ఫలముల కంటే అధికఫలములు లభించును. సాలగ్రామదానము పుణ్యప్రదము. సాలగ్రామఉదకమును శిరస్సుపై చిలకరించిన మాత్రముననే ఘోరపాపిసైతము పాపముల నుండి విముక్తి కాగలడు. తులసీదళములు, గంధము, చక్రము, రాతిశిల, శంఖు, గంట, దీపము, రాగిపళ్ళెమునందు, గండకీ నదియందు లభించే సాలగ్రామమును వుంచి పూజించాలి. ఇది పాపములను దహించివేయును. సాలగ్రామ ఆరాధకులకు దుష్ప్రవర్తన, దర్పము, అహంకారము, విషయవాంఛలు, ధనవ్యామోహము, స్త్రీ వాంఛ వుండరాదు. ఏకాగ్రత దృఢచిత్తము వుండాలి. సాలగ్రామఆరాధనకు గురువు, దీక్ష అవసరములేదు. మంత్రములు అవసరములేదు. జపము అవసరములేదు. భావన, ఉపచర్య ప్రధానము, అనేక సాలగ్రామములను ఏకకాలమున అభిషేకించవచ్చును. బేసి సంఖ్యలో పూజించరాదు. సాలగ్రామములను ఏకకాలమున అభిషేకించిన పాప రాహిత్యము, శుభలక్షణముల అభివృద్ధి. సాలగ్రామములను అమ్మరాదు, కొనరాదు, గురువు, జ్ఞాని సాలగ్రామ మును దానము చెయ్యాలి. ప్రతిదినము సాలగ్రామమును పూజించినచో అందు నివసించిన విష్ణుదర్శనం లభించును. పగిలిపోయిన సాలగ్రామమును, తస్కరించిన సాలగ్రామమును పూజించిన ఫలితములు లేవు. తెలుపు రంగు సాలగ్రామము ద్వారక నగరమున (గుజరాత్ సముద్ర తీరమున దొరకుతున్నవి. వీటిపైన గూడ చక్రము గుర్తులువుండును. ఈ ద్వారక ద్వారవతినది సముద్రమున కలియుచోటకలదు. బ్రహ్మ, కృష్ణ, కల్కి దీనిని నిర్మించిరి. ద్వారకలో లభించు సాలగ్రామములు "ఈశ్వర స్వరూపములు" ఈ సాలగ్రామ ప్రత్యేకత హరి హరులు ఇరువురు దీని యందు మేళవించియున్నారు. దీనిని ఆరాధించినచో జన్మ జన్మాంతర పాపములు నశించును. స్కందపురాణములో శివుడు కుమారస్వామితో కార్తీక మాసమునుండి మూడు మాసముల కాలము, తాను బ్రహ్మ,విష్ణు, సాలగ్రామమున నివసింతురని సాలగ్రామ దర్శన మాత్రముననే సర్వపాపములు నశించునని చెప్పెను. భోజనమునకు ముందుగా వడ్డించిన పదార్థములపై సాలగ్రామ మును వుంచి, జలమును చిలకరించాలి. భోజనం పూర్తి అయిన తరువాతకూడ చిలకరించాలి.



MOHANPUBLICATIONS.COM

సాలగ్రామము విష్ణుభక్తులకు వజ్రకవచము, శివభక్తులకు ఇది మహా మృత్యుం జయము. సాలగ్రామము పగిలి ముక్కలు అయిననూ పూజించ దగినదే. ఆధునిక, నవీనకాలములో చిన్నసైజు సాలగ్రామములను, ఉంగ రము, తావీదు, లాకెట్లలో బిగించి ధరించుచున్నారు. ఏ మంత్రము రాని వారు సహితము దీనిని పూజించి "ఓం నమోనారాయణాయ" అని విష్ణుభక్తులు "ఓం నమః శివాయ" అని శివభక్తులు "ఓం నమోస్తుశక్త్యయే నమః" అని శాక్తేయులు పూజించవచ్చు. ప్రతి నిత్యము సాల గ్రామ పూజపొందుతున్న దేవతాగృహమందు తప్పకుండా లక్ష్మీశంఖము, విష్ణు శంఖము, వుండవలెను–అని వాస్తుప్రమాణము. సాలగ్రామ మును పూజించే భక్తులు చందనమును, తులసిమాలను ధరించి గోపి చందన తిలకధారణచేయవలెను. శివభక్తులు రుద్రాక్ష మాలాధారణ ధరించి, విభూదిని నుదుట పెట్టుకొనవలెను. శాక్తేయులు పగడములులేక పద్మాక్షమాలను ధరించి కుంకుమ తిలకధారణ చేయవచ్చు. ప్రతిభక్తుడు సాల గ్రామమునందు ప్రతిఅణువు నందు తన ఇష్టదైవం వున్నదనే భావన, దృఢ చిత్తము గలవారే సత్సంకల్పసిద్ధి పొందుచున్నారు. సాలగ్రామమున ప్రతి అణువు చాల పవిత్రమైనది. సాక్షాత్ భగవత్ స్వరూపమని పురాణ ములు పేర్కొన్నవి. శివ,విష్ణు అభిషేకములలో సాల గ్రామములను ఉపయో గిస్తున్నారు. శివుడు, విష్ణువుల మధ్య రూపభేదములు లేవని ఇద్దరూ ఒకటే నని చెప్పేదే సాలగ్రామము. సాలగ్రామములకు జీవ శిలలు అను పేరు గలదు.

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





# నిత్యజీవితములో సాలగ్రామములు

**2వ అధ్యాయము**



సాలగ్రామమంటే అనగానేమి : అనగా **అవి ఘనాకృతిని దాల్చిన కొన్ని రకాల గుర్తులున్న శిలలు.** సాలగ్రామాలు నల్లగా ఉంటాయి. ఇవి ప్రపంచ వ్యాప్తంగా పూజింపబడు తున్నాయి. వీటి పూజ అనాదికాలం నుంచిఉన్నది. అవి సాధారణంగా మందిరములలోనూ, పీఠాలలోనూ, ఇళ్ళలోనూ పూజింపబడు తున్నాయి. ఇవి విష్ణుమూర్తికి ప్రతి చిహ్నాలు. ఇవి గృహప్రవేశ సమయాలలో వాస్తుపూజ సమయాలలో, శాంతి సమయాలలోనూ, వీటిని పూజిస్తారు. అత్యవసరంగా వివాహ సందర్భాలలో కూడా వాడుతుంటారు. ఈ కలియుగంలో **సాలగ్రామం విష్ణుమూర్తికి ప్రతిరూపంగా వాడుతున్నారు. లింగమూర్తిని శివపూజ చేసినట్లు విష్ణుమూర్తి సాలగ్రామం రూపంలోనూ ఉంది. సాలగ్రామం శంఖాకృతిలో ఉంటుంది.** సాలగ్రామాన్ని నిత్యం పూజ చేసే వారికి మృత్యుభయం లేదు. జీవన్మరణాలు లేవు.

## సాలగ్రామ-రుద్రాక్ష పూజా విధానం

సాలగ్రామాన్ని, రుద్రాక్షను సంపాదించి దానిని మంచినీటితో శుభ్రపరచి పూజచేసే చోట పెట్టాలి. ఈ క్రింది వస్తువులతో పూజ చెయ్యాలి.

**పంచగవ్యాలు:** ఆవుపేడ, గోమూత్రం, పాలు, పెరుగు, నెయ్యి. కలశాలతో కలిపిన నీరు , ఉద్ధరిణ, తొమ్మిది తమలపాకులు, సాంబ్రాణి, అగరవత్తులు, కర్పూరం, దీపం, గంధం, అక్షతలు, నేతి దీపం, కొత్తబట్టలు, పూలు, పళ్ళు, వక్కలు, ఆకులు, కొబ్బరికాయ.



తూర్పు దిక్కున కూర్చుని రుద్రాక్షనుగాని, సాలగ్రామాన్ని గాని పంచగవ్యాలతో శుద్ధి చెయ్యాలి. రావిఆకులున్న పళ్ళెంలో ముంచి మూడు సార్లు, **'ఓం నమశ్శివాయ'**, 'ఓం నమో నారాయణాయ' జపం చెయ్యాలి. ఈ మంత్రాన్ని 108 సార్లు జపం చెయ్యాలి.

## సాలగ్రామ శిలలు

ఈ సాలగ్రామాలు గండకీనదిలో దొరకుతాయి. వంకరగాను, పెద్దవిగాను, చిన్నవిగాను, బ్రౌన్‌గానూ, ఎరుపుమచ్చలతో, మచ్చలు లేకుండా, విరిగిపోయినా, పెద్ద నీటితో ఒక చక్రం అనేక చక్రాలలోనూ పెద్ద చక్రంలో విరిగిన చక్రంగాని, సర్పం ముఖాకృతితో ఉన్న సాలగ్రామాన్ని పూజచేసేవారికి మంచిదికాదు. వీటిని వదలివేయాలి. నల్లగానూ, గుండ్రంగానూ, ఉసిరికాయంత ఖచ్చితమైన వెనుతిరిగినది వరాహరూపి, వాసుదేవ రూపులైఉన్న వాటిని పూజచేసేవారి కోర్కెలు తీరుస్తాయి.

భౌతికవాంఛల కోరుకునే వారికి దోషపూరిత సాలగ్రామాలు దుష్ఫలితాలను ఇస్తాయి. సాలగ్రామాన్ని ఎంతో భక్తి శ్రద్ధలతో ఈ శ్లోకంతో ధ్యానించాలి.

**సాలగ్రామా శిలాభగ్న పూజనీయస చక్రిక**
**ఖండిత స్ఫుటిత వపి సాలగ్రామ శిలశుభ**

సాలగ్రామం పలిగిపోయినా చక్రం మాత్రం పగిలిపోకుండా ఉంటే అది పూజకు ఉపయోగించవచ్చును.

**ఘండితం స్ఫుటితం భగ్నం పార్శ్వభిన్నం విభేదితాం**
**సాలగ్రామ సముద్భుతం శౌలం దోష వహం నహి**

బ్రహ్మ పురాణం నందు సాలగ్రామ శిల ముక్కలైనా, పగిలినా దానిని దోషపూరితమని చెప్పరాదు. సవ్యసాలగ్రామాన్ని పూజించిన వ్యక్తికి అసాధారణమనేది లేదు.

సాధారణంగా చిన్న సాలగ్రామాలు నల్లగానూ, సుస్పష్టలక్షణాలతో ఉన్న వాటిని పూజించాలి. ఇవి దొరకనప్పుడు మామూలు వాటిని పూజించాలి. **సాలగ్రామంలో భగవంతుడున్నాడు. అందువల్ల సాలగ్రామమునకు ప్రతిష్ఠ కార్యక్రమం అవసరంలేదు.**

**సాలగ్రామ శిలాయుతం ప్రతిష్ఠా నైవవిద్యతే**
**మహాపూజస్తు కృత్వదే పూజయేత్ తంత తతో బుధ.**

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....



సాలగ్రామాల పూజకు ప్రతిష్ఠ అక్కరలేదు. సాలగ్రామాలు పూజ చాలునని స్కాందపురాణం చెబుతోంది.

సాలగ్రామాలు సాధారణంగా గండకీనదిలో దొరకుతాయి. ఇది హిమాలయ పర్వతసానువులలోఉంటుంది. నారాయణి, సాలగ్రామ హిరణ్వతి, హిరణ్య వాత్మిని అంటారు. సాలగ్రామాల పవిత్రత గురించి మహాభారత భీష్మపర్వంలో విపులంగా ఉంది. పురాణాలలోపవిత్ర జలాలలో అన్ని దేవుళ్ళు, దేవతలుంటారని పురాణ వాక్యం. సాలగ్రామాలను తాకగానే పాపాలు పటాపంచలవుతాయి. ఎంత దుర్మార్గు డైనాసరే సాలగ్రామ పవిత్రజలం తాగినంత మాత్రాన పావనులవుతారు. పుట్టుక చావులు రెండూ ఉండవు.

అందుకని గండకీనది అతిపవిత్రమైనది. చూసినంతే పాపాలు పోతాయి. తాకినా, స్నానం చేసినా పానం చేసినా మానసిక, దైహిక పాపాలు నాశనమవుతాయి. నది చాలా పురాతనమైనది. హిమాలయము పుట్టక ముందు నుంచే పుట్టిందని భౌగోళిక శాస్త్రవేత్తలు చెబుతున్నారు. గండకీ ఒక సరస్సు. నేపాల్‌లో సాలగ్రామాలు దొరకు తాయి. ఇవి సాధారణంగా నేపాల్‌లో అతిపవిత్రంగా ఉంటాయి. వాటిని జాగ్రత్తగా సేకరిస్తారు.

**కోరిక ఉన్నా లేకపోయినా ఈ సాలగ్రామాన్ని పూజించి సాష్టాంగ పడి వారికి విముక్తి లభిస్తుంది. నిత్యం పూజచేసేవారికి మృత్యు భయం ఉండదు. సాలగ్రామ పూజతో అసాధారణ శక్తులు లభిస్తాయి.**

సాలగ్రామాన్ని మధ్వులు పూజచేస్తారు. అయ్యవార్లో, వడమఅయ్యర్లు ఈ సాల గ్రామాన్ని పూజచేస్తారు. శిలారూపముండిన శిలలు గండకీనదిలో సాలగ్రామాలుగా భిన్నముద్రలతో సాలగ్రామాలుగా మారుతాయి. కొన్ని కథలను బట్టి ఈశిలలు సాలగ్రామాలుగా తయారుకావటానికి కొన్ని సంవత్సరాలుపట్టి విష్ణుమూర్తిగా మారుతాయి. సాలగ్రామ గర్భంలో విష్ణుమూర్తి ఉంటాడు. సాలగ్రామాల రూపంలో సాలగ్రామ విష్ణుమూర్తి ఉంటాడు. నల్లగా కనిపిస్తున్న సాలగ్రామం ప్రశస్తమైనది. ఇది గుడుల లోనూ, ఇళ్ళలోనూ పూజలందుకుంటూ ఉంటుంది. ఇవి విష్ణుమూర్తి ప్రతి రూపాలు. **శంకరుని శివలింగంతో పూజచేస్తే విష్ణుమూర్తిని సాలగ్రామ రూపంలో పూజచేస్తూ ఉంటారు. సాలగ్రామాన్ని మానవుడు ఎప్పుడూ తయారు చెయ్యలేదు. సాలగ్రామాలు గండకినదిలో ఉంటాయి.**



సాలగ్రామ పూజా విధానంలో ఏ శ్లోకాలు అక్కరలేదు. ఏ విధమైన చక్రాలు అక్కరలేదు. ఎందుకంటే, ఆ చక్రాలు అందులో ఉన్నాయి. కనుక సాలగ్రామాలకు ప్రతిష్ట కార్యక్రమం ఉండదు.

కొన్నిసాలగ్రామాలు మామూలు ఆకృతిలో ఉంటాయి. చిన్నవి, మరీ చిన్న సాలగ్రామాలకు చక్రాలు ఉండవు. రంధ్రాలు ఉండవు. అవి నల్లనిరాల వలె ఉంటాయి. వాటిని దీపపుకాంతిలో చూచినట్లైతే దాని రెండు వైపులా కనిపిస్తుంటుంది. ఆ రాతిలోపల ఎఱ్ఱనికాంతి కనిపిస్తుంది. వీటిని రత్నగర్భా లంటారు. అవి చాలా అరుదుగా కనిపిస్తాయి. సాలగ్రామ చక్రాలను బట్టి వాటి ప్రాశస్త్యం వెల్లడి అవుతూంటుంది. సాలగ్రామ చక్రాలనుబట్టి వాటికి ప్రాధాన్యత ఉంటుంది. ఒక సాలగ్రామంలో ఒకటి రెండు చక్రాలుంటే ఎంతో ప్రశస్తమైనవి. సాలగ్రామంలో 9 రంధ్రాలు, 14 చక్రాలు ఉన్నట్లైతే దానిని అనంతపద్మనాభమూర్తి అంటారు. 2 రంధ్రాలు, 4 చక్రాలుంటే నారాయణమూర్తి అని అంటారు. ఇట్లాగే అనేక పేరులున్నాయి. అన్ని మూర్తులకు ఒకటే శక్తి ఉంది.

MOHANPUBLICATIONS.COM

అవిగండకిలో లభ్యంకావటం శివునకు శాశ్వత నివాసస్థానంకాదు. ఈ సాలగ్రామాలకు విష్ణుమూర్తి ప్రతిరూపంగా పూజంచటము వెనుక ప్రాధాన్యత ఉన్నది. ద్వారకవద్ద దొరికే శ్వేతవర్ణశిలలు కూడా సాలగ్రామ మంత ప్రశస్తమైనవి. వీటిని చక్రనిక అంటారు. దీనిని సాలగ్రామంతోపాటు పూజా గృహాలలో ఉంచుతారు.

**సాలగ్రామశిలాయత్ర యత్ర ద్వారకావతి శిల**
**ఉభయ శంఖ్నో యత్ర యత్ర ముక్తార్ణ సంశయః ॥**

మధ్వులు పూజించేసాలగ్రామాలు చిన్న ఆకృతిలో ఉంటాయి. పెద్ద ఆకృతి సాలగ్రామాలను గుడులలో పీఠాలలోను, మఠాలలో ఉంచుతారు.

చిన్నఆకృతి సాలగ్రామాలను ఇంటిలోని పూజమందిరంలో ఉంచుతారు. అసాధారణమైన వాటిని గుళ్ళలోనూ మఠాలలోనూ, పీఠాలలోను ఉంచుతారు.

పరమశివుడు తనంతటతానే ఈ క్రింది విధముగా తెలియజేసినారు.

**ముల్లింగ కోటిభిదృష్టి యత్ఫలం పూజతి సృష్టి**
**సాలగ్రామ శివాలయంతు ఏకస్వమివ తాద్ భవేద్**
**అనేక కోట్ల శివలింగాలను దర్శించినంత ఫలం ఒక్కసాలగ్రామాన్ని పూజిస్తే** వస్తుంది.

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....








అంబికా సాలగ్రామములతో నర్మద బాణములు

MOHANPUBLICATIONS.COM

## సాలగ్రామం నల్లటి రాళ్ళుగానే ఉంటుందా?

సాధారణంగా సాలగ్రామాలు నల్లరాళ్ళుగా ఉంటాయి. కొన్ని సందర్భాలలో సాలగ్రామాలు అన్ని రంగుల్లో కూడా ఉంటాయి. ఆ రకపు సాలగ్రామాలు అపురూపంగా ఉంటాయి. ఎఱుపు సాలగ్రామాలు ఇంటిలో పూజచేయరు. ఈ సాలగ్రామాలు నేపాల్‌లో గండకీనదిలోనే దొరకుతాయి. ఇంకెక్కడా ఉండవు.

ఒక్కగండకీనదిలోనే దొరకుతాయి. అందులో విష్ణుమూర్తి ఆయుధాలు సుదర్శనచక్రం మిగిలినవి ఆయుధాల చిహ్నాలు ఉండవు.

చక్ర చిహ్నామే ఉందిగాని మిగిలినవి లేవు. ఇవి స్వాభావికంగా ఏర్పడవు. చక్రాలు వజ్రకీటాలన్న కీటకాలద్వారా ఆ రాళ్ళమీద ఏర్పడతాయి. వాటి పళ్ళు వజ్రాలకంటె గట్టిగా ఉంటాయి. ఈ చక్ర నిర్మాణం సాలగ్రామం బయటమాత్రమే కాదు, అంతర్గతంగా కూడా ఉంటుంది. మనం వీటిని టార్చిలైట్ సహాయంతో రంధ్రాలను చూడవచ్చు. ఈ రంధ్రాలను వదనాలు అనిపిలుస్తారు. చక్రాలను రంధ్రాల ద్వారా చూడవచ్చు. ఈ చక్రాల ద్వారా నేపాల్ సాలగ్రామం స్వాభావిక మైనదా? కృత్రిమమైనదా? అని పరిశోధకులు నిర్ణయిస్తారు.



సాలగ్రామగుర్తింపు మైసూర్ మహారాజువ్రాసిన **శ్రీతత్త్వనిధి** అన్న విజ్ఞా సర్వస్వం నుండి ఈ క్రింది భాగాలు తీసుకున్నాము. ఇందులో 9 భాగాలున్నాయి. అవన్నీ నిధులుగా ఉన్నాయి. అందుకు వీటికి నవనిధులని పేరుపెట్టారు. ఇందులో బొమ్మలున్నాయి. విగ్రహాలు, ఆగమశాస్త్రం, జ్యోతిషం, సంగీతం, క్రీడలున్నాయి. ఆయన వీటన్నిటిని ప్రాచీన మధ్య యుగాలనాటి గ్రంథాలనుండి సేకరించాడు. ఇందులోని వైష్ణవవిధి విభాగాలలో సాలగ్రామశిల, దాని లక్షణాలు అన్నిటిని దిగువ ఇచ్చాము.

సాలగ్రామమన్నది దక్షిణాదిలో ఎక్కువ ప్రాచుర్యంలో ఉంది. ఇంతే ప్రాచుర్యం దీనికి ఉత్తరాదిలోనూ ఉంది. సాలగ్రామమన్నది ఖచ్చితమైన, నిర్దుష్టమైనవి అని అర్థము. వీటి అర్థాలన్నీ నరసింహపురాణం నుండి సేకరించారు. శ్రీ తత్త్వనిధిలో ఉన్నాయి. ఇవి బ్రహ్మ నారద సంవాద రూపంలో ఉంది. ఇవి ఒక పద్ధతిలో లేవు. సాలగ్రామ పరీక్ష అన్న పుస్తకాన్ని బికనీర్ మహరాజు అనుపసింహ వ్రాశాడు. సాలగ్రామ పరీక్ష అనుబంధంలో చేర్చాడు. ఇది ఒక క్రమపద్ధతిలో మూడు అధ్యాయాలుగావ్రాశారు. 1) పదిఅవతారాల మూర్తులు 2) 24 రకాల మూర్తి భేదాలలో విభిన్న మూర్తులని విభజించారు. ఇవన్నీ శ్రీతత్త్వనిధిలో కూడా వివరించారు. ఇవి నరసింహ పురాణం ఆధారంగా తీసుకుని ఆయన వ్రాశారు. సాలగ్రామ పరీక్షసమీక్ష మిగిలిన పురాణాలలో కూడా ఉంది. 24 రకాల సాలగ్రామాలు దైవదత్తమని ఈ సాలగ్రామ వర్ణన వివిధ రకములుగా ఉంది. వీటి పూర్తి వివరాలు పూర్తిగా నరసింహ పురాణంలో ఉంది. ఈ వివరణమంత అనుపసింహ వ్రాసిన దానంత స్పష్టంగాలేదు. ఇది దక్షిణ ప్రాంతానికి సంబంధించినంతవరకు సాలగ్రామ చరిత్ర వివరంగా ఉంది. నారదునకు బ్రహ్మ చెప్పినంత వరకు ఇంకా ఎన్నో అధ్యాయాలలో విపులంగా ఉంది. మిగిలిన సాలగ్రామాల చరిత్ర చెప్పమని ప్రార్థించాడు.

సాలగ్రామ వివరాలు బ్రహ్మ నారదునికి ఈ విధంగా చెప్పాడు. సాలగ్రామాల పుట్టుక, గుర్తింపు, లక్షణాలు ఎక్కడ సాలగ్రామాలు దొరికేది చెప్పనారంభించాడు. **గండకినది విష్ణుమూర్తిరూపమే.** మహావిష్ణువు అక్కడే శ్రీదేవి, భూదేవిలతో ఉన్నాడు. ఇక్కడ సాలగ్రామాలు జన్మించాయి. ఇవి దైవ శక్తితో జన్మించాయి. వజ్రకీటమన్నది విష్ణుమూర్తి రూపమే. ఈ కీటకం ఈశిలలో ప్రవేశించి మధుర నాదాన్ని సృష్టించి విష్ణు రేఖలను ఆ శిలలో

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





చిత్రిస్తుంది. లక్ష్మీదేవి శిలలోపల ఉంటుంది. ఇందులో దైవతీర్థం విరిగిపోదు. కొలిచినంతమాత్రాన అన్ని పాపాలు పోతాయి. వివిధ రూపాలు, రంగు, మిగిలిన లక్షణాలు ఈ విధంగా ఉన్నాయి. ఈ సాలగ్రామాలు తెలుపు పసుపు, పచ్చ,ఎఱుపు, నలుపు, ఆకుపచ్చ మచ్చలలోను, రంగు రంగులో కొన్ని సందర్భలలో గాఢంగాను, కొన్ని సందర్భాలలో పాలిపోయి నట్లు కొన్ని సందర్భలాలలో రంగు కనిపెట్టడం, కష్టంగా ఉంటుంది. సాలగ్రామం దేవుని తలపై ఉంటుంది. అది రంగును బట్టి ఆధారపడి ఉంటుంది. **వాసుదేవసాలగ్రామం తెల్లగా ఉంటుంది. విష్ణుసాలగ్రామం రంగు నల్లగా ఉంటుంది. నారాయణసాలగ్రామం ఆకుపచ్చగా ఉంటుంది. నరసింహ సాలగ్రామం ఎఱ్ఱగా ఉంటుంది.** వాటి వాటి రంగులు వాటివాటి ప్రభావాలను కలిగి ఉంటాయి. వివిధ రంగులున్న సాలగ్రామం పూజార్హమైనది. పాలిపోయిన రంగులున్న సాలగ్రామం పూజార్హమైనది కాదు. ఖచ్చితమైన రంగులులేని సాలగ్రామాలు అన్నిటిని నాశనం చేస్తాయి.

విష్ణుమూర్తి రూపాలు మత్స్య కూర్మ వరాహ, నరసింహ, పరశురామ, రామ రామ, బుద్ధ కల్కిలుగా ఉన్నాయి. భక్తికి కొన్ని సాలగ్రామాలు ప్రత్యేకమైనవి మత్స్యమూర్తి చేపతల ముఖం మీద చక్రం ఉంటుంది. శ్రీవత్స చిహ్నముంటుంది.

ఇంకో రకమైన సాలగ్రామం చిన్నదిగాను రెండు గుండ్రటి మచ్చలుంటాయి. గాఢమైన రంగు ఉంటుంది. నున్నగా మెత్తగా ఉంటుంది. వనమాల గుర్తు ఉంటుంది. ఇది ఎంతో పవిత్రమైనది. భౌతిక వాంఛలను తీర్చేది సీతారామమూర్తి సాలగ్రామరూపం. సాలగ్రామం కింద భాగంలో చక్రం ఉంటాయి. కల్ప వృక్షముంటుంది. బ్రహ్మమూర్తి సాలగ్రామం తెల్లగా ఉంటుంది. గుండ్రంగాను పసుపుపచ్చగా ఉంటుంది. ఒక చక్రం కాలువ గుర్తు ఉంటుంది. వెనుక భాగాన ద్వారముంటుంది. సంరక్షణ సాలగ్రామానికి రెండు చక్రాలుంటాయి. ఒకేచోట ఉంటాయి. సాలగ్రామం ఎఱ్ఱరంగులో ఉంటుంది. చూడటానికి చాలా అందంగా ఉంటుంది.

హిరణ్యగర్భ సాలగ్రామాన్ని పూజిస్తే అదృష్టం కలసి వస్తుంది. శివనాభ సాలగ్రామం భౌతికశక్తిని అభివృద్ధి చేస్తుంది. కొన్ని రకాల సాలగ్రామాలు లక్షణాలు కనిపెట్టడం చాలా కష్టం. సాలగ్రామాలలో కూడా ఎన్నో పేర్లు ఉన్నాయి. వీటన్నిటిని విభజించి ప్రత్యేకంగా గర్తుంచుకునేందుకు



కొన్ని వేల సంవత్సరాలు పడుతుంది. సాలగ్రామాల ఆకారాలు గురించి ఆలోచించడం చాలా కష్టతరమైన విషయము సాలగ్రామాలు చక్రాలు ఇంకా ఎన్నో రకాల ధనుర్బాణాలలో ఉంటాయి. పూజచేయకూడని సాలగ్రామాలు ఏవి అనగా: **పగిలిపోయినవి, కాలినవి, శక్తిలేనివి రెండు సాలగ్రామాలను అతికించినవి త్రికోణంగా ఉన్నవి పనికిరావు. వీటిని పూజించినందువల్ల మానవ హాని జరుగుతుంది.** ఏ విధమైన గుర్తులేని సాలగ్రామాన్ని పూజించినందువల్ల కుటుంబం ఇబ్బందిపాలు అవుతుంది.

సాలగ్రామాన్ని క్షుణ్ణంగా పరిశీలన చేసి పూజార్హమయినదో కాదో తెలుసుకోవాలి. 14 రకాల శుభలక్షణాలున్న సాలగ్రామాలను బహుమతిగా ఇవ్వడం భగవంతునికి ఇష్టం. **పూజచేసిన సాలగ్రామాన్ని బహుమతిగా ఇవ్వడం తరువాత దానిని పూజించడం ఎంతో మంచిది. సాలగ్రామాన్ని అమ్మడం, కొనడం దోషమే. అలాంటి సాలగ్రామాన్ని పూజకు పరిశుద్ధ మనస్సుతో ఉంచాలి.** సాలగ్రామం చక్రం సరిగా ఉన్నపుడు సాలగ్రామం పగిలిపోయినా, పేలిపోయినా దానిని పూజించవచ్చు. ఒక ఇంట్లో రెండు సాలగ్రామాలు, రెండు లింగాలను పూజించరాదు. రెండు ద్వారకశిలలను, రెండు సూర్యశిలలు కూడ పూజించరాదు. గణేశ,దేవిలను పూజించరాదు. పది సాలగ్రామాలను పూజించరాదు. రెండు సాలగ్రామాలను మాత్రమే పూజించరాదు. అంతకుమించి సరియైన సాలగ్రామాలను పూజించవచ్చు. సాలగ్రామాలు కడిగిన నీటిని తీర్థంగా తీసుకోవచ్చును. నారదా! నీకు నేను సాలగ్రామాలకు సంబంధించిన పూర్తి వివరాలు తెలియజేశాను. దీనిని ఎంతో భక్తితో విష్ణుమూర్తి సంతోషించే విధంగాను చెప్పాను. సాలగ్రామాల బాగోగులను ఎవరయితే వింటారో వారే జీవితంలో నాలుగు రకాల భాగ్యాలను పొంది నా ప్రేమకు పాత్రులవుతారు.

**ఎవరయితే సాలగ్రామాలను గురించి పగలు రాత్రి వివరిస్తూ ఉంటారో వారికి అనేక రకాలుగా వారికి తెలియని లాభాలెన్నో కలుగుతాయి.** నారదుడు ఇదంతా విని తలవంచుకుని బ్రహ్మను పూజించాడు. నారదుడు నాకు సాలగ్రామాల లక్షణాలు భక్తి ప్రపత్తులు వారి రంగులు రూపాలు గురించి చెప్పారు. చాలా సంతోషం. తరువాత బ్రహ్మ నారదా! నీవు అడగకుండా చెప్పేది విను సాలగ్రామాలు ఎన్నో రకాలుగా ఉన్నాయి. అసంఖ్యాక రంగులలో కూడా ఉంటాయి. అందులో కొన్ని లాభదాయకం

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





గాను, పూజార్హమయినవిగాను ఉంటాయి. సాలగ్రామాల విభజన వాటి రంగును బట్టి ఉంటుంది.

ఈ కాలములో సాలగ్రామ విశేషాలు :

**సాలగ్రామాన్ని పతకం మాదిరిగాను, కంకణంగాను, ఉంగరంగాని, గణేశ, దుర్గ, వేంకటేశ్వరాది విగ్రహాల మాదిరిగా ధరించవచ్చు.** సాలగ్రామాలకు ఖరీదు కట్టాలన్నా విలువ తెలుసుకుందామన్నా ఖరీదు తెలుసుకుందామనుకున్న వ్యక్తి నరకంలో ఉంటాడు. చాలామందికి సాలగ్రామ పూజ చేద్దామని ఉంటుంది. గండకినది వద్దకుగాని, ముక్తినాథ క్షేత్రం దగ్గరకుగాని వెళ్ళలేరు. ఈ సాలగ్రామాలు ఆ నది నుండి సేకరిస్తారు. మనకోసం తెస్తారో, పాకింగ్, కొరియర్ చార్జీలకు పోను మిగిలిన డబ్బు గ్రామస్థులకు వెడుతుంది. గ్రంథాల సిద్ధాన్త ప్రకారం సాలగ్రామశిల ఎవరికైనా ఇవ్వదలచుకున్నపుడు దానిని ధర్మంగా ఇవ్వాలి.

MOHANPUBLICATIONS.COM

సాలగ్రామ మహిమ గురించి ఇంగ్లీషులో అనేకమంది వ్రాశారు. సాలగ్రామాలు ఇంగ్లీషులోను, కన్నడంలోను ప్రచురిస్తున్నాయి. సాలగ్రామాలు ఏర్పడినప్పటి నుంచి దైవదర్శనం జరుగుతుంది. సర్గర, పాషాణం, శిల, సర్గర అన్ని కూడా శిలలే. నల్లటి శిలలు, ఇవి నాల్గు వేదాలలోను చెప్పబడింది. గ్రవ అన్నపదం ఋగ్వేదంలో ఉంది. మంత్రం "ద్రావణాతంలో ఉభీష్టుత్తర" గ్రవ అన్నపదంలో కలిసినప్పుడు 'సరిల అసాగ్రవస" క్లుప్తీకరించి 'సాలిగ్రవ' అన్నారు. ఇందులో ఎన్నో ఖనిజాలు న్నాయి. లోహాలున్నాయి, నదీప్రవాహాలున్నాయి. స్థిరంగా ఒక చోట ఉన్నపుడు ఇసుకతిన్నెలున్నాయి. ఈ క్రమపద్ధతిలో సాలగ్రామాలు పుడ తాయి. ప్రకాశవంతమైనవి స్వయంభువులు, అవి మంచి రంగులోను, ప్రకాశవంతంగాను, గుండ్రంగాను, చక్రాల మాదిరిగా ఉంటాయి. వీటికి అనువంశీక శక్తులుంటాయి. అవే వాటిని పూజార్హం చేసి ఎంతోకాలం నీటి అడుగున ఉంచుతాయి. కొన్ని వేల సంవత్సరాలపాటు జలగర్భంలో ఉండి ఆధ్యాత్మికశక్తిని సంతరించుకుంటాయి. సాలగ్రామ పూజ మోక్షాన్ని స్తుంది. గరుడ, విష్ణు, అగ్ని పురాణాల ఆధారంగా వివరించాను. అవి ఎన్నో రకాలుగా విభజించవచ్చును. సాలగ్రామం నల్లచారిక చక్రాలు ఈ ప్రాంతంలో ఏర్పడతాయి. ఈ వృత్తాలు మిగిలినవాటిలో ఉండవు. రేఖలను, చక్రాలను గీచే కీటకాన్ని వజ్రదంష్ట్ర కీటకమంటారు.



**" స్త్రియో వాయది వశూద్ర బ్రాహ్మణాః క్షత్రియా దీయః**

**పూజయిత్వా శిల చక్రాలన్తే శాశ్వతం వేదం**

సాలగ్రామ పూజ స్త్రీలు, శూద్రులు పూజ చెయ్యవచ్చును. సక్రమముగా పూజ చేసినట్లయితే బ్రహ్మ క్షత్రియులు కృష్ణసాన్నిధ్యం చేరతారు.

**గృహత విష్ణు దిక్షరో పూజ్వాదో నరః**

**వైష్ణవో భిహితో భిజ్ఞైరితారో స్మద్ అవైష్ణావచః**

విష్ణు మంత్రాన్ని ఎవరైతే జపిస్తుంటారో అతడే వైష్ణవుడు. మిగిలినవారు అవైష్ణవులు అని పద్మపురాణం హరివిలాసం 1.55లో చెబుతోంది.

**యథాకాంచనం యతికశ్యకం రస విధానతః**

**రాథదీక్షవిధానే సద్విజత్వం జయతేర్ణనమ్.**

ఒక పద్ధతి ప్రకారం ఘంటాలోహాన్ని పాదరసంతో కలిపితే అది లింగాకారంగా మారినట్లు సరియైన గురువు శిష్యుని బ్రాహ్మణుడుగా తీర్చిదిద్దుతాడు (హరి భక్తివిలాసం 212-తత్త్వసాగరం)

**భక్తి రష్టవిధ హే ఈశ యస్మిన్ మే చ్ఛేపివర్తతే**

**సవిప్రేన్ద్ర మునిశ్రేష్ఠా సజ్ఞానిసభపండితః**

**తస్మైదేయం తతో గ్రాహ్య మశ్చపూజాయుత హరిః**

ఎన్నో రకాల భక్తులున్నారు. మ్లేచ్ఛకులం నుండి సైతం విష్ణువులు వచ్చారు. వైష్ణవ సిద్ధాంతం ఎవరైతే పూర్తిగా అర్థం చేసుకుంటారో అతడే నిజమైన వైష్ణవుడు. అతనిని మనం పూజించాలి. దైవంగా భావించాలి.

**అర్చ్యే విష్ణౌ శిలదిటరుసు నరమి తిర్వై ష్టవేజ**

**తిబుద్ధి ర్విష్ణోర్వ వైష్ణవం**

**కలిమాల మధ్యనే పదతీర్థం బుద్ధిః**

**శ్రీ వైష్ణోర్నమామి మంత్ర సకాల కాలుషహే**

**శబ్ద సామాన్య బుద్ధి ర్విషొ సర్వేశ్వరే శ తాదితర**

**సభూధిర్యశ్య వనరకి సః**

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





గుడిలోని దైవాన్ని గురించి సమననం చేస్తున్నా ఉరువు వారసత్వాన్ని శిష్యునకు సామాన్యుడైనప్పటికి అచ్యుతగోత్రికుడైనట్లు గంగను మాములు నీరుగా భావించిన వ్యక్తి నరకం అనుభవిస్తాడు. (పద్మ పురాణం)

**చండాలోఽపిద్విజశ్రేష్ఠో భక్తి పారాయణః**

**హరిభక్తి విహనసభ ద్విజోసి స్వపిన రామః**

బ్రాహ్మణాలలో దైవభక్తి ప్రశస్తమైనది. శునకభక్షకునకు సేవ చేయటం అంతకంటే ఎన్నో రెట్లు గొప్పది.

**'ఋగ్వేఽధ యజుర్వేదః సాలీవేదోఽపి అధర్వణః**

**అధితరుతేన మేణోక్తః హరిరిత్యే క్షర ద్వయాం'**

హరి అన్న అక్షరాలను జపించిన వ్యక్తి చతుర్వేదాలు చదివినట్లే.

సాలగ్రామపూజ రోజుగాని సాధారణంగా అన్ని సాలగ్రామాలకు నిత్యపూజ జరగాలి. సింహాసనంపై సాలగ్రామముంచి పూజచెయ్యాలి.

**యథాబలి దూరా రథే హరషిత హణ సాలగ్రామసేవాకరే విశేష కరియే.**

బ్రాహ్మణ కుటుంబములలో సాలగ్రామశిల పూజింపబడుతూ ఉంటుంది. కొంతకాలం ఈ పద్ధతి కొనసాగినది. ఈ మధ్యకాలంలో బ్రాహ్మణులు కూడా సాలగ్రామ పూజ చెయ్యటం లేదు. ప్రస్తుత యుగంలో సాలగ్రామ పూజకన్నా మంత్రమననం నిరంతరం చేస్తుంటారు. పరిస్థితులు, పూజ, పరిశుద్ధతనలు అవసరం. **ఆధ్యాత్మిక శక్తికోసం అందరూ సాలగ్రామ పూజ చెయ్యాల్సిందే. సాలగ్రామ పూజ అన్ని వర్గాల వైష్ణవులు పూజ చేస్తారు.**







అలంకరణతో సాలగ్రామము

MOHANPUBLICATIONS.COM

## తులసి సాలగ్రామ జలదానం

మేషరాశిలోకి సూర్యుడు ప్రవేశించినప్పుడు కొత్త సంవత్సరం వస్తుంది. కేశవ వ్రతం ప్రారంభమవుతుంది. ఈ నెలంతా దైహిక వాంఛ అదుపులో ఉంచుకుంటు రెండు పూటలా నదీ స్నానం చేస్తూ పూజ చేస్తూ బ్రాహ్మణులకు దానమివ్వాలి. మధుసూదను పూజ చేస్తే ఎన్నో లాభా లున్నాయి. కుండను వేలాడదీసి నీటితోనింపి చిల్లుపెట్టి సాలగ్రామాన్ని తులసిలో ఉంచాలి. ఇది ఉత్తర దిక్కుగా ఉంచితే మంచిది. దీనితో తులసి పెరిగేందుకు ఉపయుక్తమవుతుంది. ఇది తులసి శ్రీకృష్ణుల వివాహదృశ్యం. సాలగ్రామ తులసిల పూజ పద్మనాభగోసాయ్ అచ్చులోముగా వ్రాశాడు.

అనాదికాలంలో బ్రహ్మద్వారా తులసికి వివాహమైందని వశిష్ఠుడు చెప్పాడు. నారద పాంచరాత్రాగమం ప్రకారం ఈ విధముగా ఉన్నది : తులసి ఇంట్లోను, అడవిలోను పెరుగుతుంది. మూడేళ్ళ తర్వాత వాటికి వివాహం చెయ్యవచ్చు. సూర్యుడు ఉత్తరానికి వెళ్ళినప్పుడు గురుశుక్రులు ఉచ్ఛలో ఉన్నపుడు కార్తిక మాసంలో మాఘమాస పౌర్ణమి లోపల వివాహం చెయ్యవచ్చును. పౌర్ణమిరోజున యజ్ఞకుండం మంటపాలు ఏర్పరచి పూర్వీకులను పిలిచి ఈ క్రతువు శ్రద్ధాసక్తులలో పూర్తి చెయ్యవచ్చు. నాలుగువేదాలు చదివిన వారిలో ఒకరిని బ్రాహ్మణ నియమించవచ్చును. ఋషిగాను, బ్రాహ్మణుడుగాను, పౌరోహితుడుగాను కూర్చుండబెట్టవచ్చును.

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....



వైష్ణవ పద్ధతి ప్రకారం నీటికుండను తీసుకురావాలి. లక్ష్మీనారాయణ సాలగ్రామం తీసుకువచ్చి గృహయజ్ఞం పూర్తిచేసి 16మంది ప్రమిదలతో పూజ చెయ్యవలెను. బంగారు నారాయణమూర్తి పూజ తులసిమూర్తిలో వివాహక్రతువు పూర్తి చెయ్యాలి. తరువాత ఆచార్యులు, గురువు, ఋషి తదితరులు యజ్ఞకుండంలో తొమ్మిది రకాల (ఖాద్యాలను) సమర్పించాలి. వైష్ణవ సంప్రదాయం ప్రకారం గురుదేవులు వివాహ క్రతువు పూర్తి చేసాడు.

వైష్ణవ సిద్ధాంతం ప్రకారం **ఓం నమో భగవతే కేశవాయ నమః స్వాహా"** అన్న మంత్రంతో ఉచ్ఛరిస్తారు. వివాహకర్త సన్నిహితులు, బంధుమిత్రులతో తులసికి నాలుగుసార్లు సాలగ్రామంతో పరిక్రమం చేస్తారు. ప్రతి ఒక్కరూ సత్కుంభసూక్తం, సమానసూక్తం యజ్ఞకుండం ముందర కూర్చుని పారాయణ చేస్తారు. శంఖనాదాదులు చేస్తారు. మంగళాచరణ పూర్తి చేస్తారు. చిట్టచివరకు పూర్ణాహుతి చేస్తారు. తరువాత అభిషేకం చేస్తారు. బ్రహ్మకు ఆచమనం బహుమతిగా ఇస్తారు. ఋషులకు నూతన వస్త్రాలిస్తారు. బ్రాహ్మణులకు దక్షిణ ఇస్తారు. నిత్యపూజలు ఆరంభిస్తారు. అన్ని రకాల దోషాల నిర్మూలించబడతాయి. తులసీ దళాలను తీసుకుని విష్ణుమూర్తికి విముక్తి తీసుకుంటారు. భౌతికధర్మాలు సాగిస్తారు. తులసి వివాహం వివరణాత్మకమైనది. ఎక్కువైన పూజాదికాలు చేసే, వివాహఘట్టం, కార్తీకశుక్లపక్షములో ఈ వివాహం జరుపుతారు. పద్మపురాణం తులసి చుట్టూ తిరుగుతుంది. నెమి అనే రాక్షసుని పుత్రికగా బృంద జన్మిస్తుంది. జలందరుని భార్య. విష్ణుమూర్తి రెండవ అవతారంలో చతుర్దశ సంపదలను సముద్రం నుంచి సాధిస్తాడు. జలంధరుడు దేవతలపై యుద్ధం ప్రకటిస్తాడు. బృందపాతివ్రత్యం చెడిపోతే కాని వీడికి మృత్యువు రాదన్న సంగతి. ఎన్నో దుర్మార్గాలు చేస్తుంటాడు. విష్ణుమూర్తి ఆమె భక్తివిశ్వాసాలకు చలిస్తాడు. ఆమెను తులసిగా మారుస్తాడు. ప్రతి కార్తీక మాసంలో ఆమెకు వివాహం చేసుకుంటానని వాగ్ధానంచేస్తాడు. అందుకని సాలగ్రామాలతో గండకి నదిలో దొరుకు తుంది. హిందూస్త్రీలు, తులసీమాలలను పూజచేస్తారు. అందులో కృష్ణుడుంటా డని వారి భావన సాహిత్యపరంగా తులసి సాలగ్రామాల వివాహం జరుగుతుంటుంది. ప్రతి ఒక్కరు తులసిని తాను పుత్రికగా భావిస్తున్నాను అదే విధంగా కన్యాదానం చేస్తున్నారు. ఈ వివాహ రోజు హిందువులకు సాంవత్సరిక వివాహ దినంగా గుర్తిస్తారు.



## వివాహ ప్రకరణం

కుండకు ఎట్టిటి రంగు వేస్తారు, గాజులు, కుంకుమ, ఎట్టిటి బిందెలుంచుతారు. మంగళసూత్రం పసుపుకొమ్ముతో కడతారు. ఎట్టిటి దండలేస్తారు. సాలగ్రామంలో వివాహంజరుపుతారు. ఇది చాలా సూక్ష్మమైన తంతు.

**కన్యపంపుదానం :** కన్యావరంచెప్పి ఆమెను వరునకు ఇస్తారు. మూడు ఆమెకు తగిన స్థానమిస్తాడు. ఎట్టిటిదారంతో కంకణధారణ చేస్తాడు. ఇది ఒకరికొకరు కడతారు.

**మాలాధారణం :** వధూవరులిద్దరూ మాలలను మార్చుకుంటారు. వీరి మాలలను మూడుసార్లు మార్చుకుంటారు. తులసి మొదట తన భర్తకు దండవేస్తుంది. ఇది స్వయం వరమాల.

**సింధూరధారణం :** వధువును వరుడు సింధూరం పాపటను పెడతారు. దానితో ఆమె అతని సొంతమవుతుంది.

**సింధూరైక ప్రత్యనేసుఘానసో వేటప్రమియం పతయన్తి బాహ్వః గార్వ స్వధారా అరుసోనః వాజి కష్టభిందక ఊర్మిభిః పిన్వామనః**

**మంగళసూత్రధారణం :** దీనినే తాళి అంటారు.

పవిత్రసూత్రం మంగళసూత్రం వధువు మెడ చుట్టు కడతాడు. ఇది వివాహ సూచితం. ఇందులో వరునిసోదరి సాయం చేస్తుంది. **"మంగళ్యం తంతునానేన భర్తృజీవహేతునా కంఠేబద్నాని సుభగే సా జీవశారదాశతం".**

**వస్త్రబంధనం :** ఇరువురు వస్త్రాల చివర ముడివేస్తాడు బ్రహ్మ. గ్రంధిబంధనం వివాహబంధనాన్ని మరింత దృఢం చేస్తుంది. సాలగ్రామానికి అంగవస్త్రం తులసి ధరించిన వస్త్రపు పై భాగాన్ని ముడివేస్తారు. నాటినుండి అది ఏడు రాత్రులుంటుంది. దీనిపై జలప్రోక్షణ సామాన్య అర్ఘ్యం.

**లాజహోమం :** లాజలను భర్త చిరకాల జీవనానికి హోమం చేస్తారు. కుటుంబ సభ్యుల సంక్షేమానికి ఈ లాజహోమం చేస్తారు.

**ఓం ఇదం ఆస్మానం అరోహ**

అస్మైపిత్వం స్థిరభావ × ద్విశాంతం అపవర్ధస్య × మాచత్వం ద్విశాతరం అధః నేను శిలనెక్కి శిలమాదిరి ఎక్కువకాలం భక్తితో పాదాలను పూజిస్తారు. నీవునాటి అభావానికి లోనుకావద్దు.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





**సప్త పరిగ్రహణం :** వివాహంలో సప్తపది ఏడు రకాల త్యాగాలకు ప్రతీకలు. ఇది వధూవరుల జీవనయానంలో కలిసి నడిచే నడక కలిసి నడిచే నడకేకాని విడివిడిగాకాదు. ప్రతిదానికి ఒక ఆశీర్వచనముంది.

1. **ఓం ఏవం ఇసే విష్ణుః త్వనయతు మహా విష్ణువు బలాన్ని ఇచ్చుగాక**
2. **ఓం ద్వే ఉర్జే విష్ణుః ధ్గయయతుమహా విష్ణువశక్తినిప్రసాదించునుగాక**
3. **ఓం త్రిణివ్రతయ విష్ణుః త్వనయతు మహావిష్ణువు వాగ్దానాలుతీర్చుగాక**
4. **ఓం చత్వాణి మమోభావయు విష్ణుత్వనయుత మహావిష్ణువు సంతోషాన్ని ప్రసాదించుగాక**
5. **ఓంపంచపశుభ్యో విష్ణు త్వనయత్ ఓమహావిష్ణు పశువులను ప్రసాదించుగాక**
6. **ఓంషడ్రకుస్ పోషయవిష్ణు త్వనయతు ఓవిష్ణుమూర్తి ఆధ్యాత్మిక సంపద పెంచు**
7. **ఓం సప్త సప్రభోయహో ప్రభ్య విష్ణు త్వనయతు**



**ఓ మహా విష్ణూ :** ఈ ఏడు యజ్ఞాలను పూర్తిచేసే శక్తి ప్రసాదించు.

**పాణిగ్రహణం :** వివాహబంధం దృఢపరచడంకోసం చేతులు కట్టుకోవడం వారు చేతులు కట్టుకున్నప్పుడు ఈ క్రింది మంత్రాన్ని చదవాలి. మంచి అదృష్టంకోసం నేను చెయ్యి పట్టుకున్నాను. ఇది వార్థక్యం వరకు ఇట్లాగే ఉంటుంది. గృహకృత్యాల కోసం ఆరుగురు కుమారులను ఇస్తాను. నీ భర్తను రక్షించుకోవడం కోసం శూలిను జాగ్రత్తగా చూడవలసింది. నాయకులకు తల్లిగా ఉండు. కృష్ణునకు ప్రేమపాత్రురాలిగా ఉండు. సంతోషాన్ని అందరికి సంపాదించిపెట్టు. అందరిలో దేవుని దర్శించు.



కృష్ణుడు మీ ఇద్దరిని సదా కాపాడుతుంటాడు. ఇది మనిద్దరకు మంచిది. విష్ణుమూర్తి మీకు సమర్ధవంతులైన పుత్రులను ప్రసాదిస్తాడు. మామకు పాలకురాలిగా ఉండు. భర్తృగృహాన్ని స్వర్గధామం చెయ్యి. ఆడపడుచులను, మరుదులను ఆచరించు. జీవిత పరమార్థాన్ని నిర్ణీత లక్ష్యంగా నిర్ణయించుకో. భర్తను సదా తలుచుకుంటూ ఉండు మామ విష్ణుమూర్తి కొలుస్తాడు.

**ఓం అస్మిన్ వివాహ కర్మాణి**
**అంగహీనం క్రియాహీనం విధిహీనంచ యద్భవేత్**
**అస్తుతత్ సర్వాచ్చిద్రం కృష్ణ కృష్ణ ప్రసాదతః**
**యత్కించిత్ కై గుణ్యంజటః**
**తాద్ దోషప్ర సమానయ శ్రీ విష్ణు స్మరణం కరోమ**

వివాహ ప్రకరణంలోని లోటుపాట్లు కృష్ణ అనుగ్రహం వల్ల అంతం చెందు తాయి.



**శంఖ సాలగ్రామము**

## సాలగ్రామ కథ

సాలగ్రామాలు భారతదేశంలో ఎంతో పవిత్రంగాను, పూజార్హమైనవిగాను గుర్తించారు. భారతీయుల వీటిని ఎన్నో యుగాలుగా పూజ చేస్తున్నారు. దేశం మొత్తం మీద మఠాలలోను, పీఠాలలోను, గుడులలోను, చిట్ట చివరకు ఇళ్ళలోను వీటిని పూజ చేస్తున్నారు. వీటిని విష్ణుమూర్తికి ప్రతిరూపాలుగా భారతీయులు భావిస్తారు. సాలగ్రామ అభిషేక జలాన్ని ఆచారవంతులైన భారతీయకుటుంబీకులు స్వీకరిస్తారు. ఈ సాలగ్రామాలను నిత్యము, పర్వదినాలలోను పూజ చేస్తారు. సాలగ్రామాన్ని అన్ని వర్గాలవారు పూజిస్తారు.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





హిమాలయాలలోని బదరీనాథ్‌లోని విష్ణుమూర్తి సాలగ్రామ నిర్మితమని ప్రతీతి. అదే విధంగా **కర్ణాటకలోని ఉడిపిలో శ్రీకృష్ణ విగ్రహం, పూరీలోని జగన్నాథ విగ్రహం సాలగ్రామ విగ్రహాలతో నిర్మితమైనవి. పూరి జగన్నాథంలో విగ్రహ మార్పు సమయాలలో సాలగ్రామమూర్తిని ప్రతిష్టిస్తారు.** శివుని లింగ మూర్తిగా పూజించినట్లు విష్ణుమూర్తిని సాలగ్రామ మూర్తిగా పూజచేస్తారు. లింగమూర్తి స్ఫటికాన్నతి. ఇది నర్మదానదిలో దొరుకుతుంది. లేకపోతే మానవనిర్మిత మవుతుంది. లింగస్వయంభ్యక్తమైనట్లైతే స్వయంభువుగా దానినే మానవుడు నిర్మిస్తే అది మానుషమవుతుంది. ఇదేకాక మట్టిలోను (మృణ్మయి), గోయమం, పుష్ప, షష్టపూలతోను పూజా సమయంలో పూర్తయిన తరువాత దానిని తీసివేస్తారు. శిలాలింగదేవాలయాలలో ఉంటుంది, **స్ఫటికలింగం ఇళ్ళలో పూజచేస్తారు. సాధారణ సాలగ్రామాలు గండకి నదిలోనే దొరుకుతాయి. వాటిని మనుష్యులు తయారు చెయ్యరు. విష్ణుమూర్తి వివిధ రూపాలను మానవులు తయారుచేస్తారు.**

క్రీ.పూ. 2వ శతాబ్ధపు శాసనంలో వాసుదేవుడు కంసదర్పుణుడనీ ఇద్దరుదేవతలు సాలగ్రామాలలో మూర్ దగ్గరలోని గోషునగరిలో ఉన్నాట్లు రాజస్థాన్ ఎపిగ్రఫీ ఇంకా 22వాల్యూమ్ 204 పేజీలో తెలియజెబుతున్నాయి. నారాయణవాటికలోని శిలానిర్మిత కుడ్యాన్ని పరాశరగోత్రజులైన గజయాకరాజు సత్యతాత నిర్మించినట్లు తెలుస్తున్నది.

కీ.శ. 404 సంవత్సరం గుప్తమాన్యుడు నరవర్మ మూడశర్ శిలాశాసనం సాలగ్రామ విష్ణుమూర్తి నిర్మితమైనదని తెలియచెబుతున్నది. క్రీ.పూ. మొదటి శతాబ్ధంలోని మధ్యప్రదేశ్ బిలాస్‌పూర్‌లో భర్తికర్‌లో విష్ణువు చతుర్భుజ భగవాన్‌గా విష్ణుమూర్తి పూజలందుకున్నాడు. సాధారణంగా విష్ణుమూర్తి అర్చారూపంలో పూజింపబడుతున్నాడు. అదేకాలంనాటి మొరశాసనంలోన ఇవి ఎపిగ్రాఫి ఇండికా వాల్యూమ్ 23,124 ) వీధులలో పూజార్హులైన సయనాలు కృష్ణవంశీకులైన యోధుల విగ్రహాలున్నాయి. వాటి ఫేమ్లాసాలగ్రామం, భగవతంకృష్ణీహం, పంచవాదశం ప్రతిమా.... ఆర్య దేశం,శైలం, పంచజ్వలతైవలు, ఈ ఐదుగురు విష్ణుమూర్తి వ్యవహోమాపాలు, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ సాంబ, అని వారి ప్రతిమ శిలారూపాలు.

క్రీ॥శ॥ 632 నుండి 664 నాటి శంకరులు తన శంకర భాష్యంలో విష్ణువును మించిన దైవంలేదని, అదీ సాలగ్రామ రూపంలో యధా



సాలగ్రాహ హరిః 1,2,7,సాలగ్రామ ఇవ విష్ణుః 1,2,14 యధాసాలగ్రామే విష్ణుః సన్నిహితః తత్వత్ 1,3,14) శిలారూపంలో ఉన్నాయి. సాలగ్రామ శిలలు విగ్రహరూపంలో ఉన్నాయి. సాలగ్రామాలు ఇళ్ళలోను, గుళ్ళలోను పూజలందుకుంటున్నాయి. **విష్ణ్వాలయాలలో విష్ణుమూర్తిల రూపానికి దగ్గరలో ఈ సాలగ్రామం పెడతారు. తిరుమల-తిరుపతిలో మూలవిరాట్‌కు దగ్గరలో ఈ సాలగ్రామాలున్నాయి. పర్వదినాలలో సాలగ్రామాలకు అవబృధ స్నానం చేయిస్తారు.**

పూజావిధానంలో నుదుట విభూతిధారణ ప్రధానాంశం. ఇది ఋగ్వేదమంత ప్రాచీనమైనది. (ఇవహిత ఇభుతాయః ఇంద్రం అవతే, 189, రవిద్విభూతి ఇయం వచసా 6,21,1) వాడకాన్ని శక్తి ప్రదాయకంగా వాడతారు. ఇది భగవద్గీతలో పదవ అధ్యాయంలో స్పష్టంగా చెప్పారు. నాయకుడు విభూతికి ప్రత్యేక శక్తులతోను ఐశ్వర్యవిశేషమని ఋగ్వేదం 1,8,9,లోతెలిపారు. ఇది ప్రపంచ వైభవాన్ని తెలియజెప్పారు. విభూతిర్జయాతో విభవహేతుః ఋగ్వేదం 6,21,1లో చెప్పారు. అందులోని స్పష్టమైన అర్ధమేమిటంటే వ్యాప్తి వికాసము గాఢతసమృద్ధిని సూచించింది. ఇందులోనే అంతు తెలియని కారణమేదో ఉంది.

కారణం తెలియని అతీతశక్తికి అనంతరూపాలు విష్ణుమూర్తికి లక్ష్మికి ఏకత్వమేగాని భిన్నత్వమేమీ లేదు. ఇదే విధంగానే శివశక్తులకు కూడా ఉంది. దీనిని నుదుటవిభూతి అంటారు. దైవశక్తి ఉందన్న నిగూఢశక్తి మూర్తిరూపం పూజింపబడుతోంది. పాడికి పెంచు ఆవులలోను, తులసి చెట్టులోను, అశ్వత్థచెట్టులోను, అహితవిభూతి ఉంటుందని వర్ణించారు. సాలగ్రామంలోని దివ్యశక్తి సంస్కృతాగ్నిలో విభూతి సహజవిభూతి.

వేదాంతశాస్త్రం విభూతిసిద్ధాంతాన్ని అంగీకరించింది. బ్రహ్మమొక్కటే విభూతులు మాత్రం ఎక్కువ. అవి భక్తులకు ముక్తిదాతలు. బ్రహ్మంలోని ఏకత్వం, దివ్యత్వంలో అనేకాత్వం ఒక్కటే (వికం అపిబ్రహ్మ విభూతి భేదైరనేకధ ఉపస్యత వేదాంత సూత్రభాష్యం 3,2,23, 2,4,10,3,3.23. 1.44.33.43) విష్ణుమూర్తికి శాశ్వతం, వ్యాపకత్వం, అన్నిచోట్ల వ్యాపించి ఉండడం అన్నది విభూతి ప్రధానలక్షణం. ప్రతి ఒక్కరి నుదుటనున్న విభూతి దైవ శిరసుతో సమానం. ఇది దేవతాప్రతినిధి సూచకం కాదు. ఇది సర్వత్ర వ్యాపించినున్న నిస్సందేహం, ఇది శాశ్వతత్వానికి నిధి.

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





సాలగ్రామాల విభూతి పూజార్హమైనది అర్చామూర్తులు మానవ నిర్మితము, ఇందులో కొన్ని అసౌకర్యాలు కూడా ఉన్నాయి. ఎందుకంటే అవి శిల్పుల మనోభావాలకు ప్రతీకలుగా భాసిల్లుతాయి. శిల్పులు క్రౌర్యం, సరిగాప్రతిష్ఠితం కాని, విరుర్భుద్ధితో కూడుకున్నవిగా ఉంటాయి. దీనితో ఆ విగ్రహముఖాలలో దైవత్వభావన ఉండదు. సాలగ్రామాలకు ప్రాథమిక ప్రతిష్ఠాదికార్యక్రమాలు ఏవీ లేవు. ప్రత్యేకమైన శ్లోకాలుగాని పద్ధతులుగాని లేవు. దీనికి పూర్తిగా సమర్థుడైన పూజారి అక్కరలేదు. దీనిని పూజించుటవల్ల అన్ని లాభాలుకాని ఏ విధమైన తప్పులేదు.

సిద్ధాంతప్రకారం శాస్త్రోక్తంగా పూజచేసినట్లైతే అనేక రకాలైన అనంత మైన విధానాలు లాభాలుంటాయి. విగ్రహానికి ఇంటిలో ఏ విధంగా పూజ చేస్తామో అదేవిధంగా అవసరార్ధం అదే విధంగా మొదలుపెట్టాలి. దీనినే ప్రాణప్రతిష్ఠ అంటారు. దీన్నిద్వారా శక్తివస్తుంది. ప్రాథమిక పూజాదికాలు చేయకపోయినట్లయితే పాదపూజచేసినా ఉపయోగంలేదు. విగ్రహానికి విభూతి అవసరము. ఇది ప్రధానంగా ఇంతకు పూర్వమున్నదానిని విజయ వంతంగా సాగిస్తుంది.

**ఎప్పుడూ విభూతి సాలగ్రామంలో ఉంటుంది. కాబట్టి ఈ మంత్ర తంత్ర జపాదులు అవసరము. దాంట్లో ప్రాణ ప్రతిష్ఠ అర్థంలేనిపని. సమంత్రపూర్వక దేవాలయ అర్చామూర్తి సాలగ్రామం. దీనికి ప్రాణప్రతిష్ఠ అక్కరలేదు.** ఇది స్వయంగా పద్ధతి పూజాదికాలలో నిర్వహించవచ్చు. దేశంలో పంచాయన పూజ ఎంతోప్రచారము పొందినది. 8వ శతాబ్ది నుండి పంచ దేవతల ( విష్ణువు, శివుడు, దుర్గ, సూర్య, గణేశ) ఒకే వేదికపై ఉంటారు. అవి చిహ్నములద్వారా ప్రదర్శితమవుతుంటారు.

ఐదు పవిత్రవస్తువులను ఒక పళ్ళెంలో పెట్టి తులసిదళాలు, బిళ్వదళాలతో ఈ ఐదు వస్తువులకు అర్చన చెయ్యాలి. సాధారణంగా షోడశోపచార పూజ చెయ్యాలి. ప్రతిసారి పురుష సూక్తంలో పూజచెయ్యాలి. శాక్తేయులు పంచపాత్రలతో జలముంచి భక్తులను మేల్కొల్పమని అర్థిస్తారు. కొన్ని గ్రంథాలలో ఈ వరస క్రమం మారుతూ ఉంటుంది.

ఈ పంచోపాసన ప్రపంచమంత పంచమి ప్రాథమిక మూలికల పూజకు చిహ్నం. విష్ణువు- ఆవేశం, శివుడు, భూమి, దేవి ,అగ్ని సూర్యుడు అగ్ని. గణపతి జలానికి చిహ్నాలు. ఇది మానవశరీరంలోను ఉంటాయి.



ఏదో ఒక మన శరీరంలో ప్రధానప్రాత వహిస్తుంటాయి. మధ్యలో ప్రధాన మైన దేవతగుణం ప్రధానంగా ఉంటుంది. ఇది మంత్రయోగ సంహితలో ఉంది.

ఈ ఐదు అర్చా రూపములో ఉన్నాయి. ఇది మంత్ర చిహ్నంకాని విచిత్ర మండలంలో అదే ఆ దేవతామూర్తిని ఒక కలశంలో ప్రవేశపెడతారు. దీనిని బియ్యంపోసి దానిపై ఆ కలశాన్ని పెడతారు. అందులో సాల గ్రామాలు ఐదుదేవతలుగా కూడాఉంటాయి. ఇవి విష్ణుమూర్తికి ప్రతి రూపాలు.

సాలగ్రామశిలలు గండకినదిలో ఉంటాయి. ఇది హిమాలయ పర్వతసానువులలో ఉన్నాయి. నారాయణ సాలగ్రామ హిరణ్యంతి, హిరణ్య వతిగా ప్రాచీనకాలం నుండి ప్రాచుర్యంలో ఉన్నాయి. మహాభారతంలోని భీష్మపర్వం అన్ని పవిత్ర నదీజలాలు అందులోనే ఉంటాయి. (వన పర్వం-సెక్షన్-113) అవి అగ్ని రూపంలో ఉన్నాయి. భీమార్జున కృష్ణులు ఈ నదినిదాటారు. ఇంద్రప్రస్థం నుండి గిరివ్రజానికి వెళ్ళేదారిలో ఈ నది ఉంది. (సభాపర్వం- 20-23) అన్ని పురాణాలు దీనిని పవిత్రాది పవిత్ర ప్రవాహంగాను, అందరు దేవతలకు నిలయంగాను పేర్కొన్నాయి. పుణ్యదక-సురాసుని వేదితా దానిలోకి చూడటానికి అనేక రకాల మానసిక రుగ్మతలు నాశనమవుతాయి. దాన్ని ముట్టుకోగానే పాపాలు పటాపంచలవుతాయి. నీటిని త్రాగగానే అంతర్గత కల్మషాలన్నీ బయటకు విసరివేయబడతాయి.

ఈ పవిత్ర ప్రవాహంతో కలసిమెలసిపోయిన వారు జీవన్ముక్తులవు తారు. మరల జన్మ ఉండదు. ఇందులో దొరికే శిలలు ఎంతో పవిత్రమైన దేవతారూపాలు. సాలగ్రామాలు మొదట శిలారూపమైన గండకినదిలో సాలగ్రామాలుగా రూపాంతం చెందుతాయి. ఈ గుర్తులకు (గండక్యుద్భవ-వజ్రకీటకృత చక్ర సంయుక్త శిల) గుర్తించవచ్చు. **గండకి ఒక భక్తురాలు. ఆమె విష్ణుమూర్తి నుండి ఒక వరం పొందింది. విష్ణుమూర్తిని తన గర్భంలో నివసించమని ప్రార్థించింది. ఈ విధంగా సాలగ్రామాలు విష్ణుమూర్తిగా రూపొందాయి. ఇవి పవిత్రతకు చిహ్నం.**

గండకినది అసాధారణ పవిత్రమైనదని మ్రుత్యాన్నిధ్యంనదిమన్త్వన్ **అతిశ్రేష్ఠ భవిష్యసి. గండకినదిలో స్నానం చేసినా, ముట్టుకున్నా, తాగినా**

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





**అన్ని దోషాలు హరిస్తాయి. గండకీనది దక్షిణ హిమాలయాలలో ఉన్నది. ఇది చక్రతీర్థంగా ప్రసిద్ధి చెందింది.** ఇందులో సాలగ్రామాలుంటాయి. వరాహ పురాణం రేవాఖండంలో ఈ పర్వతాన్ని సాలగ్రామ పర్వతమంటారు. అందు కనే సాలగ్రామ శిల లుద్భవిస్తున్నాయని చెబుతున్నది. ఈ పర్వతానికి దగ్గరలోఉన్న పర్వతాన్ని సోమేశ్వరగిరి అంటారు. ఇక్కడ శివనాభ శిలలను మూర్తులు దొరుకుతాయి.

**అవంతిదేశంలో హరిపర్వతముందని అక్కడ దీనిని చక్రతీర్థమని అంటారని అక్కడే ఈ సాలగ్రామాలు పుడుతున్నాయని పురాణాలు చెబుతున్నాయి.** సాలగ్రామమన్నది గండకినది ఒడ్డున ఉన్న ఒక గ్రామము అక్కడ నుండి ఈ సాలగ్రామాలు ఏరుకొస్తారు. దీనిపేరు సాలంకాయన మహర్షిపేరుతో వచ్చింది. విష్ణుమూర్తి చెట్టుతొర్రలో కూర్చున్నాడని వరాహ పురాణం చెబుతున్నది. ఆ గుడిసెలో అది గండకినది ఒడ్డున ఉందని ఆ ఒక్కచోటే ఈ సాలగ్రామాలు సమృద్ధిగా దొరుకుతాయి. అందుకని వాటిని సాలగ్రామమంటారు.

**సాలమంటే గట్టిచెట్టు ఇది సాధారణంగా నేపాల్‌లో ఉంటుంది. అక్కడ దీనిని సుభవ అంటారు.** ఇవి అక్కడ గుంపులు గుంపులుగా ఉంటాయి. హిమాలయ పాదస్థానాలు ముక్తి స్థానమంటారు. దీని దగ్గరిలో సాలగ్రామాన్ని సాలగ్రామ మంటారు. **కాశి గండకిలో కూడా ఈ సాలగ్రామాలు విస్తారంగా దొరుకుతాయి. గండకి నది హిమాలయాలకంటే ప్రాచీనమైనది. టిబెట్‌లో ఉత్తర దక్షిణ దిక్కుగా ప్రవహించి నేపాల్‌లో ప్రవేశించింది.** హిమాలయాలలోను తరువాత ఇండియాలో ప్రవేశించింది. ఇది గంగానదికి ప్రధానమైన ఉపనది. ఇది సాలగ్రామ, నారాయణి అని ఉత్తరప్రదేశ్‌లో పిలుస్తారు. గ్రీక్‌భౌగోళిక వేత్తలు దీనిని ఖండోనెట్స్ అంటారు. సంవత్సరమంతా ఇందులో నీరు ఉంటుంది. ఎందుకంటే వేసవి కాలం మంచుకరిగి, వర్షాకాలంలో వర్షాలలో నిండి ఉంటుంది. దీని ప్రవాహ గమనం 190 మైళ్ళలో ఎక్కువ భాగం ఉత్తరదేశంలోని బీహార్ ఉత్తరప్రదేశ్ లలో ప్రవహిస్తున్నది. ఇదేనిరంతరం గోలుగొండ శిఖరమంత ఎదిగి భూమిలోకి ఇంకి పోతాయి. తూర్పుకోసి, మధ్యగండకి, పశ్చిమాన కరనాశి, ఇంకా పడమర మహాకాళిఅని పిలుస్తారు. త్రిశూలగంగ ఇది భారతదేశం లోని ప్రధాన ఉపనది. ఈనది పాట్నదగ్గర సోనాపూర్‌లో గంగలో కలుస్తుంది.



కాళిగండకి వద్ద ఒక సరస్సు ఉంది. దానిని దామోదర కుండం అని పిలుస్తారు. ఇది భారతనేపాల్ సరిహద్దులో సాలంకాయన మహర్షితో ముడిపడి ఉంది. దిగువ గండకి ముక్తినాథ్ క్షేత్రం. ఈ పవిత్ర శిలలు ధవళగిరి అన్నపూర్ణ పర్వతాల నడుమ టక్సీ వద్ద ఎక్కువగా దొరుకుతాయి. నేపాల్ రాజులు ప్రతి శివరాత్రికి ఇక్కడకు రావటం ఒక నియమం. వీరు గండకినదిలో సాలగ్రామాలను సేకరిస్తారు.

సాలగ్రామాలు దొరికే ప్రాంతం నేపాల్‌లోనిది. ఇటీవలి కాలం వరకు సాలగ్రామ సేకరణ ప్రైవేటు వ్యక్తులు ఇచ్చారు. తరువాత దీనిపై హక్కునేపాల్‌రాజే అట్టిపెట్టుకున్నారు. ఈ రాళ్ళ అమ్మకాన్ని నేపాల్ నిషేధించింది. **కొన్ని సాలగ్రామాలు అధికధరకు కొంటున్నారు. కొన్ని సందర్భాలలో వీటి ధరలేదు కొన్ని లక్షల నేపాలీ రూపాయిలంత ఎక్కువ ఉంది. వీటి ధర అధికం కావటంతో సాలగ్రామాలను కృతిమంగా తయారుచేయటం ప్రారంభమైంది.** చాలా రాళ్ళు (బైరాగి-విరాగిలు) దిగివచ్చి చక్రి గుర్తులులేని తెల్సి అమ్ముకున్నా. నాటికి కారణాలుండవు. బలపపురాళ్ళ మీద చక్రాలు చెక్కుతున్నారు. దీనిని ఎంతో నేర్పుగా చెక్కుతా రంటే అసలు సాలగ్రామమేది? నిజమైన సాలగ్రామమేదో తెలియదు కూడాను. అదేపని అభిషేకం చేసిన కారణంగా అరిగిపోయి మోసం బయట పడుతుంది.

**సాలగ్రామం నిజమైనదా కాదా అన్నదానికి ఎన్నో పరీక్షలు అవసరం. చేతితో గట్టిగా పట్టుకొని అన్ని పక్కలా మెల్లగా కొట్టాలి. దానితో ఆ రాయి అందులోని మెత్తటి పొడి బయటకు వస్తుంది. దానితో అది మోసస్వభావితమైనదని తెలుస్తుంది. ఇంకా ఇతర పరీక్షలు కూడా ఉన్నాయి. ఒక పళ్ళెంలో సాలగ్రామం ఉంచి దానితో సగమైన బియ్యంగాని, పాలుగాని ఉంచాలి. రాత్రి అంతా అట్లాగే ఉంచాలి. తెల్లవారే సరికి ఆ పాలుగాని, నీళ్ళుగాని, సాలగ్రామం స్వచ్ఛమైనదైతే వాటి బరువు పెరుగుతుంది. మిగిలిన వాటికి వాటి బరువు తరిగి పోతుంది.**

సాలగ్రామాల గురించి కొన్ని నమ్మకాలున్నాయి. **సాలగ్రామాన్ని ఒక శంఖం., తులసీదళాలతో ఒక పళ్ళెంలో ఉంచితే అర్థమైనదిగా గ్రహించవచ్చును.** సాలగ్రామాన్ని పవిత్ర కార్యక్రమాలలకు పూజాదికాలకు ఉపయోగిస్తారు. సాలగ్రామం ముందరే శ్రాద్ధకర్మలు చేస్తారు. దేహం విడిచిన

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....



జీవుడు విష్ణుమూర్తి దగ్గరకు వెడతాడని ప్రతీతి. తరువాత తద్దినాలు అనవసరం. పద్మపురాణం, ఉత్తరకాండపై విధంగా తెలిపింది.

**మృత్యుసన్నిధిలో ఉన్న వ్యక్తికి సాలగ్రామం అభిషేకజలాన్ని పానం చేయించినప్పుడు అతని పాపాలన్నీ పటాపంచలయిపోతాయి.** విష్ణుపథాన్ని చేరుకుంటాడు. విష్ణుసాన్నిధ్యం చేరడానికి సాలగ్రామం ఒక మార్గం పురాణ సంగ్రహం తెలుపుతోంది. అనేకరకాల సాలగ్రామాల్ని అభిషేకం చేసిన ఆ జలాన్ని పానం చేసినట్లయితే అన్ని రకాల పాపాలు పారిపోతాయి. **సాలగ్రామాన్ని దగ్గర పెట్టుకుని గ్రహణ సయమాలలో ఏ అనుష్ఠానం చేసినా ఎంతో శక్తివంతంగా వెలుగొందునని హేమాద్రి తెలిపారు.**

సాలగ్రామాన్ని చేతిలో పెట్టుకుని ప్రమాణం చెయ్యమని **న్యాయస్థానంలో అడిగేవాడు, అబద్ధపుసాక్ష్యం అయితే అతడు శిక్ష పూర్తయ్యే వరకు బాధపడుతూనే ఉంటాడని బ్రహ్మపురాణం చెబుతుంది.** సాలగ్రామాన్ని చేత్తో పుచ్చుకుని వాగ్దానం చేసినట్లయితే దానికి కట్టుబడిఉండాలి . అట్లాకానిచో అతనికి నరకంలో తీవ్రమైన శిక్షలుంటాయి.

సాలగ్రామం శీతకాలపు తప్పుల నుంచి శిక్షిస్తుంది. దానివల్ల మానసిక శాంతి, స్తోత్రం, తపం, పూజ, సాష్టాంగనమస్కారం, చేసినట్లైతే పవిత్రుడౌతాడు. సాలగ్రామాన్ని భక్తితో ఉన్నా లేకపోయినా ప్రార్థించినా అతనికి భౌతిక వాసనలంటవు. సాలగ్రామాన్ని పూజచేసినట్లైతే అతనికి పుట్టుక లేదు మరణములేదు ముప్పొద్దులా సాలగ్రామాన్ని ధరించినట్లైతే చరాచర సృష్టి (ఎందుకంటే అందులో విష్ణువుంటాడు) చరిస్తుంది. సాలగ్రామ బహుమతి ఎంతో విలువైనది, శక్తివంత మైనది. **సాలగ్రామాన్ని తన ముందుంచుకుని ప్రార్థన చేసేవానికి ఎన్నో యజ్ఞాలు చేసిన ఫలితం వస్తుంది. సాలగ్రామాన్ని పూజ చేసినట్లయితే 3మైళ్ళ దూరం ఎంతో పవిత్రంగా ఉంటుంది.** ఎన్నో తప్పులు చేసిన నిందితుడు సాలగ్రామధారి ఐతే అతని తప్పులన్నీ నాశనమవుతాయి.

తులసి, గంధం, గోమతి శిల, గంట, శంఖం, సాలగ్రామం, దీపం, రాగిపాత్ర, విష్ణునామం, సాలగ్రామంలో జలపానం ఎన్నో దోషాలను హరిస్తుంది. ఇది విజ్ఞుల వచనం. సాలగ్రామాన్ని పూజ చేస్తే మనస్సు నిర్మాల్యమవుతుంది. అహంకారం అణగిపోతుంది. లైంగిక వ్యసనాలు నాశనమవుతాయి. కాని నిర్మలంగా పూజ చెయ్యాలి. **సాలగ్రామ పూజకు గురువు అక్కరలేదు. మంత్రం, జపం, భావనస్తుతి, ఉపచారాలు అవసరం లేదు.**



**సరిసంఖ్యగల సాలగ్రామాలను పూజించాలి. రెండింటిని పూజించాలి. బేసి సంఖ్యను పూజించరాదు. ఒక్కటి మాత్రం సర్వశ్రేష్ఠం 12 సాలగ్రామాలను పూజ చేసినట్లయితే అతని సుగుణాలు పెరుగుతాయి.** దోషాలు హరిస్తాయి. సాలగ్రామాన్ని కొనకూడదు. అమ్మకూడదు. దానిని గురువుగారు శిష్యునికి బహుమతిగా ఇవ్వవలెను.

వ్యాపారదృష్టిదోషభూయిష్టం. (పద్మపురాణం- పాటలంఖండం-11). గురువుగారుగాని, శ్రేయోభిలాషిగాని బహుమతిగా ఇవ్వాలి. అది నీకు శాంతి ఇవ్వాలి. దానిని తీసుకుని రెండు చేతులు మూసివేయాలి. అప్పుడే దానిని అంగీకరించినట్లుగుర్తు. దారువులో గుప్తంగా ఉన్న అగ్నిని మండించి నప్పుడు సాలగ్రామాలశిలలు విష్ణువు వున్న కారణంగా అవి వ్యాప్తి చెందు తాయి. అప్పుడే అవి సనాజార్ఞమవుతాయి. సాలగ్రామాలు పగిలిపోయినా పూజార్హమ్ములే, పగిలినా, చిట్లినా వాటి పవిత్రం చెడదు.

MOHANPUBLICATIONS.COM

సాలగ్రామాలు ఏవిధంగా హాని కలిగించినా, నాశనమైనా పూజార్హ ములు కావు, ఎప్పుడూ అవి పవిత్రము కాక విలువైనదికాదో ఏదీ కూడా దాని పూజకు భయంపెట్టవు. **సాలగ్రామం అదృష్టాన్ని తీసుకురాదో సాలగ్రామాన్ని బలవంతం గానో మోసంగానో పూజచేసినట్లైతే అది వ్యర్థము. సాలగ్రామాన్ని తెల్లటి రంగురాళ్ళలో కలిపి పూజ చేసినట్లైతే (ద్వారకావీతి శిలలో కావు) శ్రీకృష్ణ సాంగత్యంతో పరమపవిత్రమవుతాయి.** ఈరాళ్ళలో ఎన్నో చక్రాలు, ఇంకా ఇతర గుర్తులుంటాయి.

శ్రీకృష్ణుడు ద్వారకను నిర్మించాడు. ఎందుకనగా జరాసంధుని బారి నుండి తప్పించుకొనుటకు. ద్వారక ద్వారావతి నది ఒడ్డున నిర్మించారు. ఈ రెండు సముద్రంలో మునిగిపోయాయి. సాలగ్రామాలతోపాటు ఈ శిలలను పూజించటం ప్రత్యేకమైన అర్థస్థానమున్నది. **ద్వారకాశిలలు శ్వేతవర్ణానికి ఇవి శివరూపాలు (శివ కరఃచిత్స్వరూపం నిరంజనం) గండకిలోని కృష్ణశిలలు విష్ణుమూర్తిని సూచిస్తాయి. శివకేశవుల పూజ అనేక దోషాల నిర్మూలనకు కారణం.**

కలియుగంలో 10వేల సంవత్సరాల తరువాత సాలగ్రామాల ప్రాచుర్యం భారతదేశంలో కోల్పోతుంది. ఇది బ్రహ్మవైవర్తపురాణంలో ప్రకృతి కొండ లలోస్పష్టపరచబడింది. విష్ణుమూర్తి ఈ శిలలను అంటిపెట్టుకుని ఉన్నప్పుడు అందరు దేవతలు అందులో ఉంటారు. చతుర్దశాదేవులు ఉంటారు. **సాలగ్రామాన్ని ఒక్కసారైన పూజ చేసిన వారికి వారి పాపాలను నాశనం**

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





చేస్తానని విష్ణుమూర్తే చెప్పాడు. (పద్మపురాణం, ఉత్తరకాండ-127). సాల గ్రామం ఉన్న ప్రాంతం నుండి ఎన్నో మైళ్ళదూరం పవిత్రంగా ఉంటుంది.

**పాలు, పెరుగు,నెయ్యిలతో సాలగ్రామాన్ని పూజచేసినట్లైతే అనేక సంవత్సరాలు ఆ పూజచేసినవారు స్వర్గంలో ఉంటారు. సాలగ్రామం గురించి స్కాందపురాణం, కార్తికమాస మాహాత్మ్యం గురించి పరమేశ్వరుడు స్కందునికిముల్లోకాలలో సాలగ్రామంలో ఉంటాయని పూజించకుండానే చూసినంతనే అవి ఎంతో శక్తివంతమైనవి చెప్పారు.** సాలగ్రామాన్ని గురించి అన్ని గ్రంథాలుసాలగ్రామం మనిషి మంచిచెడుల చెబుతాయి. సాల గ్రామాన్ని పూజ చెయ్యటం ఎంతో పుణ్యమని అదృష్టమని చెబుతున్నాయి. సాలగ్రామాన్ని అభిషేకం చేసినట్లైతే ఆస్తికజనులు తన భోజనానికి ముందు స్నానం చేస్తారు.

**సాలగ్రామం ఒక రకమైన అమ్మోనైట్‌గా భౌగోళిక శాస్త్రవేత్తలంటారు. అమ్మోనిట్స్, సముద్రప్రాంతంలోని సూక్ష్మజీవులు, అవి రాళ్ళమీద గుర్తులుగా ఉంచుతాయి.** సాలగ్రామంలో సముద్ర జంతువుల అవశేషాలని పురాణాలలో చెబుతున్నాయి. అవి వ్రజకీటమని అవి జలాలలోనే ఉంటాయని తెలుపు తున్నాయి. ఇవే చక్రాలు తదితర చిహ్నాలు ఏర్పరుస్తాయి.

పురాణాలు సృష్టిలో లక్షల జీవరాశులున్నాయి. అందులో అమ్మోనైట్ ఒకటని చెబుతున్నాయి. అందులోకొన్ని భూగర్భంలో ఉంటాయి. అగ్ని పర్వత అవశేషాలు అంతర్గతంగా ఉంటాయి. (వాటిని అగ్ని సాలిలంటారు) కొన్ని ఉత్తర దక్షిణ ధృవాలలో ఉంటాయి. (అవి హిమసారిలు) జలసాలిలో సాగరజలాల్లో భాగా లోతు ప్రాంతలలోను పర్వతసానువులలోను ఉంటాయి.

సాలగ్రామాలకు దివ్యశక్తులున్నాయి. అదే విష్ణువిభూతి. అమ్మోనైట్ సాలగ్రామాలు మామూలు సాలగ్రామాలంత విలువైనవి. దేవాలయంలో అర్చామూర్తులు శిలామూర్తులు వాటిని శిలలుగా భక్తులు గుర్తించరు. శిల్పుల శిలావిన్యాసం, ఆగమజ్ఞుల ఆగమశక్తి ఆ శిలలకు అధిదైవికశక్తి యంత ప్రదానమైనది. సాలగ్రామం శిలకాదు. అది పవిత్ర శిలగ్రామానికి అపరిమితమైన శక్తి ఉందని విష్ణుపురాణం చెబుతోంది. ఇది మిగిలిన విభూతులకు తెలుపుతుంది. వీటి (అర్చా రూపం) సాధారణ (అన్ని కాలాలకు సంబంధించి) విశేష (అసాధర ణమైన), సజాతీయ( ఒకే జాతికి చెందిన)



అహిత ( ఋషుల దైవరూపం) సహజ్ఞ (సాధారణ) విజాతీయ (తన జాతీయంకాని) సాలగ్రామశక్తి అఖండమైనది **ప్రమేయరత్నాకరంలో 5535 సాలగ్రామ రూపాలున్నాయని 513 విష్ణు అర్చా మూర్తులని అంటున్నాయి.**

**అతోధిష్ఠాన వర్గేషు సూర్యాది శ్శివ మూర్తిషు**
**సాలగ్రామ శిలైవ స్యాద్ అధిష్ఠానోత్తమమ్ హరేః**

**దైవమున్నచోట్ల ఉంటున్నారు పూజింపబడుతున్నారు. కాని అన్నిటిలో సాలగ్రామం ఉత్తమమైనది.**

**సాలగ్రామ శిలారూపి యత్రతిష్ఠతి కేశవః**
**తత్రదేవసురయక్ష భువనాని చతుర్దశ**

కేశవుడు సాలగ్రామ రూపంలో దేవాసురేంద్ర యక్షి అన్నిలోకాల వారితో కలిసి ఉంటాడు. (పద్మపురాణం) ద్వారక శిలతో సాలగ్రామాన్ని పూజించాలి. ద్వారకశిల తెల్లగా ఉంటుంది. చతురస్రంగాను, గుండ్రంగాను ఉంటుంది. పగలకుండాను, చక్రాలతో నిండి ఉంటుంది.

**ద్విచక్ర ద్వారకాయూన్‌తు సాలగ్రామ శిలాద్వయం**
**ఏతేశం అర్చనాన్నిత్యం ఉద్వేగం ప్రపుణ్యాద్గృహి**

రెండు ద్వారక శిలలుగాని రెండు సాలగ్రామాలుగాని ఒకేసారి పూజిస్తే మానసిక శాంతి ఉండదు. ఎవరి దగ్గరనైనా రెండు సాలగ్రామా లుంటే వాటిని విడివిడిగా పూజించాలి. ఇంకా ఎక్కువ (మంత్రతంత్రం ప్రకాశ్) అన్నిటిని కలిపి పూజించాలి. దోషభూయిష్టమైన సాలగ్రామాన్ని కొనటం, అమ్మటం తప్పు.

**సాలగ్రామ శిలాయం యోమూల్యం ఉద్ఘాతేయం నరః**
**విక్రేతచనుమంత చయః పరీక్షం ఉదిరియేత్**
**సర్వేతేనరకం యన్తి యావదే ఆహూ త సంప్లవమ్**

**సాలగ్రామాన్ని అమ్మినా, ఖరీదుకొట్టినా, అందలి గుణదోషాలను పరీక్షించినా, అతడు నరకానికి పోతాడు.** విష్ణుధర్మోత్తరపురాణం సాలగ్రామానికి పూజ చేయకుండా భుజించినట్లైతే అతడు ఛండాలుడుగా మిగిలిన కాలమంతా జీవిస్తాడు. **శూద్రులు, స్త్రీలకు సాలగ్రామ పూజనిషేధించినా, భక్తులు దానిని పూజ చెయ్యవచ్చును. వైష్ణవుడు బ్రహ్మ క్షత్రియవైశ్యలలో శూద్రుడు స్త్రీలు ఎవరైనా సాలగ్రామాన్ని పూజించి దైవ సన్నిధి చేరవచ్చు.** సాలగ్రామంలో విష్ణుమూర్తి చిహ్నాలు చూడవచ్చు. దేవాలయాలలోని సాలగ్రామాన్ని విడిగా పూజచేస్తారు లేకపోతే వాటితో కలిపి పూజచెయ్యవచ్చు.

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





సాలగ్రామం విష్ణుమూర్తి పలుపేరులలో ఒకటి. ఇది నేపాల్‌లో మారుమూల గ్రామంలో గండకి నదిలో సాలగ్రామం విష్ణుమూర్తిగా ప్రసిద్ధుడు. వీటిలో స్వాభావిక చిహ్నలున్నాయి. దైవాన్ని పూజ చేస్తుంటారు. సాలగ్రామ క్షేత్రం దైవక్షేత్రం ఇది ఖాట్మాండుకు 140 కిలోమీటర్ల దూరంలో ఉంది. 19 రకముల సాలగ్రామా లున్నాయని పురాణాలు చెబుతున్నాయి. అన్నిటికి వేరు వేరు గుర్తులుంటాయి. (మహాభారత వనపర్వం 6వ అధ్యాయం 123-125) ఇవి గోళీ ఆకారములో నున్నగా, ఎఱ్ఱగాను, నల్లగా రంగుల మిశ్రమంలో పెట్టెలో పెట్టిన పవిత్రంగా ఉంచిన వస్తువులను వైష్ణవులు పూజా సమయాలలోనే బయటకు తీస్తారు. ఇవి వంశపారంపర్యంగా అనేక తరాల నుండి వస్తుంటాయి. కొన్ని సందర్భాలలో పెళ్ళి కూతురికి సాలగ్రామం బహుమతిగా ఇస్తారు., సాలగ్రామాల మీద రకరకాల గుర్తుంటాయి. వీటివల్ల వాటిని రకరకాలుగా భావిస్తారు.

**నామవర్ణమయం చేవ నానాశోభేన వేష్ఠితమ్**
**తథావార ప్రసార లక్ష్మి కాంతంవ శ్యామహమ్**

అనేక రంగులలో స్పర్శ చిహ్నమున్నదని లక్ష్మీకాన్తమంటారు. ఇది దగ్గరుంటే ధాన్య సంపదలుంటాయి.

**త్రేనే శిలాతతే యత్ర సూక్ష్మం చక్రం సుర్వశ్యతే**
**సౌభాగ్యం శంతతిమ్ దత్తే సర్వసౌఖ్యమే దదాతిచ**

సాలగ్రామం నల్లగా ఉండి దానిలోపల చక్కటి ప్రతిరూపాలుంటే అది ఎంతో సుఖశాంతుల్ని ప్రసాదిస్తుంది. దోషాలుపోయి ధన,ధాన్యం ప్రసాదిస్తుంది. అందులో కృష్ణ చిహ్నముంటుంది. ఎడమ పక్క ఆకుపచ్చ రంగు ఉంటుంది,. దాని వల్ల దోషాలు పోతాయి. **కూర్మంగాని,కాలిగిట్టగాని, ఆవు గుర్తుగాని ఉన్నట్లైతే దానిని వారాహమంటారు. పసుపుపచ్చ దేవతలను సూచిస్తాయి. ఎఱుపు ఉగ్రరూపాన్ని అంటే నరసింహుని చిహ్నం. ఇది మోక్షాన్ని ప్రసాదిస్తుంది. సాలగ్రామం లోపల శంఖరూపు ఉన్నట్లైతే దానిని వమమంటారు. పెద్దసాలగ్రామాన్ని దామోదర మంటారు. సర్పాకృతిలో ఉంటే వామదేవమంటారు.** వీటన్నిటికి వేరు వేరు ఫలితాలుంటాయి.

**గొడుగుమాదిరిగా ఉంటే ఎంతో శక్తివంతుని చేస్తుంది.**
**వృత్తాకారముంటే సంపదనిస్తుంది.**
**బల్లపరుపుగా ఉంటే విషాదం కల్గిస్తుంది.**
**సూదిగా ఉంటే వినాశాలను సృష్టిస్తుంది.**



ప్రస్తుతకాలంలో సాలగ్రామం ఎప్పుడూ అపవిత్రంగాదు. సాలగ్రామా నికి పూజ అక్కరలేదు. మంత్రమక్కరలేదు. పవిత్రజలం అక్కరలేదు. సాలగ్రామాన్ని పురుష సూక్తంతో పూజచేస్తారు. పూర్వీకుల తద్దినాలలో తులసి దళాలతో సాల గ్రామాన్ని కూడా పెడతారు.

**బ్రహ్మ హత్య అధికం పాపం మనోవాక్కాయ సంభవం**
**శీఘ్రం నశ్యతి తత్సర్వం సాలగ్రామ శిలార్చణత్**

బ్రహ్మహత్యాది అన్ని రకాల దోషాలు మనసావాచా కర్మణాచేసినవి అన్ని సాలగ్రామ పూజ వల్ల నాశనమవుతాయి. సాలగ్రామం గురించి పద్మపురాణంలో శంకరుడు ఈ విధంగా చెప్పాడు.

**మల్లింగకోటిభిదృష్టి యత్ఫలం పూజతి**
**సాలగ్రామశిలాయంతు ఏ కస్యం ఇవ తద్భవేత్**

అనేక లింగాలను పూజచేసిన దానిలో ఒక సాలగ్రామ పూజ సమానం.

MOHANPUBLICATIONS.COM

## సాలగ్రామ మహిమ

**అజన్మకృత పాపానాం ప్రాయశ్చిత్తం య ఇచ్ఛతి**
**సాలగ్రామ శిలావహి పాపహారినమస్తుతే!**

సాలగ్రామాన్ని అభిషేకించిన జలమా నీకిదే నమస్కరం. నీవు అన్ని రకాల దోషాలకు హరించును. **ఆచారవంతులలైన హిందువుల ఇంట సాలగ్రామాలు అనేక రకాలు రంగులున్నవి వుంటాయి. వాటిని పూజలో ఉంచుతారు. అవి ఆవంశానికి తరతరాన వస్తాయి. వాటికి అమ్మరు, కొనరు. కొన్ని చోట్ల వధువు తోపాటు సాలగ్రామాన్ని ఇస్తారు.** సాలగ్రామశిల విష్ణు చిహ్నం. దాని మంత్రద్రష్ట శ్రీ భగవాన్ ఋషి, నారాయణదేవత. సాలగ్రామం వింతైన శిల అది నేపాల్‌లోని గండకి నదిలో దొరుకుతుంది.

**"గండవ్యాంచ ఉత్తరే తీరే గిరిరాజస్య దక్షిణే**
**రశయోజనవిశేషస్తీర్ణం మోక్షక్షేత్ర వసుంధరా!**
**సాలగ్రామ మహాదేవ దేవీద్వాదశావతి భవేద్**
**ఉభమోస్సంశమో యాత్ర మూర్తి స్త్రతనమోస్సుయా॥**

గండకినది ఉత్తరతీరంలో అని కూడా అంటారు. హిమాలయాలలో దక్షిణాన ఉంది గండకి నది. ఇందులో సాలగ్రామాలు దొరుకుతాయి. పరియోజనాల విస్తీర్ణంలో ద్వారావతిలో కలిసి మోక్షాన్నిస్తాయి.

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





స్వస్తిక్ రూపులతో సాలగ్రామములు

MOHANPUBLICATIONS.COM

## సాలగ్రామ పూర్వగాథ :

వాస్తవానికి ఖాట్మాండుకు 140కిలోమీటర్ల దూరంలో ముక్తిమతి క్షేత్రముంది. అదే సాలగ్రామ క్షేత్రం. సాలగ్రామాలు కొన్ని వాటి గుడ్డు ఆకారంలో లింగరూపంలో ఉంటాయి. వాటిలోపల సహజ సిద్ధ గుర్తులుంటాయి. అవి శంఖం, చక్రం, ఇతర గుర్తులుంటాయి. ఒకసారి బ్రహ్మ తన సృష్టిలో అధికులు దుష్టులున్నారని గ్రహించాడు. అప్పుడతని చెక్కిలిమీద నుండి కన్నీరు వచ్చింది. ఆ నీరే గండకినదైంది. గండకినది స్త్రీ శిశువుగా మారింది. శిరస్సులు క్రూరశిక్షగా మార్చుకుని నరుక్కుంది. దేవతలు ఆమె ముందు వణికిపోయారు. ఆ శిక్షను తగ్గించుకొమ్మని ప్రార్థించారు. వారు ఆమె రౌద్రాన్ని ప్రత్యక్షంగా వారు చూశారు. ఆమె దేవతలందరకు మాతృమూర్తి కావాలని కోరుకుంది. దేవతలు తమ శక్తి తనకి తెలిపారు. గండకి కోసం వచ్చి అందరను భూమిపై కీటకాలుగా జన్మించమని శాపమిచ్చింది. దేవతలు ప్రతిశాపమిచ్చారు. ఏమిటంటే కుజడ రూపసి కమ్మన్నదే ఆ శాపం. బ్రహ్మను ఈ శాపాల విచారంలో ఉంటాయి. పరిష్కారం కనుపించక ఇంద్ర రుద్రుల వద్ద వెళ్ళారు. పరిష్కారం దొరకలేదు. ముగ్గురు విష్ణుమూర్తి వద్దకు వెళ్ళారు. శాప ప్రతిశాపాలైనాయి. కనుక తిరిగి తీసుకునే ప్రసక్తిలేదు. వాటి ననుభవించి తీరవలసిందే. ప్రపంచక్షేమానికి వారిరువురు కృషి చేస్తారు. అప్పుడు విష్ణుమూర్తి నేను ముక్తి క్షేత్రంలో ఉంటాను. అంటే సాలగ్రామక్షేత్రం (చక్రతీర్థం). దేవతలు వజ్రకీటకాలుగా నన్ను తొలుస్తాయి. ఈ విధంగా సాలగ్రామాలు పుట్టుకువచ్చాయి. ఇంకా మరిన్ని కథలున్నాయి.

సాలగ్రామశిలలు బదరీనాథ్, ఇంకా అనేక ప్రసిద్ధ దేవాలయాలోను ఉన్నాయి. ఆదిశంకరాచార్యులు, బదరీలో సాలగ్రామశిలను బహుమతిగా ఇచ్చాడు. సాలగ్రామ శిలల దండధరిస్తారు. **సాలగ్రామానికి విస్తారమైనపూజ యేమీ లేదు. మంత్రమక్కరలేదు. జలమంతకంటే అవసరం లేదు. దాని సాన్నిధ్యమే సుఖ సంతోషాలు ఆనందాన్నిస్తాయి.** సాధారణంగా సాలగ్రామాన్ని కొన్ని పురుష సూక్తంలో పూజచేస్తారు. శ్రాద్ధాదులందు దీనిని ఉపయోగించిన పూర్వీకులు సంతోషిస్తారు.

**బ్రహ్మహత్యాదివం పాపమ్ మనోవాక్కాయ సంభవమ్**

**శీఘ్రునశ్యతి తాత్పర్యమ్ సాలగ్రామ శైలార్చణత్"**

బ్రహ్మ హత్య మొదలైన దోషాలన్నీ సాలగ్రామాన్ని పూజించినంతనే నాశనమవుతాయి. **సాలగ్రామ అభిషేకం చేసి తులసితో దాన్ని అర్చించి ఆ జలాన్ని ఎవరుతలపై చల్లుకుంటారో వారు విష్ణు ప్రసాదం స్వీకరించవచ్చును. ఈ జలం అన్ని దోషాలను హరిస్తుంది. వైకుంఠంలో ఎంతకాలం కావాలంటే అంతకాలం ఉండవచ్చును. జన్మలులేవు.** పద్మపురాణంలో శంకరుడు సాలగ్రామ ప్రాశస్త్యాన్ని తన పుత్రుడు స్కందునుకి ఈ విధంగా చెప్పాడు.

**'నవసామి సరా శంభో సాలగ్రామోద్భవోస్మిణి'**

ఓశివా! నేను ఎప్పుడూ సాలగ్రామంలో నివశిస్తుంటాను.

గండకినదిలోని సాలగ్రామశిలలను మాత్రమే పూజిస్తాము. పురాణాలలో వీటి ప్రసక్తి ఉంది. అక్కడే ఈ సాలగ్రామశిలలు దొరుకుతాయి. ఒకప్పుడు ఇది సాలవృక్షాలతో కూడుకున్న గ్రామం. సాలగ్రామం అన్న పదాన్ని ఎన్నో రకాలుగా పలుకుతారు. సాలిగ్రామ, సాలగ్రామ అని పలుకుతారుగాని ఆయన సాలగ్రామ అన్నది సరైనపదం.

**సాల అంటే హిమాలయవృక్షం. అదిప్పుడు సాల,సామ, సుఖా అన్న పేర్లతో పిలవబడుచున్నాం. సాల అన్నదానికి మూలం "సాలగతౌ" అంటే కదులు, సాలాలు సిద్ధిస్తాయి. సాలవృక్షం గాలికి కదులుతుంది.**

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....



అందువల్ల దీనిని పై విధంగా చెప్పారు. సాలో హాలే అంటే నృపమత్స్యప్రభోధ సజ్జేపాదపే అని విశ్వనిఘంటువు చెప్పింది. ప్రాచీన మాధ్యమిక యుగాలలో భారతీయ ఔషధవృక్షాలలో సాలాదివర్గం అని ఒక ప్రత్యేక అధ్యాయం ఉంది. ఇందులో సాలేవృక్షం కూడా ఉంది. భీమసేన కర్పూరవృక్షమన్నది ఒకటి. సాలవృక్షాని సర్జ అని కూడా అంటారు.

సాలవృక్షాలు హిమాలయ పర్వతాల కింద పెరుగుతాయి. అస్సాం లోని కాంగ్రాలములో కూడా ఇవి వున్నాయి. పానానాద సూత్ర అన్న తాంత్రిక గ్రంథంలో దీని గురించి ఖచ్చితమైన ఆకృతిని తెలుపబడింది. సాలి అనేది ఏకవచనం సాలయః అన్నది బహువచనం. ఈ గ్రంథం ప్రకారం **సాల అంటే దేవతలు, గురువులు గ్రామ అంటే సమూహమని అర్థం. సాలగ్రామం అంటే దేవతలందరూ ఒకచోట ఉన్నారని అర్థం.** సాలగ్రామం అంటే దివ్యత్వపు అణుసమూహము. సాలగ్రాముమ అన్నది ఉత్తర భారతదేశంలో ఎక్కువగా వాడతారు. దానిని దక్షిణాదిన సాలిగ్రామం అంటారు. కాని పురాణ పద్ధతి ప్రకారం సాలెగ్రామం అన్నది ఖచ్చితమైన దాని రూపం. వరాహపురాణం ప్రకారం గండకీనది ఒడ్డున సాలగ్రామం అన్నపూరు ఉన్నది.

సాలంకాయనుడన్న విశ్వామిత్ర మహర్షి పుత్రుడు ఎంతో తీవ్రంగా విష్ణుమూర్తి గురించి తపస్సు చేశాడు. ఆయనే ఈ ప్రాంతాన్ని ఎంపిక చేసుకున్నాడు. ఇక్కడ ఒక సాలవృక్షం వుంది. అది ఎంతో పెద్దది విశాలమైనది. పుష్పించునది. ఇది పర్వతాన్ని కూడా ధిక్కరిస్తుంది. ఆ మహర్షి ఆ వృక్షపునీడలో ఎంతోకాలం సుదీర్ఘ తపస్సు చేశాడు. వేసవికాలం ఎంతో అలసట చెంది ఈ చెట్టు వద్దకు వచ్చాడు. ఆయన పడమర పక్కన తలతిప్పి జపం చేయసాగాడు. విష్ణుమూర్తి ఆయనకు కనిపించలేదు. **వైశాఖమాసం ద్వాదశి రోజున సాలవృక్షం కింద సాక్షాత్కరించాడు. ఆ మహర్షి విష్ణుమూర్తిని స్తోత్రం చేశాడు. ఆయనని విష్ణుమూర్తి ఒక వరం కోరుకోమనగా ఆ మహర్షి పశ్చాత్తాపంతో నేను నీ విరాట రూపాన్ని సందర్శించాను. నాకు వేరే కోరిక ఏమీలేవు.** సాలెగ్రామం కింద ప్రతి ఒక్కరు విశ్రాంతి తీసుకోవచ్చు. ఈ పర్వతం అసాధారణమైనది చెప్పి విష్ణుమూర్తి అంతర్ధానమయ్యాడు.



సాలంకాయన మహర్షి చెట్టుకు ప్రదక్షిణ చేసి తన పర్ణశాలకు వెళ్ళి ఎంతో ఆప్యాయంగా పర్వతాన్ని చూశాడు. నాటి నుండి ఆ ప్రదేశం ఎంతో పవిత్రమైనది. సాలగ్రామగిరి అని ఆ పర్వతాన్ని పిలుస్తారు.

విష్ణుపురాణం ప్రకారం ఈ పవిత్ర శిలలు గండకీ నదిలో మాత్రం దొరుకుతాయి. వరాహపురాణం దీనినే రూఢి పరిచింది. ఈ ప్రత్యేకమయిన స్థలానికి చక్రతీర్థమని పిలుస్తారు. "చక్రతీర్థవచ్ఛిన్న గండకీ నద్యుత్సన్న శివాసుసాలరగామ పదవాస్య" ఈ స్థలానికి మూడు యోజనాలు అంటే 24 మైళ్ళపరిధి అంతా ఎంతో పవిత్రమైనది. చక్రినది అని దగ్గరలో ఇంకొకనది వుంది. ఈ ప్రాంతాన అది దీనితో కలుస్తుంది. ఈ చక్రనదిని బ్రహ్మ సృష్టించాడు. ఈ నదికి ఉత్తరాన పెద్ద శిఖరం ఉంది. దానిలో విష్ణుమూర్తి నివాసముంటాడు. ఇక్కడి శిలలు అన్నిటితో విష్ణుమూర్తి ఉంటాడు. ఈ మొత్తం ప్రదేశం అంతా 96 మైళ్ళు. పురాణ పద్ధతి ప్రకారం ఎంతో పవిత్రమైనది. **కొన్ని సాలగ్రామ శిలలు నీటిలోను కొన్ని పర్వతాల పక్కన దొరుకుతాయి. దీని విభజన వరాహపురాణంలో వివరంగా ఉంది. సాలగ్రామశిలలు విష్ణుమూర్తి ప్రతిరూపాలు వీటిని గుర్తించేందుకు. వ్యక్తిత్వ వికాసాలకు ఎంతో కృషి జరిగింది.**

ఈ సాలగ్రామాలు విష్ణుమూర్తితో కలిసి ఆయనకు ప్రతీకలుగా తయారయినాయి. కొన్ని సాలగ్రామాలు శివరూపంలో కూడా ఉన్నాయి.

కొన్ని శక్తి, సూర్య, గణేశరూపాలలో ఉన్నాయి. దీనిని పంచాయతనం అంటారు. **బ్రహ్మాండ పురాణంలో సాలగ్రామాల వర్ణనకు ఎంతో ప్రాముఖ్యం ఉంది. అనేక పురాణాలలో బ్రహ్మవైవర్త, అగ్ని, పద్మ, గరుడ, నృసింహ, స్కంద, బ్రహ్మ, బ్రహ్మాండ పురాణాలలో గౌతమీయతంత్రంలో సాలగ్రామ మాహాత్మ్యం, పద్మపురాణంలోని మాహాత్మ్యంలో సాలగ్రామ పరీక్ష గురించి చెప్పబడింది.**

గోపాలభట్టు రాసిన పూజా ప్రయోగంలోను సాలగ్రామ అర్చన చంద్రిక పూజా పంకజ భాస్కర సాలగ్రామ మీమాంస, సోమనాథ వ్యాస సాలగ్రామ లక్షణ పంజిక, సాలగ్రామ పరీక్ష, సాలగ్రామ లక్షణ పద్ధతి, సాలగ్రామ శిలా పరీక్షణ పద్ధతి, శ్రీతత్త్వనిధిలో వైష్ణవాది అధ్యాయంలోని దీని గురించిన వివరాలు ఎన్నో ఉన్నాయి. పురాణ వ్యాఖ్యానాలు అనుసరించి సాలగ్రామానికి సంబంధించి ఇంకా ఎన్నో పుస్తకాలు వివరంగా ఉన్నాయి.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





సాలగ్రామ వర్ణన ఒక పద్ధతి ప్రకారం లేదు. బాహ్య రూపం సాధారణ కళ్ళకు అన్ని రాళ్ళవలె కనిపిస్తాయి. ఎంతో సునిశితంగా దానిని గుర్తించి పూజించాలి. **సాలగ్రామాన్ని ఏ రూపంలో ఉన్నా ఏ ఆకారంలో వున్నా పూజించాలి. చక్రతీర్థంలో విష్ణుమూర్తి గుర్తులున్న సాలగ్రామం పూజార్హ్వమైనది. దీనికి రూపంతో ప్రసక్తిలేదు.** దీని ద్వారా భౌతిక విమోచనం జరుగుతుంది. విష్ణు తిలక సంహిత ప్రకారం ఈ పద్ధతి యధావిధిగావుంది. దీనిని అభివృద్ధికి పురోగతికి పూజించాలి. పాలతో అభిషేకం చేస్తే ఒక క్రమపద్ధతి ప్రకారం జీవనం కొనసాగించేందుకు దోహదం చేస్తుంది. సంహితలన్నీ సాలగ్రామాల గురించి ఎంతో వివరంగా చెప్పాయి. కొంతమంది గృహస్థులు కొన్ని రకాల సాలగ్రామాలను మాత్రమే పూజించాలి. లేకపోతే వారికి అవి హాని చేస్తాయి.

ప్రాచీన కాలంలో చెప్పిన పద్ధతి ప్రకారం సాలగ్రామాలలో ఏ విధమైన బేధాలు లేవు. అన్ని విష్ణుమూర్తి ప్రతిరూపాలే. ఇవి తరువాత కాలంలో పురాణ సంస్కృతి ప్రకారం పూజ పద్ధతిలో వచ్చింది. **సాలగ్రామాన్ని నిత్యపూజ యడమనేది మన కోరికలను బట్టి ఉంటుంది. పూజను ఈ పద్ధతి ప్రకారం చేస్తే అతను లాభాలు పొందుతాడు.** మరోచేత్తో జ్యోతిష్టోమాన్ని త్యాగం చేసినట్లయితే భౌతిక సంతోషాన్ని అధికమిస్తాడు. సాలెగ్రామాన్ని పూజిస్తే ఆ పూజ దేని కొరకు చేస్తున్నామో అది సిద్ధిస్తుంది. గౌతముడు సాలెగ్రామ పూజను చేయకపోయి నట్లయితే అవసాన దశలో ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చున్నాడు.

**సాలగ్రామాన్ని ఒకరోజు పూజించకపోయినట్లయితే దానిని ప్రాయశ్చిత్తంగా బ్రహ్మక్రర్మ అంటే 21 రోజులు పంచగవ్యాలు తాగుతూ గుడిలో నివసించాలి.** విష్ణు విగ్రహం వద్ద రాత్రిపూట నిద్రించాలి. సాలగ్రామ పూజ ఎన్నో పురాణాలలో ప్రార్థనాధికాలుగా చెప్పబడింది. **సాలగ్రామ పూజ ద్వారా సంపద విజయం దీర్ఘాయువు పశుసంపద ఆరోగ్యం పొందవచ్చు.** సాలగ్రామపూజ ప్రతీక ఉపాసన ఇది చేతికి చాలా దగ్గరగా ఉంటుంది. ఈ ఉపాసన మానసిక శక్తితో నిరంతర ప్రవాహ ఆలోచనలతో ఒక వస్తువుపై దృష్టి వుంచి పూజ చేస్తాము. ప్రతీక అంటే మూర్తిగాని, గుర్తుగాని అవుతుంది. **సాలగ్రామం ఉపాసనకు మూలస్థానం, సాలగ్రామంలో విష్ణుమూర్తి ఉంటాడు. సాలగ్రామం బయట విష్ణుమూర్తి**



**రూపం ఉంటుంది.** సాలగ్రామం విష్ణుమూర్తి రూపం కాదు. అది దైవత్వపుశీర్షముకాదు. విష్ణుమూర్తిని ఈ రూపంలో ప్రత్యేకంగా పూజించవచ్చు.

హిందూ సిద్ధాంత ప్రకారం దైవశీర్షం కలశంలోని జలం పవిత్రమైన అగ్ని, సూర్యుడు ఒక వేదికపై కూర్చోపెడతాం. సాలగ్రామం అనేకరకాలలో ఉన్నది. ప్రతిమను కూడా ఉంచుతాము. సాలగ్రామం స్వయంభువు. అయితే దానిని కూడా అక్కడే వుంచుతాము. దాని గుర్తింపుకోసం ఎన్నో గుర్తులువుంటాయి. భక్తులు వాటిని గ్రహించి భక్తితో పూజించాలి. **సాలగ్రామాలపై కొన్ని గుర్తులుంటాయి. వాటి ద్వారా విష్ణువును గుర్తించవచ్చు. పురాణాలలో చెప్పిన అనేక ముద్రలు విష్ణుమూర్తి విగ్రహానికి సంబంధించినవే. సాలగ్రామ విషయానికొస్తే ఈ గుర్తులన్ని విష్ణుమూర్తికి సంబంధించినవే.** మత్స్యమూర్తి ఆ కారంలోను, హయగ్రీవమూర్తి గుర్రంతల ఆకారంలోను, వరాహమూర్తి వరాహరూపంలోను ఉంటారు.

సాలగ్రామాలు ఎన్నో రకాలు ఉన్నాయి. కొన్ని గుండ్రంగాను, కొన్ని త్రికోణంగాను, కొన్ని కోడిగుడ్డు రూపంలోను ఉంటాయి. వీటిని స్థిరచిర అన్న పేరుతో పిలుస్తారు. దీని పూజ ఎంతో అభివృద్ధిని ప్రసాదిస్తుంది. సాలగ్రామాలు మూడు రకాల భేధాలున్నాయి. **1) <u>ఒకటి జలజము :</u>** ఇది నీటిలోను, పర్వతంతోను కలిసి ఉన్న కారణంగా చాలా నున్నగాను ఉంటాయి. **<u>2) స్థలజము</u>** : ఇవి పర్వతం దగ్గరే ఉన్నందువల్ల గరుకుగాను ఉంటాయి. **<u>3) మఠ</u>** : ఇది పెంకులో ఏర్పడుతుంది. ఇది అతి తక్కువయిన విలువైన సాలగ్రామాలు, మళ్ళీ ఇందులో రెండు రకాలు ఉన్నాయి.

**<u>మఠశిలలు</u>** :

కీటకాలు అదేపనిగా తినేశాయి. ఈ రకములు సాలగ్రామాలు అందులోని చక్రాలు చాలా కఠినంగా ఉంటాయి.

**చక్రలక్షణము :**

ఇది విష్ణుమూర్తి ఆభరణాలు, ఆయుధాలను గుర్తుకు తెస్తుంది. కొన్నిటిపై లింగమూర్తి వుంటుంది. కొన్నిటిపై తాబేలు మిగిలిన అవతారమూర్తుల రూపాలుంటాయి.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





**స్థూల సూక్ష్మ శిల :**

ఈ సాలగ్రామాలు చిన్నవిగాను, పాలరాతి ఆకారంలోను వుంటాయి. ఇవి సాధారణంగా ఉసిరికాయంత పరిమాణంలో ఉంటాయి. వీటిని గృహస్థులు పూజించవచ్చు. స్కాందపురాణం ప్రకారం మంత్రసిద్ధి పొంద దలచిన సాధకుడు నల్లటి సాలగ్రామాన్ని పూజించాలి. **పెద్ద సాలగ్రామాన్ని పూజించిన వ్యక్తికి ఆయుష్షువృద్ధి అవుతుంది. ఒకేవైపు వున్న సాలగ్రామం దరిద్రాన్ని పోగొడుతుంది.** ఈ సాలగ్రామాలను చేతపెట్టుకున్నపుడు అవి ఏ అర్చామూర్తులను గుర్తుచేస్తాయో అది దానికి సంబంధించిన సాలగ్రామము. వివిధ పురాణాలలో సాలగ్రామాల గురించి ఎంతో వివరంగా విశదంగా దానిమహిమలు వివరించి చెప్పారు. వివరాలు కావలసిన వారు నృసింహ, స్కాంద, గరుడ, ఇంకా ఎన్నింటినో తెలుసు కోవచ్చు.

1780-1865 వరకు నివసించిన మైసూర్ మహారాజు శ్రీ కృష్ణరాజు ఒడయార్ సంకలనం చేసిన శ్రీతత్త్వనిధి అన్న సర్వస్వాన్ని రచించాడు. ఇందులో 9 అధ్యాయాలున్నాయి. ఇందులో చిత్రాలు కూడా ఉన్నాయి. అధమ, జ్యోతిష, సంగీత, క్రీడల గురించిన వివరాలున్నాయి. ఇది ముద్రణలో చూడలేదు. ఇందులో ప్రాచీన మాధ్యమయుగ గ్రంథాల నుండి సేకరించారు. వైష్ణవనిధిలో సాలగ్రామ వివరాలు చిహ్నాలు ఇంగ్లీషు అనువాదంలో ఉన్నది.అందులో ఉన్నాయి. ఈ రచయిత దక్షిణాదిన విస్తృతంగా ఉపయోగించే సాలగ్రామం ఉత్తరాదిన ఉపయోగించే సాలగ్రామం సేకరించారు.

ఈ సాలగ్రామాల చరిత్రను నరసింహ పురాణం బ్రహ్మనారద సంవాదంలో తెలిపారు. దీనిని శ్రీతత్త్వనిధిలో సాలగ్రామ పరీక్షలు కూడా ఉన్నాయి. **ఈ సందర్భంగా మూడు రకాల పరీక్షలు సునిశితంగా ఉన్నాయి. 10 అవతారాల మూర్తులు 2) 24రకాల మూర్తులు మిగిలిన రకాలు, ఇవన్నీ శ్రీ తత్త్వనిధిలో విశదంగాను విపులంగాను ఉన్నాయి.** నరసింహ పురాణంలో వాటి వర్ణనమాత్రమే ఉంది. సాలగ్రామ పరీక్ష మిగిలిన పురాణంలో ఉంది.

సాలగ్రామాల భక్తులకు ఎంతో వివరంగా తెలిసింది. కొన్ని సందర్భాలలో వివిధ రకాల వివిధ వర్ణనలతో వివరించబడింది. నరసింహ



పురాణంలో ప్రధానంగా దీని గురించి ఎక్కువగా వివరించాను. నరసింహ మొదలైన సాలగ్రామాలలో తెలిపింది. ఇది దక్షిణాది సాలగ్రామ సంప్రదాయాల గురించి సాలగ్రామ విభాగంలో చర్చించారు. **నారదుడు బ్రహ్మను అనేక సందర్భాలలో వాటి గురించి చెప్పటం తనకెంతో ఆనందంగా ఉందని తెలిపాడు.** సాలగ్రామాల పుట్టుక, రంగులు, గుణాల గురించి దైవత్వం గురించి పూజార్హాల గురించి చెబుతానన్నాడు. సాలగ్రామాలను గురించి బ్రహ్మనారదునకు చెప్పాడు. అవంతీదేశంలో పవిత్ర పర్వతంలో సాలగ్రామ శిలలకు మూలస్థానం. అది పవిత్ర క్షేత్రం. పాపహరం. **ఇక్కడ గండకీనది అన్ని దోషాలను హరిస్తుంది. ఈ నీటిని ముట్టుకుంటే విష్ణువు ఉనికి వున్న కారణంగా అన్ని రకాల దోషాలు నాశనమవుతాయి.** దీనిముందు చక్రతీర్థమన్న సరస్సుంది. అది విష్ణుమూర్తికి నివాసము, భూదేవి,లక్ష్మిలతో ఆయన అక్కడ ఉంటాడు.

ఆ పవిత్ర ప్రదేశంలో ప్రతిశిల పవిత్రమైనదే. వాయు ప్రధానశిలలు పవిత్రమౌతాయి ఒక అమృత క్షణంలో అవి పవిత్రమౌతాయి. అక్కడ శంఖ చక్రహిరిత్నాలు ఏర్పడతాయి. అనేకవేల సంవత్సరాల తరువాత వజ్రకీటకం పుడుతుంది. అదే విష్ణుమూర్తి రూపం. ఈ కీటకం బంగారు రంగులో ఉంటుంది. వెలుతురు ప్రసరింపజేస్తుంది. మధురగానాన్ని సృష్టిస్తుంది. **శిలలో ఎన్నో వేల విష్ణు చిహ్నాలను ప్రసాదిస్తుంది. శిలవిష్ణురూపమైతే లక్ష్మి శిలలో ఉంటుంది. దైవశక్తివల్ల ఈ శిలలు పగిలిపోవు.**

ఎంతోకాలం నుండి పేరుకున్న దోషాలన్నీ ఈ శిలాదర్శనం వల్ల నాశనమ వుతాయి. సాలగ్రామాలు వివిధ రంగులలో ఉంటాయి. ఈ శిలలు ఎఱుపు, తెలుపు, పసుపు, నలుపు, ఆకుపచ్చ ఇంకా ఇతర రంగులలో ఉంటాయి. ఈ రంగులు కొన్నిటిలో ఎంతో ప్రకాశవంతంగా ఉంటాయి. మరికొన్ని వెలసిపోయి నట్లుంటాయి. కొన్ని సందర్భాలలో రంగులు కనుగొనడం కూడా కష్టం.

**సాలగ్రామాలను రంగులను బట్టి విభజిస్తారు. వాసుదేవ సాలగ్రామం తెల్లగా ఉంటుంది. హిరణ్యగర్భ సాలగ్రామ పచ్చగా ఉంటుంది. ప్రద్యుమ్న సాలగ్రామం ఎఱ్ఱగా ఉంటుంది. విష్ణు సాలగ్రామం నల్లగా ఉంటుంది. నారాయణసాలగ్రామం ఆకుపచ్చగా ఉంటుంది. నరసింహ సాలగ్రామం**

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





ఎఱ్ఱగా ఉంటుంది. మన సాలగ్రామం అటాసిరంగులో ఉంటుంది. వాటి రంగుల బట్టి ప్రభావముంటుంది. బూడిదరంగుసాలగ్రామాలు పూజార్హమైనవి. మచ్చలున్న సాలగ్రామాలు నాశనం చేస్తాయి. వివిధ రంగులున్నవి పూజార్హమైనవివేరు. రాగివర్ణపుసాలగ్రామం బాంధవ్యాలను నాశనం చేస్తుంది. నీలి రంగు సంపదనిస్తుంది. నల్లరంగు, పోషణ వృద్ధి చెందింపజేస్తుంది. పూజకు రంగులతో పనిలేదు. బహువర్ణాలపై కొంత తికమక ఉంది. ఖచ్చితమైన రంగులు లేని సాలగ్రామాలు మన పనిని నాశనం చేస్తాయి. సాలగ్రామ చుట్టు కొలత ద్వారాలతో కొలుస్తారు. సాలగ్రామ ద్వారంలో దారం ఎక్కించినట్లైతే ద్వారం కనిపించిది అది 1/8వంతు గుర్తున్నది మంచి సాలగ్రామం.

సాలగ్రామం 1/3వంతు విసర్జించినట్లైతే వాటి క్రియలలో మార్పులుంటాయి. ద్వారం కిందకు ఉంటే దాని శక్తి అపూర్వం పైకి ద్వారమున్నట్లైతే ఇంద్రజాలశక్తులను ఎక్కువ చేస్తుంది. ఆ ద్వారపు శక్తులు కొన్ని అపూర్వమైనవి శక్తివంతమైనవి. ఆ పేరులు విష్ణుమూర్తి పరిపేరులు. విష్ణురూపాలైన మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, పరశురామ, రామ, బుద్ధ, కల్కిలు అవి సాలగ్రామ దైవశక్తి ప్రత్యేకమైనది.

మత్స్య సాలగ్రామం రూప వదనంపై చక్రం వుంటుంది. శ్రీ వత్స చిహ్నాముంటుంది. వీటితో పాటు వనమాల గుర్తులుంటాయి. మహాకూర్మమూర్తి గుండ్రంగాను, తాబేలుమాదిరిగా వుంటుంది. వనమాల గుర్తులుండవు. ఆకుపచ్చ రంగులో ఉంటుంది. వరాహమూర్తి పెద్ద నోటితో నీలి నలుపురంగులో ఉంటుంది. భా చిహ్నాముంటుంది. ప్రారంభంలో ప్రకాశవంతమైన చక్రముంటుంది. బుద్ధమూర్తి రెండు ద్వారాల చక్రాలుంటాయి. రెండు చక్రాలుంటాయి. ఆ చక్రాలు తలవైపు తిరిగి ఉంటాయి. ఈ శిల అనేక రంగులతో ఉంటుంది.

నరసింహసాలగ్రామం నోరుతెరుచుకున్నట్లుంటుంది. పొడవైన చక్రముంటుంది. పెద్దపొట్ట. ఇది పూజార్హమైనది. లక్ష్మీనరసింహసాలగ్రామం పెద్దది. దాని మీద రేఖాచిత్రా లుంటాయి. ఇవి ధనుర్బాణాల రూపంలో ఉంటాయి. చక్రముంటుంది. ఎన్నో ఆకారాలలో ఉంటాయి. బలరామమూర్తి, సాలగ్రామంపైన గాలి గుర్తు ఉంటుంది. పంటలు రక్షించే ఆయుధ ముంటుంది. తెల్లరంగువనమాల గుర్తుతో పాటు మచ్చ లుంటాయి. దీనిని



సంకర్షణమంటారు. శ్రీ విగ్రహమూర్తిఎంతో సున్నగా ఉంటుంది. దానిపైన సహస్రాధిక మచ్చలుంటాయి. చక్రం కూడా ఉంటుంది. కల్కిమూర్తి సాలగ్రామములో గుఱ్ఱపుగుర్తు ఉంటుంది. గంటచేతిలో ఉంటుంది. తెల్ల రంగులో ఉంటుంది, పెద్ద నోరు ఉంటుంది.

శ్రీ కృష్ణమూర్తి సాలగ్రామమూర్తి సాలగ్రామానికి పైన చెప్పిన ఐదు ఆయుధాలతో పాటు ఏ విధమైన ద్వారాలుండవు. గుండ్రంగాను, పొడుగుగానో ఉంటాయి. వనమాల గుర్తుంటుంది. దైవత్వ చిహ్నాముంటుంది. పొడుగ్గా ఉండి పొట్టతో ఉంటుంది. వేణురేఖలుంటాయి. రధిసాయనమూర్తి సాలగ్రామం క్రిందకు తిరిగిన చక్రం గుర్తు ఉంటుంది. తేనె చుక్కల గుర్తులుంటాయి. ఎఱుపురంగు మీద నీలిఛాయ ఉంటుంది. రధిగోపాల నామవసాల గ్రామానికి పైన చక్రముంటుంది. పైన తేనె చుక్కల గుర్తులుంటాయి.

MOHANPUBLICATIONS.COM

సంతాన గోపాల వామన సాలగ్రామానికి కొమ్ముల గుర్తులుంటాయి. తొలిస్థానం వేణువుంటుంది. దీని పూజవల్ల సంతతి కలుగుతుంది. నీలివర్ణపురాయి పొగరుగా ఆకారంలో ఉంటుంది. ఇది ఏనుగు గుర్తుకు తెస్తుంది. చక్రముంటుంది. ప్రద్యుమ్నమూర్తి ఎఱుపురంగులో ఉంటుంది. దీని రేఖలు వనమాలను గుర్తుకుతెస్తాయి. ధనుర్బాణాలు దీనినిపూజచేసినట్లైతే దీర్ఘకాలం జీవిస్తారు. అనిరుద్ధమూర్తికీ లక్షణాలే ఉంటాయి. నిమేషచక్రం, ద్వారం గుర్తులు జంగమ రంగులో ఉంటాయి. హయగ్రీవ మూర్తి నేరేడు రంగులో ఉంటుంది. వినాయకుని మాబు పొదిరిగా ఉంటుంది. పొడవైన రేఖలుంటాయి. శ్రీధరి సాలగ్రామం ఆకుపచ్చరంగులో ఉంటుంది. చక్రాలు ఒక పద్ధతిలో ఉండవు. అవి వనమాలను గుర్తుకు తెస్తాయి.

లక్ష్మీనారాయణ గుండ్రంగా ముట్టుకొన్నంతనే చల్లగా ఉంటుంది. రెండు ద్వారాలు 4 చక్రాలుంటాయి. అవి ఎడమపక్కకుగాని కుడి పక్కకుగాని తిరిగి ఉంటాయి. పద్మనాభమూర్తి శిల బొడ్డుప్రాంతాన రోజా పువ్వు రంగులో ఉంటుంది. గోవిందమూర్తి సాలగ్రామం నీలి రంగులోను, పచ్చరంగులో ఉంటుంది. దీనికి పది ద్వారాలుంటాయి. 12 చక్రాలుంటాయి. వనమాల గుర్తులుంటాయి. ఈ సాలగ్రామ పూజ అన్ని కోరికలు తీరుస్తుంది. విశ్వరూప సాలగ్రామం 12 ద్వారాలు 4 చక్రాలు ఉంటాయి,. భౌతిక సుఖాలనిస్తుంది.

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





లక్ష్మీ సాలగ్రామం మూర్తి లభ్యం కావడం దుర్లభం, దాని పూజలో అన్ని కోరికలు స్వల్పకాలంలో తీరుతాయి. ద్వారంపైన గరుడపక్షి ఉంటుంది. నారాయణమూర్తి సాలగ్రామం సర్వాకారంలో ఉంటుంది. ఏది కోరకుంటే దాన్ని ప్రసాదిస్తుంది. దామోదర మూర్తి పొడుగ్గా ఉండి ప్రకాశవంతంగా ఉంటుంది. వనమాల గుర్తుగా ఉంటుంది. త్రివిక్రమమూర్తి పైన సూచించిన లక్షణాలే ఉంటాయి. జనార్ధనమూర్తి రంగులో ఉంటుంది. కలువపువ్వు ఆకారంలో ఉంటుంది. మంచు మాదిరి చల్లగా ఉంటుంది. బల్లెం పుచ్చుకు ఉంటుంది.

వాసుదేవమూర్తి ప్రశాంతంగా ఉన్నట్లు కనిపిస్తుంది. చంద్రకాంతి కనిపిస్తుంది. విష్ణుమూర్తి పంచ ఆయుధాల ధరించినట్లు కనిపిస్తుంది. నాభిలో చక్రం గుర్తు కనిపిస్తుంది. విష్ణుమూర్తి సాలగ్రామం ముదురు రంగులో విష్ణుక్రాంతపురుగులో ఉంటుంది. పైన చెప్పిన విష్ణుమూర్తి ఆయుధాలుంటాయి. దీనితోనే పాటు వనమాల కలువపూవు గుర్తు ఉంటుంది.

అచ్యుతమూర్తి, నీలిరంగులో పెద్దదిగా ఉంటుంది. సున్నగా చక్రాలుంటాయి. ఉపరితలం మీద వనమాల గుర్తు ఉంటుంది ఉపేంద్రమూర్తి సాలెగ్రామం. ఇది నీలి రంగులోను శరీరం మీద గుర్తులు ఉండి మంచి అదృష్టానికి చిహ్నంగా ఉంది. శివనాభ మూర్తి సాలెగ్రామం ఏనుగు ఆకారంలో ఉండి మధ్యభాగాన బండగీతలు ఉంటాయి. ఇది దొరకడం కష్టం. దీని పూజతో అన్ని కోరికలు తీరుతాయి.

హిరణ్యగర్భమూర్తి సాలెగ్రామం నీలినలుపురంగుతో ముట్టుకుంటే చల్లగా ఉంటుంది. దీనికి ద్వారాలు ఉండవు. లోపల బంగారం ఉంటుంది.మదన గోపాల సాలెగ్రామం కొంత నలుపురంగులోను కొంత ఎర్ర రంగులో ఉంటుంది. దీనిలో ద్వారాలుంటాయి. ధనుర్బాణాలు చంద్ర చిహ్నం ఉంటుంది. జనార్ధనమూర్తి సాలెగ్రామం నీలినీటి లిల్లీ రంగులో ఉంటుంది. రాతిచుట్టూ వనమాల గుర్తులుంటాయి. **12** చక్రాలు **6** ద్వారాలు ఉండి పట్టుకుంటే జారిపోతుంది. లక్ష్మీనారాయణమూర్తికి రెండు చక్రాలుంటాయి. ఇవి పైన కింద ఉంటాయి.

శ్రీమన్నారాయణ సాలెగ్రామానికి ప్రతిప్రక్కన రెండు చక్రాలు ఉంటాయి. సుదర్శనమూర్తి సాలెగ్రామం కొన్ని సందర్భాలలో కోడిగుడ్డు ఆకారంలోను, గుండ్రంగాను ఉంటుంది. దీనిలో చక్రం కొన్ని గుర్తులు ఉంటాయి. వనమాలమూర్తి సాలెగ్రామంకు పక్కలకు ద్వారం ఉంటుంది.



లోపల ఇల్లువలె ఉంటుంది. రెండు చక్రాలు వంకర తిరిగి ఉంటాయి. ఒక పక్కన వనమాల గుర్తు ఉంటుంది. లక్ష్మీనరసింహమూర్తి సాలెగ్రామం లోపల ద్వారం, చక్రాలు ఉంటాయి. ఇది చిన్నదిగా ఉంటుంది. శ్వేతవరాహ మూర్తి సాలెగ్రామం పొడవుగా ఉంటుంది. ఏనుగుదంతం ఆకారంలో తెల్లగా స్పష్టంగా ఉంటుంది. దీని మీద ఉన్న ఒక గుర్తు వనమాలను గుర్తు చేస్తుంది. భూవరాహ సాలెగ్రామం శిరస్సు ఆకారంలో దంతంతో ఉంటుంది. కింద భాగాన చక్రం ఉంటుంది. ఇది చాలా పవిత్రమైన సాలెగ్రామం, త్రిమూర్తి సాలెగ్రామం విష్ణుమూర్తి ఆభరణాలు పోయి పరశువు వలె ఉంటుంది. కలువపువ్వు నీటి కుండ మూడు దండలు ఉంటాయి.

సాలెగ్రామాలు క్రమపద్ధతిలో కోణాకృతిలో ఉండవు. పగిలిపోయినవి, కాలినవి, పురుగులు తిన్నవి వాడరాదు. కొన్ని సాలెగ్రామాలలో అనేక చక్రాలు కొన్ని దుశ్చక్రాలు, కిందభాగాన చక్రాలుంటాయి. వీటిని మినహాయించుకోవాలి. కొన్నిటిలో బాణాన్ని గుర్తుచేసే రేఖలుంటాయి. చక్రాలు స్పష్టీకరించలేము.

ఈ సాలెగ్రామాలు ఒక పద్ధతి ప్రకారం లేక బ్రౌన్ వెజిటబుల్ రంగులో ఉంటాయి. కొన్ని రకాల సాలెగ్రామాలు క్రూరంగా, భయంకరంగానూ ఉంటాయి. అలాంటి వాటిని వదిలివేయాలి. సాలెగ్రామాలను క్షుణ్ణంగా పరిశీలనచేసి అవి ఎంతవరకు పూజార్హమయినవో గ్రహించాలి. **సాలెగ్రామాలను 14లోకాలు పూజిస్తాయి.దైవం సంతోషిస్తాడు. ప్రతి ఒక్కరు సాలెగ్రామాన్ని పూజిస్తారని ఒప్పుకుని తీరాలి. సాలెగ్రామాలను పూజించిన తరువాత బహుమతిగా ఇవ్వాలి. బహుమతి గ్రహీత, దానకర్తలకు, ఇద్దరకు ఎంతో పుణ్యం. సాలెగ్రామాలను కొనరాదు. సాలెగ్రామం పగిలిన అట్టి వాటిని పూజించిన అది మంచిదికాదు.**

సాలెగ్రామం కనుక పగిలి చక్రం యధావిధిగా వుంచే దానిని పూజించవచ్చు. సాలెగ్రామాలలో ఎక్కువ చక్రాలు ఉన్నవాటిని పూజించవచ్చు. సాలెగ్రామం పాలిపోయిన రంగుతోను, సరిగాలేకపోతే మంచిది కాదు. సాలెగ్రామాలు సంతోషంకోసం పూజించాలి. సాలెగ్రామం కాలిన, నిప్పువల్ల నాశనం అయిన దానిని పూజించరాదు. సరిసంఖ్యలో సాలెగ్రామాలు పూజించాలి.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....



**సాలెగ్రామాలు విష్ణుమూర్తి ప్రతిరూపాలు. అది అన్ని రకాలు దోషాలు హరిస్తుంది.** ఈ భాగంలో సాలెగ్రామాల లక్షణాలు, వాటి మహిమలు వినాలి.

నారదా! ఈవిధంగా నేను నీకు సాలెగ్రామాల శక్తి మహిమలు ఎంతో భక్తి శ్రద్ధలతో చెప్పాను. ఈ విషయాన్ని వివరాలను సాలెగ్రామాల మహిమలు గ్రహించి జీవితపు 4 విధులను పూర్తిచేసి నాకు ప్రీతి పాత్రుడవుకమ్ము. సాలెగ్రామ మహిమలు రాత్రింబవళ్ళు తెలుసుకో.

ఏ విధమైన తెలియజేయని రహస్యాలు వుంటే వానిని కూడా అనువంశీక పద్ధతిలో తెలుసుకో. నారదుడు దీనిని అంతా గ్రహించి బ్రహ్మను పూజించాడు. నీవు నాకు అంతా చెప్పావు. సాలెగ్రామ లక్షణాలు భక్తులకు వుండే లక్షణాలువాటికి వుండే రంగులు అందులో ఉండే గుణదోషాలు చెప్పావు. బ్రహ్మ నారదునితో! నారదా నీవు అడగనివి కూడా చెప్పాను.

MOHANPUBLICATIONS.COM

సాలెగ్రామాలు ఎన్నో రకాలుగాను, ఎన్నో విధాలుగాను పూజార్హమైనవిగాను ఉంటాయి. కొన్ని రకాల సాలెగ్రామాలు పూజచేసే వారిని, వారిభార్యను మృత్యువుదరికి చేరుస్తాయి.

**నీలి, నలుపురంగుగల సాలెగ్రామం భాగ్యాన్ని ప్రసాదిస్తుంది. నలుపు రంగు సాలెగ్రామం పోషణ సౌభాగ్యాన్ని ప్రసాదిస్తుంది. పసుపుపచ్చని సాలెగ్రామం, ఎర్రని సాలెగ్రామం అధికారాన్ని ఇస్తుంది. బాగా గాఢ ఎరుపు ఉన్న సాలెగ్రామం మృత్యువుకు కారణం అవుతుంది. నల్లని సాలెగ్రామం పూజించే వారికి ఉత్సవశక్తులను ప్రసాదిస్తుంది. బూడిద రంగుగల సాలెగ్రామం విషాదాన్ని విచారాన్ని బహుకరిస్తుంది.**

భక్తి అనగా దేవునియందు అపరిమితమైన అనురాగము కలిగి ఉండటం, ఇలాంటి అనురాగము శాశ్వతమైన, అచంచలమైనపుడు, భక్తిని సాధన చేసేవాడిలో భగవంతుని పూజచేసే అతనిలో యితర విషయములపై ఆసక్తిని నాశనం చేస్తుంది. జ్ఞానమును, వైరాగ్యమును పెంచుతుంది.

**తాము చేసే ప్రతిపనిలో ఆ శ్రీమన్నారాయణుని అనుగ్రహమును కల్పించేవారే వైష్ణవులు. ఇలాంటి పురాతనమైన వైష్ణవుల సంప్రదాయానికి చెందిన అనేక కుటుంబాల ఇళ్ళలో ప్రతి నిత్యమూ పూజలందుకునే పవిత్రమైన రూపులే ఈ సాలగ్రామములు.**



**సాలగ్రామములు మామూలు శిలా రూపములు కావు.అవి శ్రీ మహావిష్ణువు నివాసముండే స్థానము. వీనియందు దేవుని సన్నిహితము ఎప్పుడూ ఉంటుంది అవని నమ్మకము. సాధారణ విగ్రహాలకు వలెనే, ఈ సాలగ్రామములకు ప్రతిష్ఠ, ప్రత్యేకమైన పూజలు, నైవేద్యములు అవసరం లేదు. ఈ సాలగ్రామాలను ఎక్కడ పూజ జరుగుతుందో ఆ శ్రీమహా విష్ణువు నకు జరిగిన పూజగా భావిస్తారు.** ఈ విషయాన్ని శాస్త్రగ్రంథములలోని **పద్మసంహితలో** సాలగ్రామ విశిష్ఠత గురించి యిలా చెప్పారు.

**శ్లో॥ సర్వాః స్వాయంబవాజ్ఞేయాః శిలాశ్చక్ర సముద్భవా।**
**నిత్యం సన్నిధిరేతాను పరస్వపరమాత్మనః॥**
**న ప్రతిష్ఠా విధాతవ్యానైవ చావాహనాదికమ్।**
**సాలగ్రామ శిలాయత్ర పూజ్యతే భగవన్మయై॥**

**ఈ సాలగ్రామాన్ని ప్రతి నిత్యం పూజిస్తూ, దానిని నిత్యం స్పర్శిస్తూ ఉండే వారికి సర్వదేవతల ఇష్టమైన స్వర్గలోక ప్రాప్తి కలుగుతుందని గరుడపురాణంలో ఉంది. అందువలన సర్వదేవతలకు చేసే పూజలకు మించినది ఈ సాలగ్రామ మునకు అర్చన చేయటం.**

సాలగ్రామము యొక్క గొప్పతనమును **పద్మపురాణం** 22వ అధ్యాయంలో పరమశివుడు- కుమారస్వామికి మధ్య జరిగిన సంభాషణలో ఈ సాలగ్రామ గొప్పతనమును వివరించుతూ పరమశివుడు కుమారస్వామితో ఇలా పలికినాడు.

**మూడులోకములు మొత్తం ఈ సాలగ్రామములో యిమిడి యున్నవి. ఈ సాలగ్రామమును చూసినా, నమస్కారము, అభిషేకాదులు, పూజ మొదలగునవి చేసినచో కోటియజ్ఞములు చేసినంత పుణ్యమునకు సమానముగా వుంటుంది. అంతేకాకుండా కోటి ఆవులను దానము చేసినంత పుణ్యము వస్తుంది. ఈ సాలగ్రామ పూజ చేసి తీర్థమును సేవించినచో వారికి పునర్జన్మ అనేది వుండదు.**

సాలగ్రామ శిలలలో మొత్తం 12 రకములు వున్నాయి. వీనిలో ఏ సాలగ్రామమును పూజించిననూ అనంతమైన పుణ్యము లభిస్తుంది. **ఈ సాలగ్రామ పూజ ప్రతి ఒక్కరూ అనుకునేంత కష్టమైన పనేంకాదు. సాలగ్రామమునకు పూజచేయాలనే ప్రతి వ్యక్తిలో వుండే శ్రద్ధ, భక్తి**

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

**ననుసరించి దేవునికి పూజచేయడం చాలా తేలికగా వుంటుంది.** ఇలాంటి పూజ ప్రతిరోజూ చేసే విధి విధానమైనప్పుడు ఈ పూజ ప్రతి ఒక్కరికి ఆనందాన్ని, ఉత్సాహాన్ని ఇస్తుంది. ఇలా చేయడం భక్తికి మూలమెట్టు, ముక్తికి మూల స్తంభం వంటిది.

సాలగ్రామాన్ని నిత్యం పూజచేయకపోయినా, లేక సరిగా చేయకపోయినా కుటుంబానికి, గృహానికి మంచిదికాదని చాలామంది అనుకుంటుంటారు. సాలగ్రామానికి చేసే పూజ "శక్తి పూజకాదు." ఆ శ్రీహరి, జగన్నాధుడు, లోక రక్షకుడు, మోక్షాన్ని ప్రసాదించే సాక్షాత్తూ ఆ శ్రీమన్నారాయణునకు చేసేటటువంటి పూజ. **సాలగ్రామమునకు పూజ మడితోనూ, నిత్య నైవేద్యములతో, నిర్వహించ వలెనని, లేకపోతే తమకు అనేక కష్టములు ప్రాప్తిస్తాయని భావించేవారు అజ్ఞానముతో వున్నట్టే.**

సాలగ్రామాన్ని అర్చించే విధానాన్ని క్రోడీకరించి శ్రీమద్వాచార్యుల వారు "తంత్రసారం" అనే గ్రంథంలో వివరించారు. "పద్యమాల" అనే రచనలో ప్రజలకు సులభముగా అర్ధమయ్యే విధంగా శ్రీమద్ జయతీర్థుల వారు వివరించి ప్రజలకు గొప్ప మహోపకారము చేశారు.

శ్రద్ధలేనిది ఏదీ ఫలించదు, శ్రద్ధ అంటే తత్పరత. ఆ పూజ పూర్తయ్యే వరకు ఫలితమును ఆశించకూడదు. ఒక జపము, మంత్రము, లేక దేవతలకు ఎంత పూజ చేసిననూ తగిన ఫలము లభించదు. ఇహమున, పరమున సౌఖ్యములు ఆశించువారికి భగవద్గీతలో 4వ అధ్యాయములో 39వ శ్లోకము సరియైన సమాధానము.

**శ్లో॥ శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పరస్సంయ తేంద్రియః**
**జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మధిరేణాధి గచ్ఛతి॥**

కాలానుగుణంగా పంట పండుతుంది. గర్భము పెరుగును. ప్రతి మనిషి తమ విచారమును విడిచి భక్తిలేకుండా పూజచేయనివాడు తన పూజా విధానమును మారుస్తూ ఉంటాడు. అలా చేసే దేవతాపూజలను, అంతేకాక అనేక దేవతల పూజలను సమయమునకు అనుకూలముగా మారుస్తూ నిలకడగా ఒకదేవతా పూజ చేయకుండా వుంటాడు. అలాంటి వాడు తనలోని భక్తిలోపములను గ్రహించక తాను జపించు మంత్రంలో, పూజలో దోషముందని భావించి ఆ పూజను, మంత్రాన్ని మధ్యలో



వదిలివేస్తాడు. అంతేగాక పూజచేసే ప్రతి భక్తుడు మధ్యలో ఎదురయ్యే అవాంతరములకు చలించి మధ్యలో వదిలివేస్తుంటాడు. అలా కాకుండా పూజ చేసే వారికి మనో నిగ్రహముతో, ఎటువంటి పరిస్థితులకు లోనుకుండా నిత్యం పూజ చేస్తే వారికి ఫలప్రాప్తి సాధిస్తుంది. అటువంట ప్పుడే ఫలితం లభిస్తుంది.

ప్రతి ఒక్కరి ఇంట్లో అపూర్వసంపదయైనటువంటి ఈ సాలగ్రామ ములు వుండివుంటాయి. కాని వాటిని ఓ మూలన పడేసి వుంటారు. **సాలగ్రామాలు అలా పడేసి వుండకుండా ఆదివారం, శెలవులప్పుడు, దశమి, ఏకాదశి, పౌర్ణమి, అమావ్యాస, ద్వాదశి తిథులప్పుడు ఈ సాలగ్రామమును శుభ్రంచేసి, వాటిని పూజించడం ఎంతో మంచిది. మిగిలిన రోజులలో ఈ సాలగ్రామములకు దీపం, ధూపం, నైవేద్యములతో పాలు, పండ్లతో పూజ చేయండి. సాలగ్రామమును ప్రతినిత్యం పూజచేస్తే అత్యంత శుభం.**

ఈ సాలగ్రామాలను పూజలో నిర్వహించే పద్ధతులు, నియమాలను తప్పకుండా పాటించండి. భక్తి సంప్రదాయాన్ని కాపాడండి. మీ పూర్వీకులు మీకు అందించిన అపూర్వమైన సాంప్రదాయాలను గౌరవించండి. ఈ సాలగ్రామ అర్చన విధానం వల్ల మీ కుటుంబ క్షేమాన్ని, అభివృద్ధికి బంగారు బాట వేస్తుంది. ఇలా చేయడం వలన లక్ష్మీనారాయణ అనుగ్రహాన్ని పొందండి.




**పెద్దవైన సాలగ్రామములు**

MOHANPUBLICATIONS.COM

## సాలగ్రామాలను గురించిన

## మరికొన్ని ముఖ్య సూత్రములు

1. 12 సాలగ్రామాల కూటమిని క్షేత్రము అని అంటారు. ఈ క్షేత్ర సాలగ్రామాలను మన పూర్వీకులు మనకొరకు భద్రపరచి ఉన్న యెడల ఈ సాలగ్రామ పూజ వీలుపడనప్పుడు ఆ సాలగ్రామాలను అలా ఉంచుట కంటే వీనిని బ్రాహ్మణులకు దానం ఇవ్వటం మంచిది.

2. ఈ సాలగ్రామములను అమ్మటం,కాని కొనటం కాని చేయకూడదు.

3. దానములన్నింటిలోకన్నా ఈ సాలగ్రామదానం మిన్న. వివాహ సందర్భము లలో కన్యాదానంతో పాటు ఈ సాలగ్రామ దానమును ఇచ్చుట మంచి సంప్రదాయం.

4. సాలగ్రామ పూజకు ఎప్పుడూ సమసంఖ్య ఉండాలి. బేసి సంఖ్యలో పూజించరాదు. ఒకసాలగ్రామమును పూజించవచ్చు. ఎందుకంటే ఒకటి బేసి సంఖ్య. రెండు సాలగ్రామములను పూజించరాదు. ఎందుకనగా రెండు సమసంఖ్య. కావున రెండు సాలగ్రామములను పూజించరాదు. అలా పూజించినచో దుఃఖము కలుగును.

**శ్లో॥ సాలగ్రామాః సమాః పూజ్యాః విషమా న కదాచన**
**ఏకస్తు విషమో పూజ్యః సమేషు ద్వితీయం న తు॥**

అనేది ప్రమాణము.

5. కాలిపోయిన సాలగ్రామములను పూజించకూడదు.

6. సాలగ్రామము పగిలిపోయినా అందులో ఉన్న చక్రము పగలకుండా ఉన్నచో ఆ సాలగ్రామము పూజకు అర్హము. ఇందులో ఉన్న సాలగ్రామ చక్రమునకు గొప్ప మాహాత్మ్యము కలదు.

7. ఈ సాలగ్రామములను స్త్రీలు తాకటంకాని, పూజించటం కాని చేయరాదు. కనీసం సాలగ్రామాలకు గంధము, కుంకుమ, పుష్పములు వంటివి కూడా వేయరాదు.

8. సాలగ్రాము, తామ్రపాత్రము, నీరు, శంఖము, గంట, గంధము, తులసి చక్రాంకము, విష్ణునామములు ఈ తొమ్మిదిటిని కలిపి పూజ చేసి ఆ తీర్థమును స్వీకరించిన సకలములైన పాపములు నశించును.





**గణపతి సాలగ్రామములో నర్మద బాణములు**

### 9. సాలగ్రామములు మొత్తం 12 రకములు.

MOHANPUBLICATIONS.COM

1) సాలగ్రామమునకు బెజ్జం గల ముందుభాగమునే రెండు చక్రములు కనపడినా, అవి రెండు కలిసినట్లుగా ఉంటే దానిని **వాసుదేవ సాలగ్రామ** మని అంటారు. అది తెలుపురంగులో ఉంటే శ్రేష్ఠమైనది.

2) సాలగ్రామములో ఉండే చక్రము ఊర్ధ్వముఖంగా ఉంటే దానిని **ప్రద్యుమ్న సాలగ్రామము** అని అంటారు. ఈ సాలగ్రామ రంగు నీల రంగులో ఉంటే ఉత్తమము. అనేక రంధ్రములు కలిగి పొడవుగా వుంటుంది.

3) గుండ్రంగా, పసుపుపచ్చగా వున్న సాలిగ్రామాన్ని **అనిరుద్ధ సాలగ్రామము** అనింటారు. ఇది చాలా మంచిది. దీనిలో ఉన్న రంధ్రము వద్ద మూడు రేఖలుంటాయి.

4) **ఆదినారాయణ సాలగ్రామము** నల్లగా ఉంటుంది. దీనిలో గల చక్రము ఉబ్బి, రేఖ పొడవుగా ఉండి, రంధ్రముతో ఉంటుంది.

5) **హరిసాలగ్రామము** ముఖముపైన ఉన్నది. అతి సుందరమైనది. అర్థ, కామ, మోక్షాలను ప్రసాదిస్తుంది.

6) పద్మము, చక్రము, క్రింద భాగము అంతా తెల్లగా ఉండి బింబాకారంలో
ఉండి, రంధ్రము మొత్తం క్రమక్రమంగా సన్నగా ఉండిన దానిని **పరమేష్ఠి సాలగ్రామము** అంటారు.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....



7) **విష్ణుసాలగ్రామమునకు** నల్లగా ఉండి, క్రింద భాగానికి రెండు చక్రములు ఉండి, రంధ్రముపై మధ్యప్రదేశములో ఒక రేఖ ఉంటుంది.

8) కపిలవర్ణముతో, చక్రము పెద్దగా ఉండి, దీనిని **నరసింహ సాలగ్రామము** అని అంటారు. ప్రతినిత్యము బ్రహ్మచర్య దీక్షతో పూజించాలి లేకపోతే అనేక విఘ్నములు కలిగిస్తుంది.

9) **ఆది వరాహశక్తి సాలగ్రామమనగా** అది ఇంద్రనీలరంగు కలిగి, వెడల్పైన రేఖలు, చక్రములు, పైన క్రింద సమముగా ఉండి విషయముగా ఉండునది. కొంచెం వంగి ఉంటుంది.

10) బంగారు రంగుతో పొడవుగా ఉండి, మూడు బిందువులతో కూడిన దానిని **మత్స్యమూర్తి సాలగ్రామము** అని అంటారు. ఈ సాలగ్రామము భక్తిని, ముక్తిని ప్రసాదిస్తుంది.

11) **కూర్మసాలగ్రామమనగా** వెనుకభాగము కొంచెం ఎత్తుగా ఉండి, పసుపుపచ్చరంగు కలిగి కౌస్తుభ చిహ్నములు కలిగి ఉంటుంది.

12) **హయగ్రీవ సాలగ్రామము**నకు ఐదురేఖలు, అనేక బిందువులు, గుఱ్ఱము యొక్క ఆకారము కలిగి ఉంటుంది.

ఇవియేగాక ఈ క్రింద ఇవ్వబడిన **ఇంకా 12 రకముల సాలగ్రామములు కూడా కలవు.**

1) సాలగ్రామములో గల చక్రంలో చీలినట్లుగా ఉండే గీత నుంచి ఒక చక్రము, ఒక ధ్వజము, రంధ్రము వద్ద రేఖ కలిగి గురివిందవలే ఉండేది **వైకుంఠమూర్తి**

2) వనమాల, మాల గుర్తు ఉండి కదంబ పుష్ప ఆకారముతో, ఐదు రేఖలు ఉంటే అది **శ్రీధరమూర్తి.**

3) **వామనమూర్తి** సాలగ్రామమునకు గుండ్రంగా ఉండి, అగసిపూవువన్నె కలిగి, ఒక బిందువు వుంటుంది.

4) నల్లగా, మెరుస్తూ ఉండి ఎడమ భాగంలో గదా, చక్రములు, కుడి భాగమున రేఖయు కలిగి ఉంటుంది. దీనిని **సుదర్శనమూర్తి** సాలగ్రామము అని అంటారు.

5) లావుగా ఉండి, చక్రము మధ్యను కలిగి రంధ్రపు నోటియందు పసుపుగా ఉండి పసుపు రేఖలు కలిగి ఉంటే అది **దామోదర మూర్తి.**

6) **అనంతమూర్తి** సాలగ్రామము అనేక రంగులతో కూడియుండి, పడగలు, క్రిములు కన్పిస్తూ అనేక మూర్తులు కలిగి ఉంటారు. సకల కోరికలు తీర్చు నట్టిది.



7) ఒక సాలగ్రామములో అనేక ముఖములు కలిగి, దిక్కుల తేడా లేకుండా అన్ని ప్రక్కలందు ముఖములను కలిగి ఉండేది **పురుషోత్తమ మూర్తి.** భక్తిని, ముక్తిని ప్రసాదిస్తుంది.

8) సాలగ్రామ పై భాగములో లింగము కలిగిఉంటే అది **యోగీశ్వరమూర్తి.** ఇది బ్రహ్మహత్యా పాతకమును తొలగిస్తుంది.

9) శంఖువు, చక్రములతో కూడివుండి, ఎఱ్ఱగా ఉండే సాలగ్రామము **పద్మనాభ సాలగ్రామము.** దీనిని పూజించిన దరిద్రుడు కూడా కుబేరుడుగా మారతాడు.

10) చక్రాకారముతో ఉండి బంగారువన్నెగల కాంతితో ఉండి అనేక మృదువైన రేఖలను కలిగి ఉండిన అది **శ్రీ కృష్ణ సాలగ్రామము.** ఎప్పుడూ సిద్ధినిస్తుంది.

11) **తెల్లగా ఉండే సాలగ్రామము పాపమును నశింపచేస్తుంది. పసుపుపచ్చగా ఉండే సాలగ్రామము పుత్రులను ప్రసాదిస్తుంది. నీలివన్నె రంగు గల సాల గ్రామము సంపదను ఇచ్చును. ఎఱ్ఱగా ఉండే సాలగ్రామము రోగములను కలుగజేయును. నల్లగా ఉండే సాలగ్రామము మరణములను కలిగిస్తుంది. బూడిదరంగులో ఉండే సాలిగ్రామము పుత్రులను నాశనము చేస్తుంది. కఠినముగా ఉండి మనసుకు ఆందోళనను కలిగిస్తుంది. పగిలిన సాల గ్రామము భార్యా మృతిని,అర్ధచంద్రాకృతిలో ఉన్న సాలగ్రామము పూజకు పనికిరావు.**

12) ఒక చక్రము కలిగిన **సుదర్శనస్వామి** రెండు చక్రములు కలిగిన **లక్ష్మీ నారాయణస్వామి.** మూడుచక్రములున్న **అచ్యుతుడు,**నాల్గుచక్రములు కలిగిన **జనార్ధనుడు.** ఐదు చక్రములు కలిగిన **వాసుదేవస్వామి,** ఆరు చక్రములున్న **ప్రద్యుమ్నస్వామి,** ఏడు చక్రములు కలిగిన **సంకర్షణమూర్తి స్వామి,** ఎనిమిది చక్రములున్న **పురుషోత్తమస్వామి,** తొమ్మిది చక్రములు కలిగిన దానిని **నవ వ్యూహము** పది చక్రములు కలిగిన దానిని **దశావతారము,** పదకొండు ఉన్నచో అది **అనిరుద్ధ సాలగ్రామము.** పండ్రెండు ఉన్నచో దానిని **ద్వాదశాత్మ కుడు.** వీనికంటే ఎక్కువ చక్రములు ఉంటే దానిని **అనంతమూర్తి సాల గ్రామము** అని అంటారు. సాలగ్రామములను తీసుకునేటప్పుడు వీటియందు అనుభవము కలిగిన వారికి చూపించి అవి పూజకు అర్హమైనవో, కావో తెలుసుకుని పూజించటం చాలా మంచిది.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





పుష్ప అలంకరణతో శ్రీ విష్ణువు

MOHANPUBLICATIONS.COM

## సాలగ్రామ పూజయందు గుర్తుంచుకోవలసిన నియమాలు

1) సంధ్యావందనం అయిన తరువాత గురువునకు నమస్కారం చేసి, ఆ తరువాత దేవతలకు అర్చన చేయవలెను.

2. అర్చనకు ఉపయోగించేటువంటి నీరు తెల్లని గుడ్డతో వడపోసిన, శుభ్రమైన మంచినీటినే ఉపయోగించాలి.

3. రాగిపళ్ళెములు, రాగిపాత్రలు, రాగిగ్లాసులు, కంచు, ఇత్తడి వీటిలో ఏ పాత్రలనైనా ఉపయోగించుట మంచిది.

4. దేవుని పూజకు ఉపయోగించు పాత్రలు, ఉద్దరిణెలు, పళ్ళెములు, గ్లాసులు, గరిటెలు మొదలైన వస్తువులు ఇతర అవసరములకు వాడరాదు.

5. దేవునికి పూజ చేసేటప్పుడు తడిబట్టలతో చేయరాదు.

6. దేవుని పూజలో విధిగా ఉండి పూజచేయవలసిన ప్రధాన మూర్తులు : విష్ణుపాదము, లక్ష్మీనారాయణుల ప్రతిమలు, శంఖము, సుదర్శనము, సాలగ్రామము, గంట, గరుడ, శేష ప్రతిమలు, గురుబృందా వనము మొదలగునవి.

7. అర్చన సమయములో ప్రధాన విగ్రహముల యొక్క భేదమును ఉంచి మంటపముపై ఉంచి పూజ చేయవలెను.

8. సాలగ్రామములకు అభిషేకము చేసేటప్పుడు ఒక ప్రత్యేకమైన పాత్రలో నీరు, శంఖము, లక్ష్మీనారాయణుల ప్రతిమ, మిగిలిన దేవతలకు అభిషేకం చేసే టప్పుడు వేరే పాత్రలో ఉండేజలము, గంధము, (పచ్చ కర్పూరము, కర్పూరం, గంధము, యింకా పునుగు, జవ్వాజి మొదలైన సుగంధపరిమళ ద్రవ్యములతో కూడిన నీరు) వేరొక చిన్న పాత్రలో, కలశ జలమును వేరొక పాత్రలో ఉంచవలెను. ఆచమనం, ప్రోక్ష్యం, చేతులు కడుగుకొనుటప్పుడు కావలసిన నీరు వేరొక గ్లాసులో నీటిలో ఉంచుకోవాలి.

9. కలశములోని నీటిని తులసిదళమును వేసి శాస్త్రోక్తముగా పూజ చేయ వలెను. పూజకు ముందుగా నీటిలో గంధమును కొద్దిగా వేయాలి.

కలశపాత్రకు, గంధముపూసి బొట్టును పెట్టి అలంకరించాలి.

10. దేవుని పూజకు ఉపయోగించు శంఖమునకు మొదట వెండికట్టుతో ఉండి, చివరన ముత్యము, లేక పగడము బంగారముతో చేసినటువంటి చిన్న బంతులు వ్రేలాడదీసి, ఆ శంఖము నిండా శుభ్రమైన నీటితో నింపి ఆ శంఖములోని నీటిని కొననుండి పోస్తూ సాలగ్రామమునకు అభిషేకము చేయవలెను. ఇలా చేయటానికి శక్తిలేనివారు శంఖములను ఉపయోగించేటప్పుడు నీటిని కొననుండి పోయకూడదు. అలా పోసిన నీరు రక్తముతో సమానము. శంఖమునకు ప్రక్కగా ఉండే మూతి నుండి నీటిని పోస్తూ అభిషేకము చేయాలి.

11. సాలగ్రామములకు నిత్యం పూజ అభిషేకంపూర్తి అయిన తరువాత వాటిని శుభ్రమైన తెల్లటి గుడ్డతో తుడవాలి. ఈ వస్త్రమును దేనికోసం ఉపయోగించ రాదు. ఈ తెల్లటి గుడ్డను ప్రతిరోజూ ఉతికి ఆరవేయాలి.

12. సాలగ్రామమునకు దీపారాధనకు, ఆజ్య హారతికి వేరు వేరు ప్రమిదలలో ఏర్పాటు చేసుకోవాలి.

13. పువ్వులు, అక్షతలు (బొట్టుకు ఉపయోగించేది) తులసిదళములు, అగరు వత్తులు, కర్పూరము, దశాంగము, పండ్లు, కొబ్బరికాయ, గంధము, తాంబూలము, వస్త్రం యజ్ఞోపవీతం (అప్పటికప్పుడు ప్రత్తితో చేసినవి) సిద్దంగా ఉంచుకోవాలి. పూజ చేసేటప్పుడు తులసీదళములు, పువ్వులు, ఆవునేయి, ఆవుపాలతో గాని బియ్యముతో కుంకుమను కలిపి తయారుచేసిన అక్షింతలను ఉపయోగించవలెను.

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

14. సాలగ్రామాలను వేరుగా హరివాణము లేక అభిషేకము చేయునటు వంటి ఒక పళ్ళెములో ఉంచి కొంచెం ఎత్తులో ఉంచి అంటే మిగిలినవిగ్రహములు, ప్రతిమలు ఉంచి పళ్ళెముకంటే ఎత్తులో ఉంచాలి. లక్ష్మీనారాయణుల ప్రతిమలు, శంఖము, ముఖ్యమైన ప్రాణ ప్రతిష్ఠచేసిన ప్రతిమ లేక విగ్రహాలను ఒకపళ్ళెములో ఉంచాలి. వేరొక పళ్ళెములో గరుడ, శేష, గురు బృందావనము, గంటను ఉంచి అభిషేకమును, పూజను చేయవలెను.

15. తులసిదళములు లేని విష్ణుపూజ వ్యర్థము. అందుకని తులసీ దళములను ప్రత్యేక శ్రద్ధతో కోయవలెను. ఇలా కోసేటప్పుడు ముఖ్యమైన జాగ్రత్తలు తీసుకోవలెను.

1) స్త్రీలు తులసీదళములను తులసి మొక్కనుండి కోయరాదు. ఇంటిలో ఉన్న తులసికోటలో తులసీదళములు కోయరాదు.

2) కొనగోటితో తులసిదళములను కోయరాదు.

3) స్నానముచేయకుండా తులసిదళములను కోయరాదు.

4. మంగళవారము, శుక్రవారము, ఆదివారములప్పుడు మరియు పూర్ణిమ, అమావాస్య, ద్వాదశి తిథులందు తులసీదళములను కోయరాదు.

5. ప్రొద్దున సమయములోనే తులసీదళములను కోయవలెను. మధ్యాహ్న సమయములో తులసీదళములను కోయరాదు. తులసీదళము లను వట్టిచేతులతో కాని, వస్త్రములోకాని, ఆకులోకాని తులసీదళములను తీసుకు రాకూడదు. తులసీ దళములను నీటితో కడగకూడదు.

6) నిత్యం పూజ చేసేటప్పుడు ఏ ఒక్క రోజులోనయినా తులసీదళ ములు దొరక నప్పుడు ముందురోజున చేసిన తులసీదళములను శంఖము లోని నీటితో ప్రోక్షణ చేసిన వానిని తిరిగి పూజకు ఉపయోగించవచ్చును.

7) శంఖమును శుద్ధమైన నీటితో నింపవలసివచ్చినచో నీటిలో ముంచ కూడదు. ఉద్ధరిణెతో నీటిని పోస్తూ శంఖమును నింపాలి.

8) శంఖములలోని నీటితో సాలగ్రామములను, లక్ష్మీనారాయణ విగ్రహ ములు తప్ప మరి ఏ యితర దేవతలను అభిషేకించరాదు.

9) సాలగ్రామాలను అభిషేకం చేసేటప్పుడు ధూపము, దీపము, నైవేద్యము, మంగళహారతి సమర్పించి, గంటానాదము చేయవలెను. ఇతర దేవతలకు పూజ చేసేటప్పుడు అభిషేకము, గంటనాదము అవసరం లేదు.



10) శంఖము లక్ష్మీ స్వరూపము. దీనిని ఎల్లవేళలా పీఠముపై ఉంచాలి. అంతేకాని ఎప్పుడూ నేలపైన పెట్టకూడదు.

11) దేవతలకు నైవేద్యమును సమర్పించునప్పుడు శంఖములోని నీటిని వాటిపై చల్లకూడదు. శంఖములోని నీటిని కుడిచేతిలో పోసుకుని దేవతలకు నైవేద్యమును సమర్పించవలెను.

12. సాలగ్రామమునకు అభిషేకము చేసి ఆ తీర్థమును స్వీకరించే వరకు ఏ విధమైనటువంటి త్రాగకూడదు, తినకూడదు.

13. నైవేద్య పదార్థములు సమర్పించేటప్పుడు పైన తులసీదళములు వేసి సమర్పించాలి. పాలలో ఈ తులసీదళములు వేయకూడదు.



పూజలో అలంకరణ సాలగ్రామములు

## సాలగ్రామ దేవతార్చన పద్ధతి

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే॥

### ద్వారపాలకుల ప్రార్థన

పూర్వద్వారే : ద్వారశ్రియై నమః జయాయ నమః విజయాయ నమః
దక్షిణద్వారే : ద్వారశ్రియై నమః బలాయ నమః ప్రబలాయ నమః
పశ్చిమద్వారే : ద్వారశ్రియై నమః నందాయ నమః సునందాయ నమః
ఉత్తరద్వారే : ద్వారశ్రియై నమః కుముదాయ నమః కుముదాక్షాయ నమః

MOHANPUBLICATIONS.COM

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





**దేవతా తారతమ్య స్తోత్రం**

**వందే విష్ణుం నమామి శ్రీ యమధచ భువం**
**బ్రహ్మ వాయూ చ వందే గాయత్రీం భారతీం**
**తామపి గరుడమనంతం భజే రుద్రదేవం**
**దేవీం వందే సువర్ణీం అహిపతి దయితాం**
**వారుణీ మాప్య మాంతాం ఇంద్రాదీన్ కామ ముఖ్యాన్**
**అపి సకల సురాన్ తద్గురూన్ మద్గురూంశ్చ॥**

ఈ క్రింది మంత్రమును పఠించుతూ దీపమును వెలిగించాలి.

**ఓం అగ్నినాగ్నిః సమిధ్యతే। కవిర్గృహపతిర్యువాహవ్య వాట్జుహ్వాస్యః॥**
**ఇతి దీపం ప్రజ్వాల్య ॥**

**అగమార్థందు దేవానాం। గమనార్థంతు రక్షసాం॥కురు ఘంటారవం తత్ర। దేవతాహ్వాన లాంఛనమ్॥** ఇతి ఘంటానాదం కృత్వా.

ఈ శ్లోకము లన్నింటిని చదువుతూ దేవుని పెట్టెలో గల సాలగ్రామ ములను, మరియు విగ్రహములను హరివారణములో ఉంచాలి. తరువాత క్రిందటి రోజున పూజించిన గంథ పుష్పాదులను తీసి ఈ క్రింద శ్లోకముతో సాలగ్రామమును, విగ్రహములను శుభ్రం చేయాలి.

**నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి।**
**తన్నో విష్ణుః ప్రచోదయాత్, సాలగ్రామ శిలాయాంతు॥**
**నిత్యం సన్నిహితః కలిః। భీమసేన మహాబాహూ।**
గదయాగనోదనం కురు। ద్రౌపదీ రమణ భీమసేన మహాబాహో॥

**సంకల్పం :**

ఓం కేశవాయ స్వాహా ఓం నారాయణాయస్వాహా ఓం మాధవాయ స్వాహా అని ఆచనము చేయాలి. ఓం గోవిదాయనమః ఓం విష్ణవేనమః ఓం మధుసూదనాయ నమః ఓం త్రివిక్రమాయనమః ఓం వామనాయనమః ఓం శ్రీధరాయనమః ఓం హృషీకేశాయ నమః ఓం పద్మనాభాయనమః ఓం దామోదరాయ నమః ఓం సంకర్షణాయ నమః ఓం వాసుదేవాయ నమః ఓం ప్రద్యుమ్నాయ నమః ఓం అనిరుద్ధాయ నమః ఓం పురుషోత్త మాయ నమః ఓం అధోక్షజాయ నమః ఓం నారసింహాయ నమః ఓం అచ్యుతాయనమః ఓం జనార్ధనాయ నమః ఓం ఉపేంద్రాయ నమః ఓం హరయే నమః ఓం శ్రీ కృష్ణాయనమః



ఓం ప్రాణనాయమమ్యః (ప్రాణాయామము చేయవలెను) ఓం భూః ఓం భువః ఓగ్ం సువః ఓం మహః ఓంజనః ఓంతపః ఓగ్ం సత్యం ఓం తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ ఓమాపోజ్యోతీ రసోఽ మృతం బ్రహ్మభూర్భువస్సువరోమ్॥

**సంకల్పం**

శ్రీ గోవింద గోవింద శ్రీ మహావిష్ణోరాజ్ఞాయా ప్రవర్తమానస్య అధ్య బ్రాహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహ కల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే దండకారణ్యే కృష్ణా/ గోదావర్యాః కావేర్యోర్మధ్యదేశే (గోదావరి నదికి ఉత్తరమున నున్నవారు గోదావర్యాః ఉత్తరేకూలే) అని చెప్పవలెను.

శాలివాహనశకే బౌద్ధావతారే రామక్షేత్రే అస్మిన్ వర్తమానస్య వ్యవహారిక చాంద్రమానేన......సంవత్సరే ...దక్షిణాయనే/ ఉత్తరాయణే.... ఋతౌ.... మాసే...పక్షే...తిథౌ....మాసే.... ...పక్షే........తిథౌ............. వాసరే......... శుభనక్షత్రే శుభయోగే శుభకరణే ఏవంగుణ విశేషణ విశిష్ఠాయాం శుభతిథౌ సాలగ్రామ ప్రీత్యర్థం భగవతో, సాలగ్రామంతర్గత ముఖ్య ప్రాణాంతర్గత శ్రీ వాసుదేవస్య ప్రీత్యర్థం నిర్మాల్య విసర్జనాది శ్రీ వాసుదేవస్య పూజాం కరిష్యే॥

అని సంకల్పమును చెప్పి ఉద్దరిణెతో నీటిని తీసుకుని కుడిచేతిలో వేసుకుని పళ్ళెంలో వదలాలి.

శంఖములో గల తులసీదళమును పెట్టి అందులో నీటిని వేసి ఈ క్రింది శ్లోకమును చదువుతూ సాలగ్రామములకు అభిషేకాన్ని చేయాలి. అలా చేసినచోఈ తీర్థము దోషరహితమైనది.

**అంభ్రణీసూక్తము :** అహం రుద్రేభర్వసు భిశ్చరామ్యహ మాదిత్యై ఋత విశ్వదేవైః॥ అహం మిత్రా వరుణో భాబి భర్మ్యహ మింద్రాగ్నీ అహమశ్వినోభా అహం స ఓమమాహనం సంబి భర్మ్యహం త్వష్టారముత పూషణం భగం మహినా సంభభూవ॥

చదివిన తరువాత శంఖమును ఒక పళ్ళెంలో ఉంచి ఉద్దరణితో శుద్ధమైన నీటిని తీసుకుని నిర్మాల్యోభిషేకముతో శ్రీ సూక్తమును చదువుతూ అభిషేకము చేయాలి.

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

## శంఖాభిషేకము

**శ్రీసూక్తము :** ఓం హిరణ్య వర్ణాం హరిణీం సువర్ణ రజతస్రజాం చంద్రాం హిరణ్మయీం లక్ష్మీం జాతవేదో మమావహ.........................!!

శంఖమును అభిషేకించేటప్పుడు ఆంజనేయస్వామికి మన్యుసూక్తముతో గాని, వాయుసూక్తముతోగాని ఏదైనా రెండు లేక మూడు మంత్రములు చదువుతూ అభిషేకమును చేయాలి.

## ఆంజనేయాభిషేకము

మన్యుసూక్తంః ఓం యస్తే మన్యో విధద్వ జ్రసాయక సహ ఓజః పుష్యతి విశ్వమానుషక్ స్వాహా మదాస సూర్యం త్వం యాయుజా సహస్కృతేన సహసా సహస్వతా........ అవనిలయంతాం॥

**బలిత్థాసూక్తం** : బలిత్థా తద్వపుషేదాయి దర్శితం దేవస్య భర్గో స్వహ సోయతోజని........ సుధావతే॥ అవకాశమును బట్టి మన్యుసూక్తము, చదువుతూ ఆంజనేయునికి అభిషేకము చేయవచ్చును.

## గరుడనకు అభిషేకము :

తత్పురుషాయ విద్మహే, సువర్ణపక్షాయ ధీమహి తన్నో గరుడః ప్రచోదయాత్॥ (గరుడ ప్రతిమకు ఈ పైన గల మంత్రముతో అభిషేకము చేయాలి). రుద్రునకు అభిషేకము

**త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనం**
**ఉర్వారుక మివ బంధనాత్ మృత్యోర్ ముక్షీయ మామృతాత్**




**అంబికా సాలగ్రామములో నర్మద బాణములు**



ఈ శ్లోకమును చదువుతూ రుద్రునకు అభిషేకమొనరింపవలెను.

సాలగ్రామములను అభిషేకించిన నీటిని ఒక పాత్రలోనికి తీసుకుని, ఆ తీర్థమును శంఖము, ముఖ్యప్రాణమూర్తి అయిన ఆంజనేయస్వామి, గరుడ, శేషస్వామికి ఉద్ధరిణెతో వేయాలి. మిగిలిన అభిషేక తీర్థమును పైన జల్లుకుని మూడుసార్లు తీసుకోవాలి. మిగిలిన వారికి కూడా ఇవ్వాలి. మిగిలిన తీర్థమేమైనా ఉంటే పళ్లెములో వుంచవలెను.

## దేవపూజా సంకల్పము

ఆచమ్యః ఓం కేశవాయస్వాహా। ఓం నారాయణాయస్వాహా,ఓం మాధవాయస్వాహా, గోవిందాయనమః............. శ్రీ కృష్ణాయనమః॥ ప్రాణయామ్య.

ఓం భూః ఓం భువః............. భూర్భువస్వరోమ్॥ శ్రీ గోవింద గోవింద శ్రీ మహావిష్ణోరాజ్ఞాయ ప్రవర్తమానస్య........ శుభతిథౌః శ్రీ భారతీరమణ ముఖ్య ప్రాణాంతర్గత శ్రీ లక్ష్మీనారాయణ ప్రేరణయా లక్ష్మీనారాయణ ప్రీత్యర్థం భగవతోబలేన భగవతోవీర్యేణ భగవస్తే జసా భగవతః కర్మాణా భగవతః కర్మాణా భతవతః ప్రీత్యైః తంత్రసారోక్తప్రకారేణ భారతీరమణ ముఖ్య ప్రాణాంతర్గత శ్రీలక్ష్మీనారాయణస్య యథాశక్తి ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కరిష్యే॥

అని మంత్రాన్ని చదివి, దేశము, మరియు కాలములను ఉచ్చరించి సంకల్పమును చెప్పి ఉద్దరిణతో నీటిని కుడిచేతిలో తీసుకుని ఒక పళ్ళెములో వదలాలి.

### కలశపూజ

తదంగ కలశపూజాం కరిష్యే॥ అని మరల చెప్పి నీటిని పళ్ళెంలో వదలాలి. కలశము నిండా తీర్థమును నింపి కలశమునకు గంధము, బొట్టు పెట్టి అందులో ఒక తులసిదళమును వేసి చేతిముద్రలను ఒకసారి చూపించాలి. తరువాత ఈ క్రింది మంత్రమును చదవాలి.

**నిర్విషీకరణార్థం తార్క్ష్యముద్రాం ప్రదర్శ్య।**
**అమృతీకరణార్థం ధేనుముద్రాం ప్రదర్శ్య।**
**పవిత్రీకరణార్థం శంఖముద్రాం ప్రదర్శ్య।**
**దిగ్బంధనార్థం గదాముద్రం ప్రదర్శ్య।**
**సంరక్షణార్థం చక్రముద్రాం ప్రదర్శ్య।**

MOHANPUBLICATIONS.COM

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





మూలమంత్రాన్ని పఠించి కలశముపై కుడి చేయి ఉండి **"ఓం నమో నారాయణాయ"** అని ఎనిమిదిసార్లు పఠించి "కలశం స్పృష్ట్వా" అనాలి.

కలశ్యస్యముఖే విష్ణుః కంఠే రుద్రః స్సమాశ్రితః। మూలే తత్ర స్థితో బ్రహ్మా మధ్యేమాతృగణాస్మృతాః॥ కుక్షౌతు సాగరాస్సర్వే, సప్తద్వీపా వసుంధరా। ఋగ్వేదోఽథ యజుర్వేద స్సామవేదోహ్యధర్వణః। అంగైశ్చ సహితా స్సర్వే కలశంతు సమాశ్రితాః అత్రగాయత్రీ సావిత్రీ సరస్వతీ శాంతిపుష్టి కరీతథా'

గంగేచ యమునే చైవ కృష్ణా గోదావరీ సరస్వతీ నర్మదే సింధు కావేరీ జలే స్మిన్ సన్నిధిం కురు॥ ఆయాంతు కలశపూజార్థం అభిషేకార్థ మాదరాత్। ఓం నమోనారాయణాయ। మూలమంత్ర మష్టవారం జపేత్।

"కలశస్యముఖే" నుండి "అభిషేకార్థమాదరాత్" వరకు మంత్రాన్ని పఠించుతూ కలశపాత్రను పువ్వులు, అక్షింతలతో పూజించాలి. ఆ తరువాత కలశపాత్రపై కుడిచేయి ఉంచి అష్టాక్షరీ మంత్రాన్ని కూడా 8సార్లు పఠించాలి. ఇలా అభిమంత్రించిన తరువాత కలశోదకముతో శంఖాన్ని నింపి, శంఖమునకు గంధమును పెట్టి ఒక తులసీదళము కూడా శంఖముపై ఉంచి దానిపై కుడి చేయి ఉంచి ఈ క్రింది శ్లోకముతో ధ్యానించాలి.

**శంఖధ్యానం**

**శ్లో॥ శంఖం చంద్రార్క దైవత్వం మధ్యే వరుణదైవతం**
**పృష్ఠే ప్రజాపతిం వింద్యా దగ్రే గంగాం సరస్వతీం।**
**త్రైలోక్య యాని తీర్థాని వాసుదేవస్య చాజ్ఞయా**
**శంఖే తిష్ఠంతి విపేంద్ర తస్మాఛ్ఛంకం ప్రపూజయేత్॥**

**శ్లో॥ త్వం పురా సాగరోత్పన్నో విష్ణునావిధృతః కరే**
**సమితః స్సర్వదేవైశ్చ పాంచజన్య నమోస్తుతే॥**

ఇతి శంఖం ప్రార్థన

**ఓం నమో నారాయణాయ అని జపించి**

**శంఖోదకేన పూజాసాధనాని ఆత్మానంచ ప్రోక్ష్యా**

అని తనమీద, పూజా ద్రవ్యములపై శంఖములోని నీటిని కుడిచేతిలోకి తీసుకుని ప్రక్షాళన చేయవలెను. ఆ తరువాత సాలగ్రామములకు అభిషేకమును నీటితో నింపిన శంఖముతో చేయాలి.






**పెద్ద సాలగ్రామములు**

MOHANPUBLICATIONS.COM

## సాలగ్రామములకు అభిషేకము

శుద్ధమైన నీటితో శంఖమును నింపి ఆ జలమును అభిషేకాన్ని ప్రారంభించాలి.

ఓం నమో నారాయణాయ శ్రీ లక్ష్మీనారాయణాయనమః
హస్తయో అర్ఘ్యం సమర్పయామి. పాదయో పాద్యం సమర్పయామి
ముఖే ఆచమనీయం సమర్పయామి తతః పంచామృతం స్నానం కారయేత్॥

**పంచామృత స్నానం**

పంచామృతం అంటే ఆవుపాలు, ఆవునెయ్యి,ఆవుపెరుగు, తేనె, పటికబెల్లం : వీటిని కలిపిన దీనిని పంచామృతము అని అంటారు. వీటన్నిటిని సమానముగా తీసుకుని సూక్తములతో చేయవలెను. ఇవిలేనపుడు శుద్ధమైన నీటితో "పంచామృతాభిషేకార్థం శుద్ధోదకం సమర్పయామి" అని అభిషేకాన్ని చేసుకోవచ్చును.

1. ఓం అప్యాయస్వాహా .... (అథపయాస్సూక్తమ్)
2. ఓం దధిక్రావ్ణో .... (అథ దధిసూక్తమ్)
3. ఓం ఘృత మిమిక్షేత .... (అథ ఘృతసూక్తమ్)
4. ఓం మధువాతేతి .... (ఓం మధుస్సూక్తమ్)

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





5. ఓం స్వాదుః పవస్వేతి .... (అథ శర్కరాసూక్తమ్)

అని చదివి శ్రీ లక్ష్మీనారాయణనమః పంచామృత అభిషేకం సమర్పయామి.

ఫలోదక స్నానం

## నారికేళ జలాభిషేకము

**శ్లో॥ యాః ఫలనీర్యాఫలా పుష్పాయాశ్చ పుష్పిణీః।**
**బృహస్పతి ప్రసూతాస్తానో ముంచస్త్వగ్ం హసః॥**

శ్రీ లక్ష్మీ నారాయణాయనమః ఫలాభిషేకం సమర్పయామి.

## మహాభిషేకము

పురుషసూక్తమును పఠించుతూ శుద్ధమైన నీటితో అభిషేకమును చేస్తూ, కలశములోని నీటిని ఉద్ధరిణెతో శంఖములో పోసి గంటను వాయిస్తూ శంఖముతో అభిషేకాన్ని చేయాలి. చివరగా గంధోదకముతో గంధం పాత్రలో అభిషేకము చేయవలెను.

**గంధోదకము :** ఒక చిన్న పాత్రలో గంధము, పచ్చకర్పూరము, కర్పూరము, కుంకుమపువ్వు, పునుగు, జవ్వాజి మొదలైన సుగంధ పరిమళ ద్రవ్యములు కలిపి వాటితో నీటిని కూడా జతచేస్తే దానిని గంధోదకము అని అంటారు.

ఓం తచ్ఛం యోరావృణీమహే। గాతుం యజ్ఞాయ। గాతుం యజ్ఞపతయే। దైవీ స్వస్తిరస్తునః। స్వస్తిర్మానుషేభ్యః। ఊర్ధ్వం జిగాతు భేషజం। శన్నో అస్తు ద్విపదే శం చతుష్పదే॥

ఓం శ్శాంతిః శ్శాంతిః శ్శాంతిః॥

సహస్ర శీర్షాపురుషః సహస్రాక్షః సహస్రపాత్ స భూమిం విశ్వతో వృత్వా అత్య తిష్టద్దశాం గులమ్ పురుష ఏవేదగ్ం సర్వమ్ యద్భూతం యచ్చ భవ్యమ్ ఉతామృతత్వ స్యేశానః యదన్నే నాతిరోహతి ఏతావానస్య మహిమా అతోజ్యాయాగ్ంశ్చ పూరుషః॥

శ్రీ లక్ష్మీనారాయణాయనమః శుద్ధోదక స్నానం సమర్పయామి.

వీలైనచో పురుషసూక్తమును పూర్తిగా చదువుతూ గంటను వాయించుతూ సాలగ్రామములకు అభిషేకమును చేయాలి.



## గంధోధక స్నానము

**ఓం తచ్ఛం యోరావృణీమహే।గాతుం యజ్ఞాయ**
**గాతుం యజ్ఞపతయే। దైవీ స్వస్తిరస్తునః**
**స్వస్తిర్మానుషేభ్యః ఊర్ధ్వం జిగాతు భేషజం।**
**శన్నో అస్తు ద్విపదే శంచతుష్పదే॥**
**ఓం శ్శాంతిః శ్శాంతిః శ్శాంతిః॥**

శ్రీ లక్ష్మీనారాయణాయ నమః గంధోదక స్నానం సమర్పయామి। శుద్ధోదక స్నానం సమర్పయామి। స్నానాంతరం ఆచమనీయం సమర్పయామి అని ఉద్ధరిణెతో నీటిని పళ్ళెంలో వదలాలి.

సాలగ్రామమునకు అభిషేకము పూర్తి అయిన తరువాత వేరొక పాత్రను తీసుకొని అందులో తులసీదళములను ఉంచాలి. దీనిని సాలగ్రామ తీర్థము అని అంటారు. పూజ అయిన తరువాత సాలగ్రామమును శుభ్రమైన తెల్లటి గుడ్డతో తుడిచి యధాస్థానంలో ఉంచాలి.

### వస్త్రం

**అభివస్త్రా సువసనాన్య రుషాభిధేనో సుముఖాః పూజమానాః అభిచంద్రో వర్తమానో హిరణ్య భ్యస్యాం రథినోదేవసోమా**
**శ్రీ లక్ష్మీనారాయణాయ నమః వస్త్రం సమర్పయామి.**

### యజ్ఞోపవీతము

**యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ అయుష్యమగ్ర్యం ప్రతిముంచ శుభ్రమ్ యజ్ఞోపవీతం బలమస్తు తేజః**

శ్రీ లక్ష్మీనారాయణాయనమః యజ్ఞోపవీతం సమర్పయామి.

### శ్రీ గంధం

**గంధద్వారాం దురాదర్షాం నిత్య పుష్టాం**
**కరీషిణీమ్ ఈశ్వరీగ్ం సర్వభూతానాం త్వామి హోపహ్వయే శ్రియం**

శ్రీ లక్ష్మీనారాయణాయనమః శ్రీ గంధం సమర్పయామి.

### అక్షతలు

**అయనేతే పరాయనే దూర్వారోహంతు పుష్పిణీః।**
**హ్రదాశ్చ పుండరీకాణి సముద్రశ్చ గృహా ఇమే॥**

శ్రీ లక్ష్మీనారాయణాయనమః అక్షతాన్ సమర్పయామి.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





బొట్టుకు సిద్ధం చేసుకున్న ద్రవ్యమును సమర్పించాలి.

**ఆభరణములు**

కౌస్తుభ రత్నమాలాధ్యాభరణాని సమర్పయామి, తులసీదళం సమర్ప యామి తులసీదళమును సాలగ్రామముపై ఉంచాలి.

**పూజ**

కేశవనామములు, విష్ణు అష్టోత్తరము లేక శత సహస్రనామములు చదువుతూ శక్తికి తగినటువంటి తులసీదళములు, అక్షతలు, పువ్వులతో పూజించాలి.

**ధూపం**

**వనస్పత్యుద్భవో దివ్యో సుగంధాఢ్య సుమనోహరః॥**
**ఆఘ్రేయస్సర్వ దేవనాం ధూపోయం ప్రతిగృహ్యతాం॥**

శ్రీ లక్ష్మీనారాయణాయ నమః ధూపమాఘ్రాపయామి అగరువత్తులు వెలిగించి ధూపమును సమర్పించాలి.

**ఏకార్తిదీపం (ఆజ్యహారతి)**

మూడు వత్తులను నేతిలో తడిపి వేరే ప్రమిదలో సిద్ధముగా ఉంచుకుని దానిని వెలిగించి హారతి ఈయవలెను. ఈ క్రింది మంత్రమును చదువుతూ, గంట వాయిస్తూ హారతి ఇవ్వాలి.

**శ్లో॥ సాజ్యమేకావర్తి సంయుక్తం వహ్నినా యోజితంమయా।**
**దీపం గృహాణ దేవేశ త్రైలోక్య తిమి రాపహ।**
**భక్త్యాదీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే।**
**త్రాహి మాం నరకాదోర్ఘోరా ద్దివ్యజ్యోతిర్నమోస్తుతే॥**

శ్రీ లక్ష్మీనారాయణాయనమః ఏకార్తిదీపం సమర్పయామి.

ధూపదీపానంతరం ఆచమనీయం సమర్పయామి. అని చదివి ఉద్ధరిణెతో నీటిని పళ్ళెంలోకి వదలాలి.

**నైవేద్యం**

ద్వాదశస్తోత్రములను చదివి నైవేద్యపదార్థములను స్వామికి కుడిచేతి వైపున సిద్ధంగా ఉంచాలి. పాలు తప్ప మిగిలిన పదార్థములన్నింటిని తులసీదళము ఒక్కొక్కటి వేసి అభిషేకము చేయాలి.



శంఖములోని నీటిని పోసి అందులో తులసీదళమును వుంచి " ఓం నమోనారాయణాయనమః" అని మంత్రించి ఆ నీటిని కుడిచేతిలో వేసుకుని నైవేద్య పదార్థములను ఈ మంత్రముతో చదువుతూ సంప్రోక్షించి వీలైతే ముద్రలను చూపించాలి.

ఓం భూర్భువస్వః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్ సత్యంత్వర్తేన పరిషించామి అమృతమస్తు అమృతోపస్తరణ మసి ॥స్వాహా॥ ఈ క్రింది మంత్రములను చదువుతూ నైవేద్య పదార్థములను కుడిచేతితో స్వామికి నివేదన చేయాలి.

**ఓం ప్రాణాయస్వాహా ఓం అపానాయస్వాహా**
**ఓం వ్యానాయస్వాహా ఓం ఉదానాయస్వాహా**
**ఓం సమానాయస్వాహా మధ్యే మధ్యే పానీయం**
**సమర్పయామి। ఉత్తరాపోశనం సమర్పయామి।**

హస్తౌప్రక్షాళనం సమర్పయామి ముఖౌప్రక్షాళనం సమర్పయామి.
పాదౌప్రక్షాళనం సమర్పయామి. శుద్ధ ఆచమనీయం సమర్పయామి.
అని చదువుతూ ఉద్ధరిణెతో పళ్ళెంలో నీటిని వదలవలెను.

**తాంబూలం**

పూగీఫలైశప కర్పూరై ర్నాగవల్లీ దళైర్యుతం ముక్తా చూర్ణ సమాయుక్తం తాంబూలం ప్రతి గృహ్యతాం॥ తాంబూలం సమర్పయామి.

**పునర్ధూపం (ధూపహారతి)**

ఈ దూపార్తి దేవతలకు ఇష్టమైనది. సువాసనలతో కూడి దశాంగం పొడి ఈ హారతిలో ఉంచి దీనిని నిప్పులపై ఉంచి ధూపమును సమర్పించాలి.

దీనికి ఉపయోగించిన ఒక బొగ్గును తీసి దానిని తడిపి మన నుదుట నిలువుగా దిద్దుకునే అంగారమునకు ఉపయోగించవలెను.

ఈ క్రింది మంత్రమును చదువుతూ ధూపమును ఇవ్వాలి.

**శ్లో॥ ఓం అర్చత ప్రార్చత ప్రియమేధాసో అర్చత**
**అర్చంతు పుత్రకా ఉతపురం న దృష్ణర్చత॥**

శ్రీలక్ష్మీ నారాయణాయనమః- పునర్ధూపం సమర్పయామి.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





## నీరాజనం

కర్పూర హారతిని స్వామికి సమర్పింపవలెను.

**శ్లో॥ కల్యాణాద్భుత గాత్రాయ కామితార్థ ప్రదాయినే**
**శ్రీ మద్వేంకటానాథాయ శ్రీనివాసాయ మంగళం॥**
**శ్రియః కాంతాయ కళ్యాణనిధయే నిధయేఽ ర్థినామ్**
**శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళం॥**
**మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే**
**చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్॥**

శ్రీ లక్ష్మీ నారాయణాయనమః- కర్పూరనీరాజనం సమర్పయామి. తరువాత ఆచమనీయం సమర్పయామి.

అని చదివిన తరువాత ఉద్ధరిణెతో నీటిని పళ్ళెంలో వదలవలెను.

తరువాత చేతిలో పువ్వులుతీసుకుని లేచి నిలబడి స్వామిని తలుస్తూ మంత్రపుష్పమును చదవాలి.

## మంత్రపుష్పమ్

సహస్ర శీర్షం దేవం విశ్వాక్షం విశ్వశం భువమ్

నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్ నారాయణ పరోజ్యోతిరాత్మానారాయణః పరః నారాయణ పరంబ్రహ్మతత్త్వం నారాయణః పరః నారాయణ పరోధ్యాతా ధ్యానం నారాయణః పరః యచ్చకించి జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపివా అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణః స్థితః......... రాజాధిరాజాయ ప్రసహ్యాసాహినే నమో వయం వైశ్రవణాయ కుర్మహే నమేకామాన్ కామకామాయ మహ్యం, కామేశ్వరో వైశ్రవణోదదాతు కుబేరాయ వై శ్రవణాయ మహారాజాయనమః సంసృష్టం ధనముభయం సమాకృత మస్మభ్యం దత్తాం వరుణశ్చ మన్యు భియందధానోహృదయేషు శత్రవః పరాజితాసో అవనిలయంంతా స్వస్తిశ్రీ భారతీరమణ ముఖ్యప్రాణాంతర్గత శ్రీ లక్ష్మీనారాయణయనమః సువర్ణ మంత్రపుష్పం సమర్పయామి.

అని చదువుతూ స్వామికి పువ్వులను అర్పించాలి.

## ప్రదక్షిణ నమస్కారములు

యానికానిచ పాపాని జన్మాంతర కృతానిచ తాని తాని వినశ్యంతి ప్రదక్షిణ పదే పదే పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాప సంభవః త్రాహిమాం



కృపయా కృష్ణ శరణాగతవత్సల, అన్యథాశరణం నాస్తి త్వమేవ శరణం మమ తస్మాత్కారుణ్య భావేన రక్షరక్ష జనార్ధన శ్రీ లక్ష్మీనారాయణాయనమః ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

అని చదువుకొనుచూ సాష్టాంగ ప్రణామములు చేయవలెను.

## శంఖభ్రమణమ్

ఉద్ధరిణెతో శంఖములో నీటిని నింపి ఈ మంత్రమును చదువుతూ స్వామి చుట్టూతా తిప్పి ఆ శంఖములోని నీటిని వేరే ఒక పాత్రలో ఉంచవలెను. దీనినే శంఖతీర్థము అని అంటారు. ఈ తీర్థమును మన శిరస్సుపై జల్లుకోవలెను. ఆ తరువాత సాలగ్రామతీర్థమును తీసుకోవాలి.

దృష్టిదోష పరిహారార్థం, నరచ్ఛాయాదోష పరిహారార్థాం శంఖభ్రమణం కరిష్యే॥ ఆపాద మౌళి పర్యంతః త్రివారం భ్రామయేత్॥

## శంఖమును అభిషేకించే మంత్రము

MOHANPUBLICATIONS.COM

శంఖాన్ని ఒక పళ్ళెంలో బోర్లించి ఉంచి ఈ మంత్రమును చదువుతూ ఉద్ధరిణెతో శంఖాన్ని అభిషేకించాలి.

**సక్తుమివతిత ఉనా పునంతో యత్రధీరా మనసావాచ మక్రత। అత్రా సఖాయ స్సఖ్యాని జానతే భద్రైషాం లక్ష్మీర్నిహితాధి వాచి॥**

సాలగ్రామ తీర్థాన్ని ఉద్ధరిణెతో శంఖముపైన వేసి, శుభ్రమైన వస్త్రముతో తుడిచి పళ్లెంలో ఉంచాలి. తరువాత గంధము, అక్షంతలను సమర్పించవలెను.

## గరుడుని అభిషేకించే మంత్రము

ఈ మంత్రమును చదువుతూ గరుడ ప్రతిమకు లేక విగ్రహానికి అభిషేకము చేసి సాలగ్రామ తీర్థమును ఇచ్చి, తరువాత శుభ్రమైన వస్త్రముతో తుడిచి పక్కన ఒక పళ్ళెములో ఉంచవలెను.

**సుపర్ణోస్మి గరుత్మన్ త్రివృత్తే శిరో గాయత్రం చక్షుస్తోమ ఆత్మాసామతే తనర్వామదేవ్యం బృహద్రథంతరే పక్షే యజ్ఞా యజ్ఞయం పుచ్ఛం ఛందాగ్ం స్యంగా నిధిష్టియాశ్శఫా యజూగ్ంషి నామాని సువర్ణోసి గరుత్మాన్ దివంగచ్ఛ సువర్గచ్ఛ॥**

## శేషుని అభిషేకించే మంత్రము

ఈ మంత్రమును చదువుతూ శేషునికి అభిషేకము చేసి సాలగ్రామ తీర్థమును సమర్పించి తుడిచి పళ్ళెంలో ఉంచాలి.

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





నమో అస్తు సర్పేభ్యో ఏకేచ పృథివీ చానుయే
అంతరిక్షే యే దివితేభ్యస్సర్పేభ్యోన్నమః॥

**గంటకు అభిషేకించే మంత్రము**

ఈ మంత్రమును చదువుతూ ఉద్ధరిణెతో నీటితో గంటకు అభిషేకం చేయవలెను. ఆ తరువాత సాలగ్రామ తీర్థమును ఇచ్చి శుభ్రమైన వస్త్రంతో తుడిచి పళ్ళెంలో ఉంచాలి.

**బ్రహ్మ దేవానాం ప్రథమః కవీనా మృషిర్విప్రాణాం మహిషో మృగాణాం**
**శ్యేనో గృధ్రాణాగ్ం స్వదితి ర్వణాగ్ం సోమః పవిత్రమత్యేతి రేభన్॥**

ఈ విధముగా విగ్రహములన్నింటికి లేక ప్రతిమలన్నింటికి అభిషేకము చేసినట్లుగానే మిగిలిన విగ్రహములు కాని లేక ప్రతిమలు ఉన్నచో వాటికి అభిషేకము చేసి సాలగ్రామ తీర్థమును ఇచ్చి ఆ తరువాత శుభ్రముగా తుడిచి ఒక పళ్ళెములో ఉంచవలెను.

సాలగ్రామమునకు అర్చన చేసిన విధముగా శంఖము, లక్ష్మీనారాయణ, గరుడ, శేష ప్రతిమలకు లేక మూర్తులకు పుష్పములు, అక్షంతలతో పూజలు చేయవలెను.

## నైవేద్యం

సాలగ్రామములకు సమర్పించిన ప్రసాదమును ఆ పాత్రలోనే ఉంచి రమాదేవికి అనగా శంఖము, లక్ష్మీ విగ్రహములకు వేరుగా నైవేద్యము సమర్పించవలెను.

ముఖ్యప్రాణమూర్తికి వేరుగా ఒక చిన్న పళ్ళెములో గరుడ, శేష గంటలకు, మరొక పళ్ళెంలో, సాలగ్రామ నైవేద్యములో పెట్టిన కొంత ప్రసాదమును తీసుకుని చిన్న చిన్న కుప్పలుగా వేయాలి. ముఖ్య ప్రాణ మూర్తికి సమర్పించే నైవేద్యము కొంచెం ఎక్కువగాను మిగిలిన ప్రసాద భాగమును శేష, గరుడ, గంటలకు నాలుగు చిన్న చిన్న ముద్దలుగా చేసి ఉంచాలి.

ఈ నాలుగు భాగములలో ఒక దానిని వైశ్వదేవమునకు ఉపయోగించే ప్రసాదము ఆ పరమాత్మకు నివేదించిన ప్రసాదమును తప్ప మిగిలిన ఏ యితర నైవేద్యమును సమర్పించరాదు. సాలగ్రామమునకు పెట్టిన నైవేద్య ప్రసాదమును రమా నైవేద్యమునకు పెట్టిన ప్రసాదము వద్ద ఉంచాలి.



అన్ని ప్రసాదముల ముద్దలపై సాలగ్రామ తీర్థము మరియు తులసీ దళము కూడా వేయాలి. ఈ మంత్రమును చదువుతూ రమా నైవేద్యమును సమర్పించాలి.

**రమా బ్రహ్మాదయో దేవాః సరకాద్యాశ్శు కాదాయః॥**
**శ్రీ నృసింహప్రసాదో యం సర్వేగృహ్ణాంతు వైష్ణవాః॥**
రమా నైవేద్యం సమర్పయామి.

నీరాజనం సమర్పయామి ( భగవంతునికి సమర్పించిన కర్పూర నీరాజనమును రమా బ్రహ్మాదులకిచ్చి తరువాత కళ్ళకు అద్దుకోవాలి) మంత్ర పుష్పం సమర్పయామి ( పువ్వులను శంఖముపై ఉంచాలి). ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి (అని చదువుకుంటూ నమస్కారము చేయాలి)

ఆ తరువాత ఉద్ధరిణెతో కుడిచేతిలో నీటిని వేసుకుని

యస్యస్మృత్యాచ నామోక్త్యా, తపః పూజా క్రియాదిషున్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందే తమచ్యుతం మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం రమాపతే! యత్కృతంతు మయాదేవ పరిపూర్ణం తదస్తుమే॥ శ్రీ కృష్ణార్పణమస్తు అని నీటిని పళ్ళెంలో వదలాలి.

ఇతి దేవపూజా సమాప్తా

రమా నైవేద్యమును, ముఖ్యప్రాణ నైవేద్యమును మనము తీసుకుని భుజించవచ్చును. వైశ్వదేవభాగము వైశ్వదేవమున కుపయోగించవచ్చును. లేకపోతే మిగిలిన వాటిని వదలాలి.

ఈ క్రింది శ్లోకమును చదువుతూ సాలగ్రామములను తాకాలి.

**శ్లో॥ సాలగ్రామ శిలా స్పర్శం యే కుర్వంతి దినేదినే।**
**వాంఛంతి కరసంస్పర్శం తేషాం దేవా సవాసవా॥**

తరువాత సాలగ్రామములను, విగ్రహములను ఒక పెట్టెలో ఉంచవలెను. ఆ పెట్టెపై పూజించిన తులసీదళములు, పువ్వులు ఉంచవలెను.

తీర్థము తీసుకునే విధము

**శంఖతీర్థము :** శంఖ మధ్యేస్థితం తోయం భ్రామితం కేశవోపరి అంగ లగ్నం మనుష్యాణాం బ్రహ్మహత్యాది నాశకమ్ అని తలపై చల్లుకోవాలి.

**సాలగ్రామ తీర్థము :** సాలగ్రామ శిలావారి, పాపహారి నిషేవణాత్। అకాలమృత్యు హరణం సర్వ వ్యాధి నివారణం। సర్వదురితోపరిశమనం శ్రీ విష్ణుపాదోదకం శుభం॥

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





అని మూడుసార్లు చదివి తీర్థమును తీసుకోవాలి.

**ప్రథమం కాయ సిద్ధర్థం, ద్వితీయం ధర్మసాధనం, తృతీయం మోక్షమాప్నోతి, ఏవం త్రిథాపిబేత్॥**

**ముఖ్యప్రాణమూర్తి తీర్థమును ఒకసారి తీసుకోవాలి. తరువాత అంగారము అక్షింతలను నుదుట పెట్టుకోవాలి.**

## భోజనవిధి

విస్తరాకులో అన్నము, మిగిలిన పదార్థములు వడ్డన తరువాత అన్నముపై ఈ తీర్థమును వేయాలి. ఉద్ధరిణెతో చేతిలో నీరు తీసుకుని ఈ క్రింది మంత్రముతో విస్తరాకులోని పదార్థములపై చల్లాలి.

**ఓం భూర్భువస్వః తత్స వితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్.**

మరల చేతిలోకి నీటిని వేసుకుని

సత్యంత్వర్తేన పరిషించామి అనుచూ విస్తరిచుట్టూ త్రిప్పాలి. రాత్రిపూట " "ఋతంత్వా సత్యేన పరిషించామి" అని అనాలి. విస్తరాకులో అన్నము వడ్డించిన అన్నమును కొద్దిగా మూడువేళ్ళతో తీసుకుని విస్తరాకులో కుడివైపున వరుసగా పై నుంచి క్రిందికి నిలువుగా నాలుగుసార్లు కొంచెం, కొంచెంగా ఈ మంత్రమును చదువుతూ అన్నము పెట్టవలెను.

**చిత్రాయనమః చిత్రగుప్తాయ నమః**

**యమాయనమః సర్వభూతేభ్యోన్నమః**

ఆ తరువాత ఉద్ధరిణెతో నీరు ఆ విధంగా పెట్టిన అన్నము మెతుకులపై అమృతమస్తు అని చదువుతూ వేయాలి. ఆ తరువాత చేతిలో తీర్థము తీసుకుని ఈ క్రింది మంత్రము చదువుతూ తీసుకోవాలి.

**అమృతోపస్తరణ మసిస్వాహా**

ఆ తరువాత మూడు వ్రేళ్ళతో బొటనవ్రేలు, మధ్యవ్రేలు, ఉంగరపువ్రేలితో ( ఈ క్రింది మంత్రమును చదువుతూ) కొద్దిగా అన్నముతీసుకుని నోటిలో వేసుకోవాలి.

**ఓం ప్రాణాయస్వాహా ఓం అపానాయస్వాహా**

**ఓం వ్యానాయస్వాహా ఓం ఉదానాయ స్వాహా**

**ఓం సమానాయస్వాహా**



ఇది చదివి భోజనమును ప్రారంభించాలి. భోజనము పూర్తి అయిన తరువాత చేతిలో నీరు తీసుకుని "అమృతాపి ధానమసి స్వాహా" అని సగములోపలికి తీసుకుని సగము జలమును నేలను విడువవలెను.

చేతులు కాళ్ళు కడుగుకొని వచ్చి ఒకమారు సాలగ్రామ తీర్థమును లోపలికి తీసుకోవలెను. ఒక తులసీదళమును నోటిలో వేసుకోవలెను.

(నిత్యాహ్నిదీపిక సౌజన్యముతో)

## సాలగ్రామ పూజా మాహత్మ్యం

**శ్లో॥ సాలగ్రామ శిలావారి పాపహారి విశేషతః**
**ఆజన్మకృత పాపానాం ప్రాయశ్చిత్తం దినేదినే॥**

**శ్లో॥ అకాలమృత్యుహరణం సర్వవ్యాధినివారణం!**
**సర్వ పాపక్షయకరం విష్ణుపాదోదకం పిబ॥**

తా. ఓ జీవా! పాపమును హరించే విశేషమైన సాలగ్రామ శిలలు, జన్మలో చేసిన పాపములు, ప్రాయశ్చిత్తముచేసుకుని, అకాలముగా సంభవించే మృత్యువును హరించి, అనేకములైన వ్యాధులను నివారించి, సకలములైన పాపములను నశించేసి విష్ణువుపాదముల చెంతనున్న తీర్థమును ప్రతిరోజు తీర్థముగా స్వీకరించుము.

**సకృత దేవతార్చన విషయేతు ఉద్ధరిణ్యాదినా పాత్రాం**
**తరేణ ప్రాశయే దితి విశేషః॥**

తా. దేవతలకు అర్చనను తను స్వయముగా చేసినచో తన వస్త్రమును ఎడమ చేతిలో ఉంచుకుని, నీటి బిందువులు నేలపై పడకుండా జాగ్రత్తగా తీసి ఉద్ధరిణెతో తీర్థ ప్రసాదములు చేయవలెను.

**శ్లో॥ సాలగ్రామశిలా తీర్థ మహీత్వా యస్తు మస్తకే।**
**ప్రక్షేణం ప్రకుర్వీత బ్రహ్మహ నిగద్యతే ॥**

తా. సాలగ్రామ తీర్థమును స్వీకరించక తలపై చల్లుకుంటాడో అతను బ్రహ్మ హస్తము అని అంటాడు.

**శ్లో॥ విష్ణోః పాదోదకం పీతం కోటి హత్యాఘనాశనం।**
**తదే వాష్టగుణం పాపం భూమౌ బిన్దునిపాతనే॥**

తా. విష్ణువు పాదములను తాకు సాలగ్రామ తీర్థమును స్వీకరించినచో కోటిహత్యలు చేస్తే ఎటువంటి పాపము కలుగుతుందో ఆ పాపము పూర్తిగా నశిస్తుంది. ఈ సాలగ్రామ తీర్థమును నేలపై పడినచో దానికి ఎనిమిదివంతులు పాపము చుట్టుకుంటుంది.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





అంబికా సాలగ్రామములలో నర్మద బాణములు

## పంచాయతన ప్రాతస్స్మరణమ్

ప్రాతర్నమామి గణనాథ మశేష హేతుం
బ్రహ్మాది దేవవరదం సకలాగ మాద్యమ్।
ధర్మార్థ కామఫలదం జపమోక్ష హేతుం
వాచమగోచర మనాది మనన్తరూపమ్॥
ప్రాతర్నమామి కమలాపతి ముగ్రవీర్యమ్
నానావతార నిరతం నిజ రక్షణాయ।
క్షీరాబ్ధి వాసమమరాధిప బంధుమీశం
పాపాపహం రిపుహరం భవముక్తి హేతుమ్॥
ప్రాతర్నమామి గిరిజాపతి మిన్దుమౌళిం
వ్యాఘ్రజినా వృత మదుస్తదయం మనోజ్ఞే
బ్రహ్మాది దేవ వరదం సురసిద్ధ పుష్టం
సర్పత్రిశూల ఢమరూన్ దధతం పురారిమ్॥
ప్రాతర్నమామి దిననాథ మఘాపహారం
గాఢాంధకార హర ముత్తమలోక వంద్యమ్।
వేదత్రయాత్మక ముదస్త సురారిమాయం
జ్ఞానైకహేతు మురుశక్తి ముదార భావమ్॥
ప్రాతర్నమామి గిరిజాం భవభూతి హేతుం
సంసార సింధు పరపార కరీం త్రిణేత్రామ్।
తత్త్వాది కారణ ముదస్త సురారిమాయాం
మాయామయీం సురమునీంద్ర ఉతాం సురేశీమ్॥

– గణేశ పురాణ– ఉపానాకాండం నుండి సాలగ్రామాలు.

ఈ పూజలో పెద్దలు ఈ ప్రతీకములను సంపాదించి పూజించుట అలవాటైయుననది. సూర్యుని ప్రతీకముగా కావేరీ నదిలో లభించే స్ఫటిక మును, అంబికాదేవికి సువర్ణముఖీనదిలో లభించే పంచలోహ శిలలను, శ్రీ మహావిష్ణువుకు గండకీ నదిలో లభించే సాలగ్రామమును, మహాగణ పతికి శోణానదిలోలభించే అరుణశిలను, ఈశ్వరునకు నర్మదానదిలో లభించే బాణలింగమును నిర్దేశించుకుని వీనిలో ఏదైననూ ఇష్టదేవతా ప్రతిమను మధ్యలోఉంచి మిగిలినవి మొత్తమును నాలుగుమూలల శాస్త్ర విధిగా నిలిపి నియమమైన పూజావిధానముతో పూజించుట ఏకేశ్వరోపాసన అగును. పూజలో శంఖతీర్థమును తలపై చల్లుకుని సాలగ్రామ తీర్థమును మూడుసార్లు లోనికి తీసుకొనుట ఆచారముగా ఉన్నది.

శ్లో॥ సాలగ్రామ శిలావారి సర్వపాప వినాశకః
సాలగ్రామ శిలావారి సర్వరోగ నివారకః
సాలగ్రామ శిలావారి సర్వ సంపత్కరం శుభమ్
సాలగ్రామ శిలావారి మోక్షసామ్రాజ్య దాయకమ్॥

ఇది సవివరముగా పంచదేవతా పూజయైన "ఉపాసనం పంచవిధం బ్రహ్మోపాసనమేవతత్" అనే వాక్యము సూక్ష్మముగా ఏకేశ్వరోపాసన అగు తున్నది.

ఒక పరమాత్ముడు తన పంచశక్తులను, సృష్టిలోని తత్త్వమును తెలుసుకుని తరువాత మోక్షమును పొందుట ఈ పూజచేసే భక్తుని యొక్క లక్ష్యము.




పంచముఖ గణపతితో గణపతి సాలగ్రామములు

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....



## వివిధ దేవతలకు రూపకల్పన

పూజాది వివరణము తెలుపవలసి వచ్చినది కావున న్యాయముగా విభిన్నమైన పూజలను గురించి ఇక్కడ కొంత తెలుపుతున్నాను. లోకములో ఏ మతమునైన, ముక్తిసాధనను చేయవచ్చును.

## సాలగ్రామము- మహిమ- మూర్తి భేదములు

(పద్మపురాణము నుండి)

శివునికి పూజ చేయుటకు ప్రతీకగా లింగమునకు ఏ విధముగా పూజలు చేస్తామో అలాగే విష్ణుమూర్తికి ప్రతీకగా సాలగ్రామము వెలుస్తున్నది. ఇవి గండకీనదిలో దొరుకుతాయి. సాలగ్రామ పూజచేసేటప్పుడు శివకేశవుల ఐక్యతగా పూజా ఫలము లభిస్తుంది.

**కుమారస్వామికి సాలగ్రామ మహిమను శివుడు ఈ విధంగా వివరిస్తాడు. సాలగ్రామ శిలయందు మూడు లోకములు ఉన్నాయి. సాలగ్రామాన్ని దర్శించిన ను, నమస్కరించిననూ, పూజలు సమర్పించిననూ, అభిషేకము చేసినను కోటి యజ్ఞములు చేసిన పుణ్యము లభిస్తుంది. కోటి గోవులను దానం చేసినంత పుణ్యాం లభిస్తుంది.**

**సాలగ్రామ తీర్థమును ఎవరైతే ఎప్పుడూ స్వీకరిస్తారో వారికి పునర్జన్మ ఉండదు.**

సాలగ్రామ శిలయందు భక్తిలేకున్ననూ, కామముపై ఎక్కువ ఆసక్తి కలిగి ఉండి సాలగ్రామాన్ని పూజిస్తాడో అతడు చ్యుతి జయించిన వాడు అవుతున్నాడు. **సాలగ్రామ శిలను నోటితో ఉచ్ఛరించుటవలన, ధ్యానించి ననూ, పూజించిననూ కోటిహత్యలు చేస్తే కలిగే పాపము కూడా నాశనమవు తుంది. అడవిలో సింహమును చూసి మిగిలిన జంతువులు ఏ విధముగా పారిపోతాయో సాలగ్రామమును పూజించినచో పాపములు కూడా అలాగే పారిపోతాయి.** సాలగ్రామ అర్చనను చేసే వానికి జనన మరణముల వల్ల గాని, యముని వల్లగాని భయము అనేది ఉండదు.

**ఈ సాలగ్రామ శిలను ఎవరైతే అర్చించినచో, లేక నమస్కరించునో వారు ముక్తిని పొందుతారు. ఈ సాలగ్రామమునకు ఎవరైనా భక్తిలేకుండా, భక్తితో పూజించిననూ చివరకు వారు ముక్తిని పొందుతారు.** ఈసాలగ్రామ



మునకు గంధము, పువ్వులు, అర్ఘ్యము, నైవేద్యము, దీపము, ధూపము, గానము, స్తోత్రము, వీటితో సాలగ్రామముకు అర్చన చేయవలెను. **ఈ కలియుగములో ఎవరైతే ఈ సాలగ్రామమునకు ఈ విధముగా పూజలు సల్పుతారో వారు వేయి కోటి కల్పముల వరకు వైకుంఠమున ఉందురు.**

**సాలగ్రామ శిలకు భక్తితో ఒక్కసారైనా నమస్కరించిన ఆ భక్తునకు ప్రపంచమున మరల మానవ జన్మ ఉండదు. ఈ సాలగ్రామ శిలకు భక్తితో నా ప్రభువగు ఆ శ్రీ మహావిష్ణువునకు నమస్కరించిన వారు నా భక్తులుగా చెప్పుటకు వీలులేదు.** నా భక్తుడు ఏకాదశినాడు భోజనము చేసినట్లైతే అతను నన్ను నిందించినచో అంధతామిస్రము అనే నరకమున పడతాడు. అలా భోజనము చేసినచో నాలింగ స్వరూపమగు దేహమును పూజించాలి. వేరే ఏ విధమైన ప్రాయశ్చిత్తము లేదు. ఆ శ్రీ మహావిష్ణువునకు ఇష్టమైన తిథి నాకునూ కూడా ఇష్టమైన తిథే.

ఏకాదశినాడు ఎవరయితే ఉపవాసమును చేయక అన్నము తినినచో అతను మహాపాపము చేసినవాడు. చండాలుని కన్నా హీనుడు. స్కందుడా! నేను ఎప్పుడూ సాలగ్రామ శిలయందు నివసించి ఉంటాను. నా భక్తికి మెచ్చిన ఆ స్వామి తన స్థానమును నాకు ప్రసాదించి ఉన్నాడు. **కోటి పద్మములను తీసుకువచ్చి నాకు పూజించిన ఏ ఫలితము కలుగునో దానికి కోటిరెట్లు అధికమయిన ఫలము సాలగ్రామ శిలను పూజించుటతో కలుగుతుంది.**

ఎవరయితే ఈ మనుష్య లోకములో నా రూపమున సాలగ్రామమును పూజించరో వారు చేసిన ఏ పూజలు, నమస్కారములు కూడా అన్నియూ వ్యర్థము. **సాలగ్రామ శిలయందు నేను ఉన్నాను - అని ఎవరయితే పూజిస్తారో వారు ఇరవైఒక్క యుగములందు నన్ను పూజించినట్లు అగును.**

**విష్ణువునందు భక్తిలేక సాలగ్రామములను పూజచేయక వేలాది లింగములకు పూజ చేసినచో అవి అన్నీ వ్యర్థము అగును.** అలా పూజచేయక నాకు సమర్పించి నైవేద్యము, ఫల పుష్ప పత్రాదులు, నీరు, అన్నీ కూడా వ్యర్థమే. సాలగ్రామ శిలయందు ఉంచిన అన్ని పదార్థములు పవిత్రముగా అగును. వేరే దేవతల నైవేద్యమును బ్రాహ్మణుడు భుజించినచో చాంద్రాయణ వ్రతమును చేయాలి. కేశవుని నైవేద్యము భుజించినచో కోటి యజ్ఞములు ఫలమును పొందును. **సాలగ్రామ రూపములో ఉన్న శ్రీ హరి**

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





**పాదోదకముచే కోటి హత్యలు చేసిన వాడుకూడా శుద్ధుడుగా మారుతున్నాడు. శంఖములోని తీర్థమును తీసుకున్నచో అతను కూడా శుద్ధుడుగా మారుతున్నాడు.** భక్తులు ఎవరైననూ విష్ణువునుగాని, విష్ణు భక్తులుగాని వారిని గౌరవించక ద్వేషించేవాడు పదునాలుగు ఇంద్రులుండు వరకు నరకమును పొందుతారు.

ఎవరి యింటనైనను బ్రహ్మచారి ఒక ముహూర్తకాలమున విశ్రమించు చున్నాడో అతని పితామహులు ఎనిమిది యుగముల వరకు అమృతమును తాగుతూ వుంటారు. దుఃఖము ఎక్కువగా ఉన్న ఈ సంసార బంధమునందు కృష్ణుని ఆరాధించని వారు అజ్ఞానులు, కోటివేల సంవత్సరములు ఈ దుఃఖసాగరమందే ఉంటారు. యోగసాంఖ్యములు తెలియక **మనుషులు ఒక్కసారైనా సాలగ్రామమును పూజించినచో ముక్తిని పొందుతారు. కోటి లింగములను దర్శించి పూజించిన కలుగు పుణ్యము ఒక సాలగ్రామమును పూజించిన కలుగుతున్నది.** సాలగ్రామ శిలలు పన్నెండు రకములుగా ఉన్నవి. వానిలో దేనినైనను సరిగా పూజించినచో వానికి కలుగు పుణ్యమును గురించి తెలుపుతాను వినుము. **గంగాతీరమున వెయ్యికోట్ల సార్లు పూజలు చేసిన, కాశి యందు ఎనిమిది యుగములు నివసించిన ఎట్టి పుణ్యము కలుగుతుందో ఈ సాలగ్రామమును పూజించిన ఒక దినములోనే కలుగును.** ఇలా ఉండగా విష్ణుభక్తుడై అనేక సాలగ్రామములు పూజించిన ఆపుణ్యములు సంఖ్య నేను గాని బ్రహ్మాదిదేవతలు లెక్కించుటకు వీలుకాదు. కావున నా భక్తులు నా ఇష్టప్రకారము ఆ విష్ణువునందు భక్తి ఉంచి సాలగ్రామ శిలను అర్చించవలెను. **సాలగ్రామ శిలారూపమగు శ్రీహరి ఉండుచోట ఈ కలియుగములో సురులు, యక్షులు, పదునాల్గు లోకములు కూడా ఉండును.** ముప్పయి మూడుకోట్ల దేవతలు స్తుతించుటవలన కలుగు పుణ్యము ఆ శ్రీహరిని స్తుతించుట వలన కలుగుచున్నది.సాలగ్రామ శిలను ముందు వుంచుకుని పితృదేవులకు తర్పణములు ఇచ్చిన ఆ పితృదేవులు స్వర్గమున ఉండే కాలమును లెక్కించుటకు వీలుకాదు. సాలగ్రామ తీర్థమును ఎవరుసేవిస్తారో వారికి వెయ్యిమార్లు పంచగవ్యమును సేవించిన లాభము? పాపము చేసినచో ప్రాయశ్చిత్తం కలిగినచో ఆ తరువాత చేసినదానములు, ఉపవాసములు, చాంద్రాయణాదులవల్ల ఏమి ప్రయోజ నము? **సాలగ్రామ తీర్థమును సేవించిన ఆ పాపములకు ప్రాయశ్చిత్తమ మైనది.**



ఎవరైతే సాలగ్రామ ప్రతిమను నీటియందు ఉంచునో వానికి నాయొక్క మరియు బ్రహ్మ సూర్యుల అనుగ్రహము వలన ఏమి ప్రయోజనము? విష్ణువు అనుగ్రహము శ్రేష్ఠము. తటాకములో స్వామిని నీటియందు పరుండబెట్టిన చాలా మంచిది. అలా చేసిన వానికి అనేక కోటిదేవతలను పూజించుట ఏమి ప్రయోజనము ? ఓ కుమారా! అన్ని పుణ్యములు మితమైన పరిమాణములు కలుగును. **కాని ఈ సాలగ్రామమునకు పూజ చేయుటవలన కలుగు పుణ్యమునకు లెక్కకట్టటానికి వీలులేదు.** ఇలా విష్ణువే కాక మిగిలిన అందరూ దేవతలు వివరిస్తారు.

ఎవరు సాలగ్రామ రూపమగు విష్ణువును విష్ణుభక్తుడగు బ్రాహ్మణునకు ఇస్తారో వారు నూరు యాగములను చేసిన పుణ్యమును పొందుతాడు. **సాలగ్రామమును పూజించి ఆ జలమును ఇంటియందే ఉన్నను ప్రతి దినము గంగానదిలో స్నానము చేసినట్లగును. అన్ని తీర్థములందు స్నానము చేసినట్లగును. అన్ని యజ్ఞములు చేసినట్లగును.** స్వర్గ భూమి పాతాళములందు కావలసినన్ని శిలలు కలవు. కాని యీ సాలగ్రామ శిలవలె యింకొటి లేదు. ఈ విషయమును మరి మరి నొక్కి వక్కాణించవచ్చును. ఈ దుర్లభమైన మనుష్యలోకములో వారి జన్మసఫలమైనట్లే.

ఎవరయితే నూరు ప్రస్థముల నువ్వులను దానము చేస్తాడో ఆ ఫలము సాలగ్రామ పూజ చేయుట వలన కూడా కలుగును. **పత్రము, పుష్పము, ఫలము, నీరు, దుంప, గరిక వీనిలో ఏ ఒక్కదానితోనైనా సాలగ్రామమునకు అర్పించిన 'మేరు పర్వతమంత ఫలము కలుగుతుంది.** సాలగ్రామపూజ విధిక్రియ. మంత్రాదులచే విహీనమైనాసరే పూజ చేసేవాడు చతుర్భుజుడై శాస్త్రమున చెప్పిన ఫలమును పొందుతున్నాడు.

క్లేశనాశకుడగు కేశవుని నేను ఏమని ప్రశ్నించుతునో అది అంతయు నీ యందుండు వాత్సల్యముచే ఇలా చెప్పుతున్నాను.

ఓ విష్ణుమూర్తీ! నీవు ఎక్కడ నివసింతువు? నీకు ఆధారము ఏమిటి? నీకు ఆశ్రయమేది? నీవు ఎలా సంతోషపడతావు? వీటి నన్నిటిని నాకు వివరింపుము.

దానికి శ్రీమహావిష్ణువు ఇలాచెప్పెను. ఓ శంభూ! సాలగ్రామ శిలయందు నేను ఎల్లప్పుడూ ఉంటాను. రథచక్రముల గుర్తులు గల వాని యందున్న వాని పేర్లను వినుము.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





సాలగ్రామమున కల రంధ్రములుగల ముందు భాగమున రెండు చక్రములు కనపడిన, అవి రెండు కలిసినట్లున్న వానికి **వాసుదేవ సాలగ్రామము** అని పేరు. అతి తెల్లరంగుగల శిలయైనచో మిక్కిలి ఉత్తమము.

చక్రము ఊర్ధ్వముఖము కలిగి ఉన్న అది **ప్రద్యుమ్న సాలగ్రామము.** రంగు నీలియైయున్నచో అది ఉత్తమము. ఈ సాలగ్రామము ఎక్కువ రంధ్రములు కలిగి పొడవుగా ఉండును.

సాలగ్రామము పసుపుపచ్చనై ఉండి గుండ్రముగా ఉంటే అది **అనిరుద్ధ సాలగ్రామము** అని అంటారు. ఇది మంచిది. దీనికి రంధ్రము వద్ద మూడు రేఖలు ఉంటాయి. అందులో పద్మము అప్పుడు వికసించినట్లు పై ముఖముపై ఉండును.

నల్లగా ఉండే సాలగ్రామాన్ని **నారాయణ సాలగ్రామ** మంటారు. చక్రమధ్యములో ఉబ్బి ఉంటుంది. రేఖ పొడవుగా ఉంటుంది. రంధ్రము ఉంటుంది. ముఖముపై ఉన్న అది హరి సాలగ్రామము. అతి సుందరమైనది. అర్థకామమోక్షములను ప్రసాదించునది.

పద్మ చక్రములు ఉండి తెల్లగా ఉండి క్రింది భాగము బింబాకారములో ఉండి రంధ్రము రాను రాను సన్నగా ఉండు సాలగ్రామమునకు **పరమేష్ఠి సాలగ్రామము** అని అంటారు.

నల్లగా ఉండి క్రింది భాగము రెండు చక్రములు బాగా ఉండి రంధ్రముపై మధ్యప్రదేశమున ఒక రేఖ ఉండిన అది **విష్ణు సాలగ్రామము.**

కపిలవర్ణముతో ఉండినది **నరసింహ సాలగ్రామము.** దీనిలో చక్రము పెద్దగా ఉండును. ఈ సాలగ్రామాన్ని బ్రహ్మచర్యముతో పూజించాలి. లేకున్న విఘ్నములు కలుగజేయును.

సాలగ్రామములో చక్రములు పైన క్రింద సమానముగా ఉండి విషమముగా ఉండి అది **వరాహశక్తి సాలగ్రామము.**, ఇంద్రనీలరంగు కలిగి వెడల్పు రేఖకలిగినది, కొంచెముగా వంగి యుండును.

బంగారు రంగుగలదై పొడవుగా మూడు బిందువులతో కలిగి ఉన్న సాలగ్రామము **మత్స్యమూర్తి.** భక్తిని, ముక్తినీ ప్రసాదిస్తుంది.

వెనుకభాగము కొంచెం ఎత్తుగా ఉండి పసుపు వర్ణము కలిగి ఉండి కౌస్తుభ చిహ్నములు కలిగి ఉండినది **కూర్మ సాలగ్రామము.**



గుర్రము యొక్క ఆకారము కలిగి ఐదురేఖలను కలిగి ఉండి అనేక బిందువులను కలిగి ఉండేది **హయగ్రీవమూర్తి సాలగ్రామము.**

చక్రము నుండి చీలినట్లుగా ఉండే గీత నుండి ఒక చక్రము, ఒక ధ్వజము నుండి రంధ్రము వద్ద రేఖ కలిగినదియై గురువిందవలె యుండునది **వైకుంఠమూర్తి సాలగ్రామము.**

వనమాలయనే మాలవలె గుర్తుఉండి కదంబపుష్పము ఆకారంలో ఉండి ఐదురేఖలు ఉండిన అది **శ్రీధరమూర్తి సాలగ్రామము.**

గుండ్రంగా, చిన్నదిగా ఉండి అవిసిపూవన్నె కలిగి ఒక బిందువు గలది అది **వామనమూర్తి సాలగ్రామము.**

నల్లగా మెరుస్తూ ఉండి ఎడమభాగములో గదా, చక్రములు కుడిభాగములో రేఖ ఉండిన అది **సుదర్శనమూర్తి.**

లావుగా మధ్యలో చక్రము కలిగి రంధ్రము నోటియందు పసుపుగా ఉండి పసుపురేఖ ఉండినచో అది **దామోదరమూర్తి సాలగ్రామము.**

అనేకమైన రంగులు కలిగి అనేక పడగలవలె చక్రములు కనపడుతూ అనేక మూర్తులు కలిగియుండినచో అది **అనంతమూర్తియైన సాలగ్రామము.** సకల అభీష్టములు నెరవేర్చును.

దిక్కుల తేడా లేకుండా అన్ని ప్రక్కలయందు ముఖములు కలిగి ఉండినచో అది **పురుషోత్తమమూర్తి సాలగ్రామము.** అది భుక్తిని, మరియు ముక్తిని ప్రసాదిస్తుంది.

సాలగ్రామ పై భాగమున లింగము కలిగిఉన్న అది యోగీశ్వరమూర్తి సాలగ్రామము. అది బ్రహ్మ హత్యాపాపమును నశింపజేస్తుంది.

శంఖచక్రములతో కూడి కొంచెం ఎర్రగా ఉండే సాలగ్రామము **పద్మనాభ సాలగ్రామము.** దీనిని పూజించినచో దరిద్రుడు కూడా కుబేరుడుగా మారును. చక్రాకారము కలిగి బంగారువన్నె కలిగి కాంతిని పొంది ఉండి అనేక రేఖలు కలిగి మృదువుగా ఉండి అది **కృష్ణమూర్తి సాలగ్రామము.**, అది ఎల్లప్పుడూ సిద్ధిని ప్రసాదిస్తుంది.

తెల్లగా ఉండే సాలగ్రామము పాపములను హరించి వేస్తుంది. పసుపు పచ్చగా ఉండేది పుత్రులను ఇస్తుంది. నీలిరంగులో కలది సంపదనిచ్చును., ఎర్రగా ఉన్నది రోగములను కలుగజేస్తుంది. కఠినముగా ఉన్నది మనసునకు

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





ఆందోళనలు కలుగజేస్తుంది. వక్రముగా ఉన్నది దారిద్ర్యమును కలుగ జేస్తుంది.

సాలిగ్రామములో ఒక చక్రము ఉన్నచో అది **సుదర్శనము**. రెండు చక్రములున్నచో అది **లక్ష్మీనారాయణుడు**. మూడుచక్రములు వున్నచో **అచ్యుతుడు.** నాల్గు చక్రములు వున్నచో **జనార్ధనుడు**. ఐదు చక్రములు వున్నచో **వాసుదేవుడు**. ఆరు చక్రములున్నచో **ప్రద్యుమ్నుడు**. ఏడు చక్రము లున్నచో **సంకర్షణుడు**. ఎనిమిది చక్రములు ఉన్నచో **పురుషోత్తముడు**. తొమ్మిది చక్రములున్నచో **నవవ్యూహము**. పది చక్రములు ఉన్నచో **దశావ తారము**. పదకొండు ఉన్నచో **అనిరుద్ధుడు**, పండ్రెండున్న **ద్వాదశాత్మకుడు**. వీనికంటే ఎక్కువ చక్రములు ఉండినచో **అనంతమూర్తి.**

సాలగ్రామము పగిలి భాగముగా యున్నచో, భిన్నమై యున్నను కొంత చిప్పగా ఊడి ఉన్ననూ దానిని పూజించిన దోషములేదు.

ఎవరికి ఏ మూర్తియందు ఇష్టము కలదో వారు ఆ మూర్తిని ప్రయత్నించి తెచ్చి పూజించవలెను. **సాలగ్రామమును భుజముపై పెట్టుకుని ఎవరు వెళుతారో వారికి చరాచరమైన ప్రపంచము వశము అవుతుంది. సాలగ్రామ ముండుచోటా శ్రీహరియే ఉండి తీరతాడు. అక్కడ స్నానమా చరించిననూ, దానము చేసిననూ కాశీయందు చేసిన స్నానపానాదులకన్న వందరెట్లు అధికమగును. కురుక్షేత్రము, ప్రయాగము, నైమిశారణ్యము, పుష్కరాదులందు స్నాన దానములు చేసిన కలుగును.** వారణాసియందు ఈ సాలగ్రామము దగ్గర స్నానము చేసిన మహాఫలము కలుగుతుంది. మానవుడు తాను చేసిన బ్రహ్మ హత్యాది పాపమువల్ల ఈ సాలగ్రామ పూజ చేయుటవలన నశింప చేసుకుంటున్నాడు.

సాలగ్రామము, ద్వారక సాలగ్రామము, రెండు ఉన్నచోట ముక్తి పొందుట సిద్ధము. అనుమానములేదు. బ్రహ్మచారిగాని, వానప్రస్థ భిక్షుకుడే గాని, గృహస్థుడుగాని విష్ణువు యొక్క ప్రసాదమును భుజించవచ్చును, ఈ విషయములో అనుమానపడవలసినది ఏమి లేదు.

**సాలగ్రామమును పూజించుటకు మంత్రము అవసరంలేదు. జపము అక్కరలేదు. మనస్సున భావము కూడా అవసరం లేదు. స్తుతిగాని, ఆచారముగాని అవసరము. దానిని ఎలా కావలసినను అలాగే పూజించ వచ్చును.** సాలగ్రామ శిలయందు స్వస్తిక మండలమును రచియించిన



అనంతమైన పుణ్యము లభిస్తుంది. అందులో కార్తికమాసంలో రచించిన అది ఏడు కులములను పవిత్రము చేస్తుంది. కేశవుని యందు మట్టితోగాని రంగులతోగాని స్వల్పమైనను కేశవాది పేర్లను రచించినవాడు కోటి కల్పముల వరకు స్వర్గమున సుఖమును పొందును. ఎవరయితే ఒక సంవత్సరము పూర్తిగా అగ్నిహోత్రమును చేస్తాడో, అతని ఫలము కార్తిక మాసమున కేశవుని యందు స్వస్తికమండలమున రచియించిన ఫలముతో సమానము. సంశయము లేదు.

ఎవరిని క్షమించకూడదో అట్టి వారియందు రమించిననూ, తినరాని దానిని తిన్ననూ ఆ శ్రీహరిముందు అలంకారము చేసిన ఆ పాపము లంతయూ నాశనమగును. కేశవుని ముందు ఏ స్త్రీ అలంకారములను రచియించునో ఆమెకు యేడు జన్మలవరకు వైధవ్యము కలుగదు.

(-పద్మపురాణము నుండి.)

MOHANPUBLICATIONS.COM




**శ్రీ విష్ణు విశ్వరూప ప్రతిమ**

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....







## సాలగ్రామము

ఈ దివ్యదేశము నేపాల్ రాష్ట్రంలో కలదు. గండకీ నది ఒడ్డునకల ఈ క్షేత్రము ఖాట్మాండుకు 60 మైళ్ళ దూరంలో కలదు. ముక్తినారాయణ క్షేత్రము ఇక్కడకు 100 మైళ్ళ దూరంలో కలదు. నేపాల్ ప్రభుత్వ అనుమతితో 50 మందికి తక్కువ కాకుండా వెళ్లవచ్చును. **ఎవరి ఇంటిలో అయితే 12 సాలగ్రామములు దగ్గర ఉండునో ఆ గృహము దివ్యమైన దేశముతో సమానమగును. అక్కడ స్పర్శ దోషములు ఉండవని శాస్త్ర ప్రమాణము.**

ఈ సాలగ్రామ క్షేత్రములో శ్రీమూర్తి స్వామి. శ్రీదేవి సమేతముగా ఉత్తరముఖముగా నిలిచియున్న భంగిమతో వేంచేసి ఉంటారు. కనక విమానము, గండకీతీర్థము, చక్రనది- అనునవి ఈ క్షేత్రములో విశేషముగా చెప్పుకోవచ్చును. బ్రహ్మ రుద్రాదులకు "గండకియను వేశ్యకును- స్వామి ప్రత్యక్షమయి పెరియా ళ్వారులు, తిరుమంగయాళ్వారులు ఈ స్వామిని తమ తమ దివ్య ప్రబంధములతో మంగళాశాసనము గావించి యున్నారు.

స్వయంవక్త క్షేత్రములో ఇది ఒకటి. ఈ క్షేత్రమునకు మిగిలిన వాటికంటే ఎక్కువ ప్రాధాన్యత కలదు. భగవద్దర్శనము కారణాంతరములచే నిషేధింపబడినను, సంప్రోక్షణ ఇక్కడ ప్రాముఖ్యత కలదు. సాలగ్రామములు సరిసంఖ్యలో పూజించాలి. అంటే 1,4,6,8,10,12 ఈ విధముగా ఎన్నయినా యుండవచ్చు. కాని బేసి సంఖ్యలో మాత్రము సాలగ్రామములు ఉండకూడదు.

సాలగ్రామమును స్త్రీలు స్వయముగా స్పృశించి, ఆరాధించే ఆచారము లేదు. వీరు విగ్రహములను మాత్రమే ఆరాధించవలెను. తాము ఏది తయారుచేస్తే దానిని ఆరగింపు చేయాలి.

సాలగ్రామ మూర్తిని మాత్రమే ఆరాధించునపుడు ఆహ్వానోపచారము కూడదు. సాలగ్రామమునందు ఎల్లప్పుడూ విష్ణువు సన్నిహితుడై ఉండును.

సాలగ్రామము ఒకటి యుండవచ్చును లేక నాలుగు, ఆరు, ఎనిమిది,పది, పండెండ్రు- ఇలా సరి సంఖ్యలో ఉండాలి. బేసి సంఖ్యలో ఉండుట మంచిది కాదు.





శ్రీ మహావిష్ణువుతో సుదర్శన చక్ర సాలగ్రామములు

3వ అధ్యాయము

## సాలగ్రామాది మూర్తి లక్షణమ్

అథషట్చత్వారింశోధ్యాయః
అథసాలగ్రామాది మూర్తి లక్షణమ్
శ్రీ భగవానువాచః
శాలగ్రామాది మూర్తిశ్చ వక్ష్యే హం భుక్తిముక్తిదా॥
వాసుదేవో సితోద్వారి శీలాలగ్నద్విచక్రకః 1
జ్ఞేయః సఙ్కర్షణోలగ్న ద్విచక్రో రక్త ఉత్తమః॥
సూక్ష్మచక్రోబహుచ్ఛిద్రః ప్రద్యుమ్నోనీలదీర్ఘకః 2
పీతో నిరుద్ధః పద్మాఙ్కోవర్తులోద్విత్రి రేఖకః॥
కృష్ణో నారాయణో నాభ్యున్నతః సుషీరదీర్ఘవాన్. 3
పరమేష్ఠీ సాబ్జచక్రః పృష్టచ్ఛిద్రశ్చ బిన్దుమాన్॥
స్థూలచక్రో సితో విష్ణుర్మధ్యో రేఖాగదాఽ కృతిః 4
నృసింహః కపిలః స్థూలచక్రః స్యాత్పఞ్చబిన్దుకః॥
వరాహః శక్తి లిఙ్గః స్యాత్తచ్ఛ।కే విషమౌస్మృతౌ 5
ఇన్ద్రనీలనిభః స్థూలస్త్రీ రేఖాలాఞ్ఛితః శుభః॥
కూర్మస్తథోన్నతః పృషే వర్తులావర్తకో సితః 6

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





హయగ్రీవో జ్ఞుశాకారరేఖో నీలః సబిన్దుకః॥
వైకుణ్ఠఏకచక్రోబ్జీ మణిభః పుచ్ఛరేఖకః 7
మత్స్యో దీర్ఘస్త్రిబిన్దుః స్యాత్కాచవర్ణస్తు పూరితః॥
శ్రీధరో వనమాలాఙ్క పఞ్చరేఖస్తు వర్తులః 8
వామనో వర్తులశ్చాతి హ్రస్వోనీలః సబిన్దుకః ॥
శ్యామస్త్రివిక్రమో దక్షరేఖో వామేర రిక్తక। 9
అనన్తో నాగభోగాబ్ధో నైకాభో నైకమూర్తిమాన్॥
స్థూలో దామోదరోమధ్య చక్రః స్యాత్సక్షమ్మవిన్దుకః 10
సుదర్శనస్త్వేకచక్రో లక్ష్మీనారాయణో ద్వయాత్॥
త్రిచక్రశ్చాచ్యుతో దేవస్త్రచక్రోవా త్రివిక్రమః 11
జనార్ధన శ్చతుశ్చక్రో వాసుదేవశ్చ షఙ్చభిః॥
షట్చక్రశ్చైవ ప్రద్యుమ్నః సఙ్కర్షణశ్చసప్తభిః 12
పురుషోత్తమోఽ ష్టచక్రో నవవ్యూహోనవాఙ్కితః।
దశావతారో దశబిర్దశైకేనానిరుద్ధకః 13
ద్వాదాశత్మక ద్వాదశ భిరత ఊర్ధ్వ మనస్తకః

ఇత్యాది మహాపురాణే ఆగ్నేయ శాలగ్రామాది మూర్తిలక్షణం నామ షట్చత్వారింశో ద్యాయః

హయగ్రీవుడు ఇలా చెప్పెను. బ్రహ్మదేవా! సాలగ్రామములపై నివసించు మూర్తులను గురించి వివరించెను. ఇది భోగమును మోక్షమును ప్రసాదించును. ద్వారమునందు రెండు చక్రములతోకూడి నల్లగా ఉండేది సాలగ్రామము **వాసుదేవుడు,** రెండు చక్రములు ఉండి ఎఱ్ఱగా ఉండే సాలగ్రామము **సంకర్షణుడు**. చిన్న చక్రము, అనేక రంధ్రములతో కూడి ఉండి నీలవర్ణతో కూడినది **ప్రద్నుమ్న సాలగ్రామము.** కమలచిహ్నము, గోళాకారము, పచ్చనిరంగుతో, మూడు రేఖలు కలిగి ఉండునది **అనిరుద్ధ సాలిగ్రామము.** నాభియందు ఉండి పెద్ద రంధ్రముతో ఉండి నల్లగా ఉండేది **నారాయణ సాలగ్రామము.** కమల– చక్ర చిహ్నములు కూడి ఉండి మధ్య భాగమున రంధ్రము, బిందువు ఉన్న దానిని **పరమేష్టి సాలగ్రామము** అని అందురు. స్థూలమైన చక్రము, మధ్యలో గదవంటి రేఖ ఉండి తెల్లని



రంగుతో కూడి ఉన్నటువంటి **విష్ణువు సాలగ్రామము**. పొడవైన చక్రముతో ఐదు బిందువులతో ఉండి ఎఱ్ఱగా ఉండునది **నృసింహ సాలగ్రామము**. శక్తి అనేది అస్త్రము యొక్క గుర్తు. విషమములైన రెండు చక్రములు, మూడు స్థూల రేఖలు ఉన్న ఇంద్రనీలమణి వంటి రంగుగల **శాలగ్రామము వరాహము.** ఎత్తైన పృష్ఠభాగము గోళాకారమైన ఉన్న శ్యామవర్ణ **సాల గ్రామము కూర్మము**. అంకుశరేఖలు, బిందువులు, ఉన్న నీలవర్ణ **సాల గ్రామము హయగ్రీవుడు**. ఒక చక్రము ఒక కమలము, పుచ్ఛాకారమైన రేఖలు ఉన్న మణివలె ప్రకాశించునది **వైకుంఠ సాలగ్రామము**. మూడు బిందువులు, కంచువలె తెల్లగా ఉండి పెద్ద ఆకారముతో ఉన్నది మత్స్య సాలగ్రామము.

వనమాల, ఐదురేఖలు కలిగి గోళాకాముగా ఉండేది **శ్రీధర సాల గ్రామము.** చాలా చిన్నదిగా ఉండి, బిందువులు కలిగి ఉండి గోళాకారమైన నీలరంగుతో ఉండేది **వామన సాలగ్రామము.** కుడి ప్రక్కన హారరేఖ, ఎడమప్రక్క బిందువులు ఉండి తెలుపు రంగుగల **శాలగ్రామము త్రివ్రికముడు**. సర్పశరీర చిహ్నము. అనేక మూర్తులు కలిగి ఉండు చాల రంగులతో వెలుగునది **అనంతుడు సాలగ్రామము.**

ఆదిశేషుడు మధ్యలో ఉండి చక్రము, క్రింద సూక్ష్మబిందువు ఉన్న స్థూలమైనది **దామోదర సాలగ్రామము.** ఒక చక్రమున్న సాలగ్రామము సుదర్శనము. రెండుచక్రములుంటే **లక్ష్మీనారాయణుడు**, మూడు చక్రములుంటే **అచ్యుతుడు,లేదా త్రివ్రికముడు**. నాలుగు చక్రములుంటే **జనార్ధనుడు** ఐదు చక్రములుంటే **వాసుదేవుడు**. ఆరు చక్రములుంటే **ప్రద్యుమ్నుడు**. ఏడు చక్రములుంటే **సంకర్షణుడు**,. ఎనిమిది చక్రములుంటే **పురుషోత్తముడు**, తొమ్మిది చక్రములుంటే **నవవ్యూహము**. పది చక్రములుంటే **దశావతారమూర్తి** పదకొండు చక్రములుంటే **అనిరుద్ధుడు**. పండ్రెండ్రు చక్రములుంటే **ద్వాదశాత్మ**. అంతకంటే ఎక్కువ చక్రములుంటే **అనంతుడు**.

అగ్ని మహాపురాణము నందు సాలగ్రామమూర్తి వర్ణమును నలుబది యారవ అధ్యాయము సంపూర్ణము.

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....







సుదర్శన,చక్ర, ఓంకార రూపులతో సాలగ్రామములు

MOHANPUBLICATIONS.COM

అథసప్తచత్వారింశోధ్యాయః

అథ సాలగ్రామాదిపూజాకథనమ్

శ్రీ భగవానువాచః-

శాలగ్రామాది చక్రాబ్జపూజాః సిద్ధ్యై వదామితే॥

త్రివిధః స్యాద్ధరేఃపూజా కామ్యకామ్యో భయాత్మికా 1

మీనాదీనాంతుజ్ఞానాం కామ్యార్థావోభయాత్మికా॥

వరాహస్య నృసింహస్య వామనస్య చ ముక్తకమ్ 2

చక్రదీనాం త్రయానాంతు శాలగ్రామార్చనం శృణు॥

ఉత్తమా నిష్ఫలా పూజా కనిష్ఠా సఫలార్చనా 3

మధ్యమామూర్తిపూజాస్యాచ్ఛక్రాబ్జే చతురస్రకే॥

ప్రణవం హృది విన్యస్య షడఙ్గం కరదేహయోః 4

కృతముద్రాత్రయశ్చక్రాద్భహిః పూర్వేగురుం యజేత్॥

ఆప్యేగణం వాయవ్యే దాతారం నైరృతే యజేత్ 5

విధాతారం చకర్తారం హర్తాగం దక్ష సౌమ్యయోః॥

విష్వక్సేనం యజేదీశ ఆగ్నేయ క్షేత్రపాలకమ్. 6



ఋగాదివేదాన్ ప్రాఆదాబాధారానస్తకం భువమ్ ॥

పీఠం పద్మం చార్క చన్ద్రవహ్న్యాఖ్యం మణ్డలత్రయమ్. 7

అసనంద్వాదశర్ణేన తత్రస్థాప్య శిలాం యజేత్॥

వ్యస్తేన చ నమస్తేన స్వభీజేన యజేత్క్రమాత్ 8

పూర్వాదావథ వేదాద్యైర్గాయత్రీభ్యాం జితాదినా॥

ప్రణవేనార్చ్య యేత్పశ్చాన్ము ద్రాస్త్రిస్రః ప్రదర్శయేత్ 9

విష్వక్సేనస్య చక్రస్య క్షేత్రపాలస్య దర్శయేత్॥

హయగ్రీవుడు ఇలా చెప్పెను. ఇప్పుడు చక్రాంకిత సాలగ్రామముల పూజా విధానము చెప్పుతున్నాను. ఇది సిద్ధప్రసిద్ధమైనది. శ్రీహరిపూజ కామ్య, అకామ్య, కామ్యాకామ్యా అని మూడు విధములు. మత్స్యాది పంచ విగ్రహముల పూజ కామ్యముగాని, ఉభయాత్మికముగాని కావచ్చు. వెనుక చెప్పిన చక్రములతో ప్రకాశించు వరాహ-వామన- నృసింహుల పూజను ముక్తి కొరకు చేయవలెను. ఇప్పుడు మూడు విధములైన సాలగ్రామ పూజను గురించి వినుము. వీటిలో నిష్కల్మషమైన పూజ ఉత్తమమైనది. సఫలపూజ కనిష్ఠమైనది. మూర్తిపూజ మధ్యమము. చతురస్ర మంటపముపైనున్న కమలమందను పూజావిధిఈ విధముగా ఉంటుంది. హృదయ మున ప్రణవ న్యాసము చేస్తూ షడంగన్యాసము చేయాలి. తరువాత కరన్యాసము, వ్యాపక న్యాసము చేసి మూడు ముద్రలను చూపాలి. తరువాత చక్రమునకు బైట, తూర్పున గురువును పూజించవలెను. పశ్చిమమున గణాధిపతిని వాయవ్య మున దాతను, నైరృతియందు విధాతను పూజించాలి. దక్షిణోత్తరముల యందు వరసగా కర్తను, హర్తనుపూజించాలి. ఈశాన్య దిక్కున విష్వక్సేనుని, ఆగ్నేయదిక్కున క్షేత్రపాలుని ఉంచి పూజించాలి. ఆ తరువాత పూర్వాది దిక్కులలో ఋగ్వేదాది వేదచతుష్టయమున పూజించి ఆధారశక్తిని, అనం తుని, పృథివిని, యోగపీఠమున పద్మమును, సూర్య మండలమును, చంద్ర మండలమును, బ్రహ్మాత్మక వహ్ని మండలమును పూజించి ద్వాదశాక్షరిచే ఆసనముపై శిలాస్థాపనము చేసి పూజించాలి, ఆ తరువాత మూలమంత్ర మును విభజించి, సంపూర్ణ మంత్రముతో క్రమపూర్వకముగా పూజిం చాలి. తరువాత ప్రణవముచే పూజించి మూడు ముద్రలు చూపాలి. చివరన చక్ర- క్షేత్రపాలుల ముద్రలు చూపాలి.

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....








పంచముఖ గణపతిలో గణపతి సాలగ్రామములు
మరియు తెల్లనివి, నల్లనివి నర్మద బాణములు

## సాలగ్రామ తీర్థ ప్రాశనవిధిః

శ్లో॥ అకాలమృత్యుహరణం సర్వవ్యాధి నివారణం ।

విష్ణో ః పాదోదకం తీర్థం శిరసా ధారయామ్యహం ॥

తా. అకాలమృత్యుమరంబును, సర్వవ్యాధి నివారణచేసే శ్రీ విష్ణు పాదోదక తీర్థమును శిరస్సున ధరిస్తున్నాను.

శ్లో॥ వస్త్రం చతుర్గణీకృత్య పాణౌ పాణిం నిధాయచ ।

పవిత్రం విష్ణుపాదమ్బు త్రిః పిబే ద్భిన్దువర్జితం ॥

సాలగ్రామ శిలాతీర్థం హస్తేనైవ పిబే త్సుధీః ॥

తా. సాలగ్రామ తీర్థమును నేలపై పడకూడదు. వస్త్రమును నాలుగు మడతలుగా పెట్టి ఎడమచేతిలో ఉంచుకుని దానిపై కుడిచేయి ఉంచి భూమిపై బిందుపాతము కాకుండా తీర్థప్రసాదమును చేయునది. ఈ సాలగ్రామ తీర్థమును చేతితోనే ఇవ్వవలెను.






## అనుపమసింహుని సాలగ్రామ పరీక్ష

అనుపమసింహుడు సంకలనం చేసిన సాలగ్రామపరీక్ష:-
అథ విశేషమూర్తి నాం ఝటితి లక్షణజ్ఞానాయాదౌ
ఏక చక్రాది మూర్తయః ప్రదర్శ్యన్తే ॥
అథ ఏకచక్రమూర్తయః పురాణ సంగ్రహే ॥
పుండరీకః ప్రలం బఘ్నో వైకుంఠో మదుసూధనః ।
పీతాంబరో నరోరామో బలరామ సుదర్శనో ॥ 1
వీరనారాయణశ్చైవ క్షీరాబ్ది శయనస్తథా ।
సీరో పాణిస్తథా మత్స్యః పరమేష్ఠితథైవచ ॥ 2
ముసలి విశ్వరూపశ్చేతి ఏకచక్ర ఇమేమతాః 3

పద్మపురాణే:-
శుక్లో రక్త స్తథా కృష్ణో ద్వివర్ణో బహువర్ణవాన్
ఏక చక్రస్య సంజ్ఞాస్థు పంచజ్ఞేయ యథాక్రమమ్
అథ ద్విచక్రమూర్తయః పురాణసంగ్రహే
మత్స్య కూర్మవరాహశ్చ శ్వేతవరాహ వామనౌ
లక్ష్మీ వారాహో గరుడో వారాహో ధారుణీయుతః 1
నృసింహః పరశురామశ్చ వీరరామశ్చకేశవః ।
లక్ష్మీ నృసింహశ్చ శేషశ్చ ఉపేంద్రోదధివామనః । 2

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....





విష్ణుర్దాశరథీ రామో బలరామో హాలయుధః ।
రామో విజయకోదండ హృష్ట పూర్వస్త్రివిక్రమః । 3

కృష్ణోగోవర్ధనః కల్కి పద్మనాభో హరిస్తథా ।
ప్రద్యుమ్నశ్చానిరుద్ధశ గోపాలో లక్ష్మీపూరకః 4

రతథా శందన మదనగోపాలశ్రియుర్తస్తదా
బాలకృష్ణో హయగ్రీవో గోపాలో నామకపృకః 5

మాయా నారాయణః స ఏవ కేనలో గరుడధ్వజః
పండరికాక్షయ జ్ఞా చ శ్రీధరశ్చ గదాధరః 6

లక్ష్మీపతిర్వాసు దేవో మాధవః శేషశయ్యోపిచ
విదారణనృసింవాశ్చ నృసింహో రాక్షసాంతకః 7

ఆకాశకాల కపిలో యోగజ్వారా నృసింహ కః
విద్యుజ్జి హ్వాహో రకుక్షి విభీషణ నృసింహకాః 8

మహాహరా నృసింహాద్వా వివృతాస్యస్తథైవచ
కలినా శకరో రామోదశకంఠ కులాంతకః 9

నరశంకరపూర్వౌ ద్వౌ రూపనారాయణస్తథా
దామోదరో లక్ష్మీపూర్వః శుద్ధశ్చపురుషోత్తమః 10

సంనర్షణాథోక్ష జౌ చ దత్తాత్రేయ చతుర్భుజౌ
త్రైలోక్యమోహనః కృష్ణః సౌభాగ్యవరదస్తథా 11

రుక్మిణీ విజయౌచ తద్యచ్చూడామణి ధనంజయౌ
పారిజాతహరః కృష్ణ స్యమంతక హరస్తథౌ 12

కాలీయమర్దనః ప్రోక్తస్త ద్వచ్చాణూర మర్దనః
కృష్ణ సనాతనయుతః కృష్ణోగోవర్ధనస్తథా 13

సుదర్శనోమురారిశ్చవనమో వీణ యోగరాట్
అమృతహరణస్తర్వద్ గణేశశ్చ తథైవచ 14

శ్రీవత్సలాంఛన భనస్తద్వద్ ధారుణీధర ఏవచ
దేవ దేవో జగద్యోనిః స్వయంభూః కపిలస్తథా 15

ధర్మరాజోహరిహరో హైహయస్తద్వదేవ హి
హిరణ్యగర్భస్తద్విత్ స్సోద్ధంసః పరమపూర్వకః ॥ 16



ద్విచక్ర మూర్తయక్షశ్చైతాః సాకర్యేనా సదర్శతాం

1. అథత్రిచక్రమూర్తయః తీంత్రైవ :- (3చక్రములు)
నారాయణో హరిహరో లక్ష్మీనారాయణస్తథా
తద్వద్ధశరథీ రామః శంతాఖ్యోడి వాసుదేవకః ॥ 1

హంసః కూర్మోయ్యతశ్చైవ కేశవో బహురూపకః ।
అథోముఖనృసింహస్తు శింశుమారస్త్రి విక్రమః 2

మత్స్యస్త్రి మూర్తిః సీతేశః పురుషోత్తమ ఏవచ
త్రిచక్రా మూర్తి యశ్చైతాః సమాసేన నిరూపితాః 3

2. అథ చతుశ్చక్రమూర్తాయః ॥ తత్రైవ :- (4 చక్రములు)
చతుశ్చక్రాహరిహరసీతారామజనార్ధనాః
త్రివిక్రమః కంసమర్ధీ లక్ష్మీనారాయణ స్తథా 1

వట పత్రసాయీ శ్రీరామో బుద్ధ స్తద్వ చ్చతుర్భుజః
గోవర్ధన ధరశ్చైతాః చతుశ్చక్రా భవన్తి హి 2

3. అథ పంచ చక్రమూర్తీయః తాత్రైవ :- (5 చక్రములు)
శ్రీసీతారామ సహాయౌ పంచవ్రక్త విమౌస్మృతా॥
అథషట్ చక్ర మూర్తయః తత్రైవ
శ్రీమూర్తి స్తారక బ్రహ్మ సీతారమస్త్రి మూర్తికః
పురుషోత్తమో వ్యయశ్చైవ మధుసూదన ఏవచ
పట్టాభిరామః షట్చక్రమూర్తయః సుదాహృతాః

4. అథసప్తచక్రమూర్తయః తాత్రైవ :- (7 చక్రములు)
అనన్తః ప్రథమో జ్ఞేయోనృసింహః సర్వతోముఖః
సప్తచక్రాలిమే ద్వౌతు విజ్ఞేయౌ సర్వసూరిభిః

5. అథాష్టచక్రమూర్తయః తాత్రైవ :- (8 చక్రములు)
మహానారయణశ్చైవ చక్రపాణి పితామహౌ
అనంతే శ్చేతి చత్వారో హ్యష్ట చక్రాసమారి

6. అథనవ చక్రమూర్తయః తాత్రైవ :- (9 చక్రములు)
విష్వక్సేనా అచుతానందా నవచక్రాః సమారితః ॥

MOHANPUBLICATIONS.COM

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....








గుండ్రని సాలగ్రామములు

7. అథదశచక్రమూర్తయః తాత్రైవ :- (10 చక్రములు)
హృషికేశశ్చగోవిందస్త్వనంతో విశ్వరూపకః
మహావిష్ణుశ్చ పాతాళనృసింహః పురుషోత్తమః
సత్యవీరశ్రవాశ్చైవ దశ చక్రసమారితాః

8. అథైకేదశ చక్రమూర్త తాత్రైవ:- (11 చక్రములు)
ముద్దాశ్తే రుద్రచక్రో రుద్రానన్త సద్దైవ చ ॥

9. అథర్వోదశ చక్రమూర్తా తాత్రైవ :- (12 చక్రములు)
జ్ఞేయో ద్వాదశ చక్రస్తు ముకున్దః సూర్యఏవచ
అథ పునరష్టా చక్రాది త్రయోదన చక్రాన్తాః మూర్తయః
వసుచక్రాద్యాన గాన్తా అనంతాః పూర్వసంజ్ఞకాః ॥
అష్టాచక్రాదిత్రయోదశ చక్రాన్తాః
పూర్వ్కొక్తమహనారాయణార్యనన్తసంజ్ఞకాః

10. అథ చతుర్దశ చక్రాది చతుర్విదశతిచక్రాన్తా మూర్తయః (14 చక్రములు)
చతుర్దశాది చక్రైశ్చ యుక్తా విశ్వంభరాదికాః ॥
అనన్త స్తత్వా సంఖ్యాత విజ్ఞేయ విబుధైః క్రమాత్ ॥

11. అథ పంచవింశతి చక్రాదియా వాత్సంభవచక్రమూర్తయః
(15 చక్రములు)
యావత్సంఛక చక్రాన్గస్తనోనన్తా విశుద్ధకా ఇతి



12. అథ నిశ్చక్రమూర్తాయః తాత్రైవ :-
నిర్వాణబుద్ధ బుద్ధౌ ద్వౌ యోగే శోవిష్ణు పంజరః
సర్వోజతో వామదేవ ఈశానశ్చంద్ర శేఖరః ॥ 1
భవస్తత్పురుషః సర్వః శివనాభిఘోరకః ।
కుండవిన్యశ్చ సర్వాశ్చ నిశ్చక్రమూర్తా యోమతాః ॥ 2
ఏవంలక్షణ సంపన్నాః శిలాశ్చక్రైరలంకతాః
పూజనీయాం విశేషణ సర్వకామఫలప్రదాః

13. అథదశావతార మూర్తీనా లక్ష్మణాని:- (దశవాహర సాలగ్రామము)
తత్రాదౌమత్స్యాద్యా మూర్తాయః మత్స్య కూర్మసూకరో నరసింహస్తే
ద్వఖ్వర్వో భార్గవశ్యాథరామః రామసీ తారామప్రాణస్తథాన్యో రామః
ప్రోక్తోరాహిణయో ఽ పిబుద్ధః ॥
తథాకల్కీతి విఖ్యాతో వ్యవతారా విబోర్దశా॥

I. తత్రాదౌ మత్స్యమూర్తి లక్షణాని (మత్స్య సాలగ్రామము)
దీర్ఘద్వారయుతా స్నిద్ధా ద్వారమధ్యే ద్విచక్రయుక్॥
చక్రిమేకం పుచ్ఛభాగేదక్షిణే శఫరాకృతిః
వామో ప్రదర్శ్యతే రేఖా మత్స్యమూర్తి శుభప్రదా ॥ బ్రహ్మాండ పురాణే
త్రయోమత్స్య దయః శ్యామద్వి స్వాంకసంయుతాః (పద్మా)
మత్స్యాకృతి ముఖాకారం ముఖిసంద్రుశ్య చక్రకమ్
శ్రీవత్సబిందు మాల్యాం మత్స్యరూపంశుభం విదుః (గంధాంతరే)
నాసావర్ణయుతం దీర్ఘం స్పష్టచక్రం తు దక్షిణే।
వామే వామత్స్య సంయుక్తం మాత్స్యం సర్వఫలప్రదమ్ ॥
బిందుత్రయ సమాయుక్తం చక్రం వా శంఖలాంఛనమ్
దీర్ఘంచ దక్షిణం మత్స్యంచ చక్రం సమారితం ॥
(పురాణసంగ్రహే)

2. కూర్మ మూర్తి లక్షణాని (కూర్మమూర్తి సాలగ్రామము)
కూర్మ స్థాకారచ క్రాంశశిలా కూర్మః ప్రకీర్తితః (పద్మపురాణే)
కూర్మస్తతోన్నోన్నతః పృష్ఠేవర్తులా వర్తశోభనః
హరితం వర్ణమాధత్తే కౌస్తుభేనత చిహ్నితః (బ్రహ్మ)
ఇంద్రనీలానాభం స్థూలాత్రిం ఖాలాంఛితోన్నతా ॥

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....



కూర్మమూర్తిదవక్రాన్తి దుర్లభాసర్వకామదా ॥
(విష్ణు పురాణే)

కూర్మః స్యాదున్నతాంశలః పుష్టభాగే ఖురాన్వితాః ॥
విఖ్యాతోదుర్లభః సర్వమనోరథ ఫలప్రదః ॥ (గ్రంథాన్తరే)
వర్తులః కమఠాకారో వనమాలా ద్విచక్రవాన్
శ్యామాభో హేమబిందుశ్చ కూర్మస్థభువిదుర్లభః (వరాహే)

## బ్రహ్మాండపురాణం 4 రకాల కూర్మ మూర్తుల సాలగ్రామము కలవు అని చెబుతున్నవి

1. చతుర్థాకూర్మమూర్తిః స్యాప్తా ర్ధ్వభాగే ఖురాన్వితా
విఖ్యాతాదుర్లభాసర్వమనోరథఫలప్రదా
బిందు త్రయన్వితౌః శంఖం చక్రధ్వజ యతోపివా

2. దీర్ఘదక్షిణవా మస్య భానోద్వలయపంచకైః ॥
భూషితా కూర్మమూర్తిః స్యాదుర్లభాసర్వకామదా

3. వృతాయతా కూర్మమూర్తిః కనకభవిసంయుతా ।
స్నుహీ పుష్పాకృతి ద్వామి చక్రన్యోభాయ పార్శ్వత్మః ॥

4. వర్తులాకమలధాకారా దీర్ఘ ద్వారాతువైఖగా
నాభి చక్రయుతా రమ్యాకూర్మారౌతు పార్శ్వన ః ॥



తిరునామంలో సాలగ్రామములు



## 3. అథ వరాహ మూర్తి లక్షణాని
## (వరాహమూర్తి సాలగ్రామము)

త్రత్రచ త్వారోవరాహస్యభేశాః ॥ చతుర్థాత్రివరాహః
స్యాత్ తత్రాద్యః శుద్ధసంజ్ఞక
పృథ్వీవరాహస్త్వ పరస్తతో లక్ష్మీవరాహ కః ।
శ్వేతవారాహ కస్తుర్యస్తే షాలక్షణముచ్యతే ॥

## 4. శుద్ధ వరాహ లక్షణమ్

వరాహం శక్తిలింగంతు చక్రేతు విషమేస్థితే ।
ఇంద్రనీలనిభం స్థూలంత్రిరేఖాలాంఛితం శుభమ్ 1

కూర్మాంగనీవయంపశ్యేద్ వరాహం రూపమవ్యయమ్
గోష్పాదం యత్ర దృశ్యతే వరాహో నాత్రసంశయః 2

క్రూర్మంగయుక్తం వరాహస్వరూప మిత్యర్థమ్ (వరాహ పురాణే)
వరాహస్తువిజ్ఞే యశ్చ క్రేయస్యసటంరాజే (పద్మే)
వరాహ కృతిరభుగ్నశ్చ త్రాదిభిలంకాః ॥
అతసీకుసమ ప్రఖ్యా నీలోత్పలనిభా తథా

దీర్ఘాకారాతులై దీర్ఘద్వారయుక్తా సజర్జరా ॥
పృష్ణోన్నతా చదీర్ఘ స్యోద్వామతశ్చక్రయుగ్నకమ్
దృశ్యతే కౌస్తుభా కారా రేఖా పృష్ఠేచపార్శ్వతః

## 5. ధరణి వరాహ లక్షణమ్

దీర్ఘస్యం శ్యామలాకారం పృథగ్వలయేష్ఠితమ్
ద్వారదేశే లసచ్చక్రం భూరరాహ, విదుర్బుధాః (వరాహే)
అధోవక్త్రమసందిగ్ధం పృష్టోన్నతమపీనకమ్।
అంకశాకారవదనం భూవరాహం (పురాణసంగ్రహే)

## 6. లక్ష్మీవరాహలక్షణమ్

దక్షిపార్శ్వేగతేచక్రే సంలగ్నే ప్రదేశతః
వనమాలయతో లక్ష్మీవరాహః ప్రకీర్తితః ॥

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

MOHANPUBLICATIONS.COM

ఆధ్యాత్మిక జ్యోతిష, వాస్తు, వైద్య, మంత్రశాస్త్రాది గ్రంథములకొరకు....



### 7. శ్వేతవరాహ లక్షణమ్

దీర్ఘఘోణసమాయుక్తం ఏకదంష్ట్రం సునిర్మలమ్ ।
వనమాలాయుతం రమ్యం శ్వేత వరాహ ముచ్యతే । (తాత్రైవ)
గోక్షీరవర్ణమతులం వన మాలాంకితం తథా ।
శ్వేతవరాహకంనామతస్య పుణ్యమనంతనమ్ (నృసింహపురాణే)

### 8. అథ నృసింహ మూర్తి లక్షణాని

విదారణ రాక్షసాన్తక నృసింహ యోర్లక్షణముచ్చతే ॥
విదారణాభిధానం స్యాన్నృసింహం దీర్ఘకేసరమ్
అంతశ్చక్రం బృహద్ ద్వారం రక్షిణోన్నతమస్తకమ్ ।
విదారణమతి ఖ్యాతం దంష్ట్రాభ్యా ముపశోభితమ్ ।
బ్రహ్మ చర్యేణ పూజ్యోసౌ । యతిః సంపూజ్యేదేనమ్
గృహస్థపరివర్జయేత్ ॥ బ్రహ్మాండే
కపిలో గ్రంథమాలాధయోరక్తబిందు ఖురాన్వితః॥
విదారణ నృసింహితి రీధి కేశరశోభితః ॥
వామపార్శ్వేస్థితే చక్రే ద్విచక్రం చ బృహద్వక్త్ర గ్నేయాగ్నిధమ్
బహుచ్ఛిద్రం భిన్నవక్త్ర సువర్ణకనకాంచి
తద్రాక్షాసాంతకం జ్ఞేయం నృసింహం గృహదాహకమ్ ॥
(బ్రహ్మాండే)
అస్పష్ట చక్రం మత్స్యాస్యంకేశభారామనోహరమ్(గ్రంథాంతరే)

(అనేక మూర్తుల రకాలలో ఉన్న నృసింహమూర్తి సాలగ్రామంలో రెండు మాత్రమే దశావతార వర్గాలలో చేరాతాయి. మిగిలిన 17 రకాల నృసింహమూర్తుల సాలగ్రామాలు 24 రకాలు మూర్తుల వర్గానికి చెందినవి)

### 9. అథవామన మూర్తి లక్షణమ్

వామనాఖ్యా హరే మూర్తి ద్వివిధా పరికీర్తితా ॥
శుద్ధ వామన సంజ్ఞాకౌ వ్యాపారా దధి వామకా॥
శుద్ధవామన లక్ష్మణమ్ ॥
వామనాఖ్యా భవేద్దేవో హ్రస్వో యః సార్తిన్మ హోద్యుతిః ॥
అథర్వచక్ర స్థథోవక్త్రః సోపిస్వార్థప్రదో గృణామ్
(పద్మపురాణే)

అథసే పుష్పసంకశో బిందునా పరిభూషతః
వర్తులా శ్చతి హ్రస్వశ్చ వామనః పరికీర్తితః ॥ (బ్రహ్మపురాణే)
అతసీ పుష్పసంకశో బిందునా పిరిభూషతః ।
పారిజాతాద్వజో వజ్రో వర్తులశ్చతిశోభనః (పురాణసంగ్రహే)
కందర్పకుసుమాకరరేఖా పంచభూషితః
వర్తుల శ్చతు హ్రస్వశ్చవామనః పరికీర్తితః ॥ (గ్రంథాన్తరే)
ఇంద్రనీలనిభా భాసం వనమాలంబుజో జ్జ్వలమ్ ॥




శ్రీ మహావిష్ణువులో గణపతి సాలగ్రామము తెల్లనివి, నల్లనివి, నర్మదబాణములు

హ్రస్వచ వర్తులం చైవ వామనం పరిచక్షతే ॥ (వరాహే)
వర్తుల స్నిగ్ధ మవత్యన్త స్పష్ట చక్ర సమన్వితామ్ ।
స్ఫురేద్రభావ వియుత నాభిస్తయోన్నతో భవేత్
చక్రశ్శోభాయ పార్శ్వేతు స్నహి పుష్పాకృతి భవేత్ ॥
కేశభారేతు వైతారర్య దృశ్యత్ చక్ర పార్వతః
వామనోగృహీణాశ్రేష్ఠః సుఖాసౌభాగ్యసంపదః ।
(బ్రహ్మాణపురాణే)

MOHANPUBLICATIONS.COM

మోహన్ పబ్లికేషన్స్, కోటగుమ్మం,రాజమండ్రి -1.

